శ్రీరస్తు.

# రాజవంశప్రదీపిక.



ఇది

శ్రీవేదాద్రి యోగానంద నృసింహ వరప్రసాదలబ్ధ[illegible]
ధురీణులును, శ్రీమదమల పరిపూర్ణామృత[illegible]
గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా
దొడ్లేరు గ్రామకాపురస్థులగు
బత్తుల లక్ష్మయ్యగారిచే
రచియింపబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు

తెనాలి.

చెరువు[illegible] [illegible]గారిచే వారి
స్వకీయ సీతారామ ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడినది.

1909.

శ్రీరస్తు.

# రాజవంశప్రదీపిక.



ఇది

రేపల్లెతాలూకా రేపల్లెకాపురస్థులగు
మాడపాటి రామస్వామిగారి
ప్రోత్సాహమువలన

శ్రీవేదాద్రి యోగానంద నృసింహ వరప్రసాద లబ్ధక
వితా ధురీణులును, శ్రీమదచల పరిపూ
ర్ణానుభవజ్ఞులును, గుంటూరు జి
ల్లా సత్తెనపల్లి తాలూ
కా దొడ్లేరు గ్రామ
కాపురస్థులునగు

బత్తుల లక్ష్మయ్యగారిచే
రచియింపబడినది.

మొదటికూర్పు 1000 ప్రతులు

తెనాలి.

బేతపూడి జోగిసూర్యప్రకాశరావుగారిచే వారి
స్వకీయ సీతావిలాస ముద్రాక్షరశాలయందు
ముద్రింపబడినది.

1909.

## విజ్ఞాపనము.



ఆర్యులారా!

ఈగ్రంథోత్పత్తికి హేతువ తమకందరికి విశదమై యున్నది. యేనొక శాస్త్రజ్ఞుడను కాకున్నను నామిత్రుల మనోరథంబు దీర్పుటకు నొడంబడితి. నిందుగల కవికృత భ్రమప్రమాదిక సకలదోషంబులు క్షమించుటకు మిమ్ముల వేడుకొనుచున్నాను. ఇందునగల కొరతలు మూడవభాగంబున ముగించెదను.

యిట్లు బుధజనవిధేయుడు,

బత్తుల లక్ష్మయ్య.



# విషయసూచిక.






పుటసంఖ్య.

## రెండవ భాగము.





# శుద్ధపత్రిక.

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 18 | వీరరసస్ఫూర్తిదూరుద | వీరరసస్ఫూర్తిదూరుదు |
| | 22 | లక్షింప | లక్ష్యింప |
| 2 | 1 | యాహాంపృథ్వి | యామహాంపృథ్వి |
| 1 | 10 | సీతాదృశయయి | సీతాసదృశమై |
| 2 | 14 | కలుకూలమగు | కనుకూలమగు |
| | 20 | వర్ణింపవయ్యా | వర్ణింపునయ్యా |
| 3 | 19 | మయ్యోడ | మెయ్యెడ |
| 4 | 16 | ఐన | అనఘు |
| | | బౌనన | బునునో |
| | | నేరికగు | రామబో |
| | 21 | నస్మద | అస్మద |
| | 22 | షవేస్త్రి | స్త్రీవేష |
| 5 | 6 | క్షత్ర | క్షత్రి |
| | 15 | మహాప్రపూరణే | దుహాప్రిపూరణే |
| 6 | 16 | గొల్లడుకీలారి పసులకాపరి | గొల్లడుకీలారి గొల్లకిలారిపసులకాప |
| 8 | 12 | భూరి | బూరి |
| 11 | 18 | కుప్పవుచ్చి | [illegible]ప్పవచ్చి |
| 13 | 10 | వేనవాస్త్ర | వేదశాస్త్ర |
| 14 | 16 | తోడలజనిత | తోడజనిత |
| 15 | 17 | డె[illegible]టిదాజ్య | డొక్కటితరాజ్య |
| 19 | 4 | ప్రజలనేవేసు | ప్రజలనేలెను |
| | 11 | మూర్ధాభిక్తు | మూర్ధాభిషిక్తు |
| 20 | 19 | యాతిసర్మ్రేఘు | నయాతిర్మ్రేఘు |

| | | | |
|---|---|---|---|
| 27 | 2 | కణ్యా | కణ్వ |
| 31 | 6 | జన్మించెకంసాదమని | జన్మించెదమని |
| | 13 | గరుణ | గరుణాతో |
| 32 | ౨ | దురుగ్ధర | దుర్ధర |
| | 14 | నిజంబునసరులగా | నిజంబునరులగార |
| 33 | 9 | క్రోపికలు | గోపికలు |
| 33 | 17 | యదవంశ్యులగు | యదువంశ్యులగు |
| 35 | 11 | లావైరవు | లావెరవు |
| 36 | 1 | యనాగుచు | యనుచు |
| 39 | 9 | యాజమగు | యాపమగు |
| 40 | 18 | వత్సముగశిచి | వత్సముగవిశిచి |
| 41 | 19 | బూవని | బావని |
| 44 | 16 | లగ్నమున | లగ్నమున |
| | | బునలోన | బులలోన |
| | 17 | బాలతి | బాలల |
| | 20 | బునున్న | బుననున్న |
| | 21 | దరూలనొక్క- | దరూలనునొక్క- |
| | | పరిరణయ | పరిణయ |
| 47 | 14 | సీత | సీతలు |
| | 23 | వధింప | వంచింప |
| 48 | 10 | తీర్పునెడ | తెర్పునెడ |
| | 13 | చేయుచు | చేయు |
| 49 | 1 | నావిధ | నానావిధ |
| | 4 | కిన్ని | కన్ని |
| | 11 | దేవలని | దేవలుని |
| 50 | 6 | కఢి | కధి |

| | | | |
|---|---|---|---|
| 51 | 8 | డనఘు | డనగ |
| 53 | 13 | కెరింపు | కెరిగింపు |
| 56 | | నురకా | నురునకా |
| | 7 | నెమ్మ్రతిత్రో | నెమ్మ్రిత్రో |
| 58 | 1 | పట్టి | నట్టి |
| 58 | 15 | యుష్ఫమే | యుస్సమే |
| | 17 | నంద | నంద |
| 59 | 14 | హానా | హాసనా |
| 60 | 14 | కొన | కొని |
| | 19 | వారు | దారు |
| 61 | 11 | స్త్ర | స్త్వ |
| | 23 | వేండ్లు | లేండ్లు |
| 62 | 13 | ధర్మ | శర్మ |
| 64 | | జలికి | బలికి |
| 67 | 19 | మున | ముస |
| | 20 | రామ | రాక్రిము |
| 68 | 7 | సాత్వతం | పాత్వతతం |
| | 17 | ద్విధ | ద్వాధ |
| | | నంజ | నంముజ |
| 70 | | లైవ | లెన |
| | 12 | వ్యధ | ద్యధ |
| | 19 | వష్ణుండై | వశేషు |
| 72 | 28 | ట్లాంగా | ట్లాందగా |
| 73 | 20 | తతదాౖ | తదాౖ |
| | 22 | కూౖసు | న్రకూరు |
| | 23 | యిష్టవ | యిష్టముకవ |

| | | | |
|---|---|---|---|
| 74 | | దనుకు | దనేకు |
| | | కరుయు | కరుతైయు |
| 85 | 19 | దిమో | దివ్యో |
| | | తేన | దేవ |
| | 16 | పూన్వము | పూర్వము |
| 90 | 18 | శదా | శతా |
| 93 | 25 | సాత్య | సాత్వ |
| 99 | 4 | దేశ | దేవ |
| 103 | 3 | నస | నట్టిస |
| 105 | 15 | డబి | డనుబి |
| 112 | 5 | చతి | చవితి |
| 113 | 4 | ంము | చంద్రు |
| 115 | 13 | 73 | 78 |
| 120 | 19 | సాత్వతి | సాల్వతి |
| 122 | 14 | మమగ్ర | సమగ్ర |
| | 21 | భారము | భారతము |
| 125 | 7 | నిచ్చటక | నిచ్చ[illegible] |
| | 10 | జగ | గజ |
| | 12 | రావి | రాజవి |
| | 17 | మొదైన | మొదలైన |
| 126 | 6 | వీ | డైనవీ |
| | 12 | పుత్రుం | పుత్రుడని |
| | 13 | నె వము | వైష్ణవము |
| | 14 | తాభిమై | తాభిమానిమై |
| | 15 | లంము | లముగ |
| | 19 | హారా | హారంగా |

| | | | |
|---|---|---|---|
| 127 | 13 | ఉద్భత | ఉద్భవ |
| 128 | 16 | ఓమాంబా | ఓబమాంబా |
| 130 | 8 | కృరాజు | కృష్ణరాజు |
| | 17 | నేప | నేభూప |
| 131 | 1 | యులు | యుతులు |
| 135 | 9 | నాల | వాల |
| | 10 | పుట్టి | బుట్టిన |
| 137 | 12 | పట్నాని | పల్నా |
| 138 | 10 | అను | అగు |
| | 22 | సమాచిన | సమాచారమనుగానామె (జనిం |
| 139 | 12 | పులేరు | పాలేరు |
| 140 | 12 | చేర | చేరే |
| | 20 | కుర్వే | కుర్వే |
| 141 | 10 | హీనము | హీనము |
| | 16 | చున్నా | చునా |
| 142 | 2 | తశు | పశు |
| | 7 | విహి | విహీ |
| 143 | 17 | రఢు | రదేశఢు |
| | 20 | మేన | మేన |
| 145 | 20 | క్షత్రి | క్షత్త్ర్య |
| 146 | 2 | జిరా | జితా |
| | 11 | క్షత్ర | క్షత్త్ర్య |
| | | పాయు | ప్రాయు |
| | 18 | కర్య | కర్మ |
| 147 | 18 | జహ్వా | జిహ్వా |
| 147 | 23 | బ్రహ్మ | బ్రహ్మ |

| | | | |
|---|---|---|---|
| 148 | 2 | క్షత్ర | క్షత్ర్య |
| | 4 | క్షత్ర | క్షత్ర్య |
| | 8 | అతి | ఆతి |
| 149 | 5 | ప్రాత్య | వ్రాత్య |
| 150 | 12 | మాధ్య | మద్య |
| | 13 | వంఛ | వంచ |
| 151 | 9 | కూల | కుల |
| 154 | 10 | పాటిపాతక | పాతక |
| | 20 | సరా | సురా |
| | 21 | తత్యా | తత్సం |
| 155 | 10 | గవచనం | గమనంచ |
| | 13 | వైశు | పైశు |
| | 15 | ధరా | ధన |
| 156 | 4 | కునిన | కొనని |
| | 19 | లేరీరి | లెవరి |
| 157 | 5 | పేచ్చు | హెచ్చు |
| | 16 | దానిత్తై | దముత్తైన |
| 158 | 10 | త్రిశూద్రాణాంచ(తప్పు) | |
| 159 | 4 | ణానాం | ణాం |
| 160 | 16 | ప్రవగాడుల | ప్రమాదాదుల |
| | 20 | మాణి | మాలి |
| 162 | 13 | క్షత్ర | క్షత్ర్య |
| | 16 | శూత్ర | శూద్ర |
| 163 | 15 | నగర | గడ |
| 166 | 16 | తధ్వ | తద్వ |
| 167 | 6 | లన | లను |

| | | | |
|---|---|---|---|
| | 14 | భాగ | ఛాగ |
| 168 | | గిట్టి | గినట్టి |
| 169 | 15 | మాంధ | మాంధ |
| | 17 | ధాము | రాము |
| 170 | | శ్రీష్ణు | శ్రీకృష్ణు |
| | | శ్రుత | శ్రుతి |
| 172 | 20 | టయు | టయు |
| 173 | | సుతులు | శ్రుతులు |
| | 15 | కాదు | కాదా |
| 175 | 8 | రాజజన్యై | రాజన్యై |
| | 17 | నలై | నవై |
| 177 | 4 | లందు | లందదు |
| 179 | 10 | చుడును | చుడను |
| 180 | 1 | నగ | నదిగా |
| | | సూద్రి | శూద్రి |
| | | గ్వగ్న | గ్వగ్న |
| 182 | 11 | ప్రాతా | పాత్రా |
| 184 | 16 | మాధుం | మాగధుం |
| 186 | | జనుత | జననుత |
| 188 | 19 | చరిచమన | చరితమన |
| 189 | | జాతియా | జాతిగాయా |
| | | సత్పూచకులగుయీజాతివారందరునక్లే[తప్పు] | యేల |
| 190 | | జ్షాతం | జ్ఞాతం |
| 194 | | దూదేకు | దూదేకుల |
| 195 | | ధరాజు | ధర్మరాజు |

| | | | |
|---|---|---|---|
| 196 | 17 | పెరుగ | పెరుగు |
| 199 | 14 | దూరి | దూరిలో |
| 200 | 12 | రణోప | రణోద్యోగప |
| 201 | 2 | డను | డవను |
| 204 | 11 | క్షత్ర | క్షత్ర్య |
| 206 | 11 | నా | సా |
| 207 | 14 | చుజా | చుచాలజా |
| 209 | 20 | క్షత్ర | క్షత్ర్య |

చదువరులు యీశుద్ధపత్రిక ప్రకారం గ్రంథమంతయు ఇంకి
తో ముందుదిద్దుకొనియె చదువుటకు ప్రారంభించుటకు వేడెదను.






# గ్రంథపోషకులు.



ఏతత్ ప్రబంధ ప్రశస్త ముద్రితాకరణ దురంధరులును త దాస్వాయ పోషకులును గుంటూరుజిల్లా తెనాలి తాలూకా యడ వూరుపట్టణ నివాసులగు యదువంశక్షత్రియులు.

కుర్రా రామయ్యగారు.
కరేటి కొండయ్యగారి కుమారుడు రామయ్యగారు.
కుర్రా కొండయ్యగారి కుమారుడు వెంకటస్వామిగారు.
బొంతా ముత్యాలుగారు.
తాడిబోయిన వీరాస్వామిగారు.
కుర్రా నరిసింహ్వాంగారు.
కుర్రా వీరయ్యగారు.
కరేటి వుళ్ళక్కిగారు వరపు బాపయ్యగారు.
జడ తిరుపతిగారు.
ఆరదల చంచయ్యగారు.
కుర్రా చినవున్నయ్యగారు.
కుర్రా వుయ్యూరుగారు.
తాడిబోయిన పెదవున్నయ్యగారు.
తాడిబోయిన పిచ్చయ్యగారు.
తోట బాలకోటయ్యగారు.
కుర్రా నాగయ్యగారు.
జడ వెంకటప్పయ్యగారు.
మయిలా రామస్వామిగారు.

కరేటి క్రిష్ణమ్మగారు.
కరేటి సోమయ్యగారి కుమారుడు కోటయ్యగారు.
కుట్టా పిచ్చయ్యగారి కుమారుడు వెంకటస్వామిగారు.
కుట్టా అంజయ్యగారు.
కరేటి పోతురాజుగారి కుమారుడు రామయ్యగారు.
కరేటి రత్తయ్యగారు.
మువ్వా గురవయ్యగారు.
బొంతా వెంకయ్యగారు.
కుట్టా కనకయ్యగారు.
కుట్టా వీరబ్రహ్మంగారు.
కరేటి పెంటయ్యగారి కుమారుడు వీరయ్యగారు.
కుట్ట వెంకన్నగారు, సాకిన్ బందరు (స్టేషన్ ఆఫీసరుగారు)
కుట్టా బుచ్చయ్యగారి కుమారుడు రత్తయ్యగారు.
కరేటి బ్రహ్మనాయుడుగారు సాకిన్ జగ్గడిగుంటపాలెం.
మయిలా జంగంగారు. సాకిన్ సత్తెనపల్లితాలూకా జలాలపురము.

సీ॥ శృంగారమున నిషధేశ్వరు మెచ్చరు సతినెడ బాయుచో జడవారు। వీరరసస్ఫూర్తి దూరుదరభిమన్యు మరలుటెగుంగమి మయిలవారు। అతిభయంకరవృత్తి హరిసీను గొనరికిలించినాడని యు కరేటివారు। కరుణారస సమృద్ధి గాంతేయునెంచరు కులహాం తకుండని కుట్టవారు। భీభత్సరసమున భీభత్సుదలపరు మునసైరితో డాట మువ్వవారు। రౌద్రంబుననురుద్రు లక్షింపగర్దసం రంభుడటంచు యారదులవారు। విస్మయమునను గోవిందుడు కొండయెత్తుట

ము గీర్తింపరు కోటవారు । హాస్యతసౌమిత్రినైన చేకొనరింతి ము క్కచెక్కటభువి బొంతవారు । శాంతిరస శ్రీనిశాచరారిని మాయ మూర్తియందురు తాడిబోయినవారు । యనుచుకోవిదులెల్లను విను తిజేయ । నవరసస్ఫూర్తి యడవ్పూరి నగరమందు భవ్యవై భవజిత బలవైరులగుచు ప్రబలిరరుమగ యాదవాన్వయులుఘనులు ॥

శా॥ ఆరాజాన్వయు లేకమైనను ప్రియంబారంగ రావించి యిం । పారన్ రాజకులప్రదీపిక కృతిన్ హర్షప్రచేతోలస । ద్ధీరో దారత నాలకించిభువి ముద్రింపింపలోనెంచి వి । స్తారద్రవ్యసహాయ తన్ చిరయశో సంప్రాప్తులైరందరున్ ॥

సీ॥ శీతాంశువంశ సంభూతుడౌటెరిగించు దరహాసితాస్యసుం దరవిభవము। యనురాగ హృదయుడౌటను చూపుమైచాయ నిర్మల త్వము శౌచకర్మదెల్పు । నాగర్భలక్ష్మి ప్రభోగత ప్రకటించు కమ నీయ నేత్రపంకజయుగంబు । విష్ణుభక్తుండౌట వివరించు బోధాతి శారీరదివ్య లాంఛనవిభూతి అమ్మహాత్ముండు చావలి యన్వవాయు డద్రిధీరుండు కోటోజియను ఘనుండు స్వాన్వయోద్ధరణీయ ప్రబంధ మాత్మ । నరసిదీనికి పూర్ణసహాయుడయ్యె ॥



## విజ్ఞాపనము.



[illegible]

తే॥ సప్తసంతానములకంటె శతగుణంబధికమాన్యకులరత్న। నిరతాన్నదానవిద్యాలయాదులకంటె శతగుణంబధికమాన్యకులరత్న। అన్యయశాశ్వతధర్మశేషములకంటె శతగుణంబధికమాన్యకులరత్న। షోడశదానవిస్ఫూర్తిఫలముకంటె శతగుణంబధికమాన్యకులరత్న। సౌమ్యతమకంటె సత్తమసుతునికంటె। దలప గంగాది దివ్యతీర్థములకంటె। దేవళాక్షేత్రములకంటె ధిమణావృత్తి। దెలియ కులగత శతగుణాధిక్యమనఘా॥

## స్వాభిమానము.

సీ॥ స్వాభిమానమను పంచాక్షరిపఠియింప వంశంబు నిర్మలత్వమువహించు। స్వాభిమానమను పంచాక్షరిపఠియింప త్రైవర్గఫలము పూర్తిగలభించు। స్వాభిమానమను పంచాక్షరిపఠియింప నిహలోకసౌఖ్య భూయిష్టమొదవు। స్వాభిమానమను పంచాక్షరిపఠియింప చిరయశోలాభాప్తి జెందనౌను। దలప పంచాక్షరీ మహాత్మ్యము నెరింగి। శ్రవణమననిధి ధ్యాన సాధనముల। నిరతరానందవార్ధిలో దినగరయ్య। యదుకులోత్తములార భాగ్యనిధులార॥

సీ॥ ఈమంత్రమనగదా యామహాకాశశబ్దంబువీనులకు ముదంబొసంగె। నీమంత్రమునగదా యామహామారుత స్పర్శంబు త్వక్సుఖాస్పదమయ్యె। నీమంత్రమునగదా యామహాగ్ని స్వరూపంబు నేత్రానంద ఫలముగూర్చె। నీమంత్రమునగదా యామహాజలరుచి



    

శ్రీ రా మ లం.

శుభమస్తు.

అ వి ఘ్న మ స్తు.

# రాజవంశప్రదీపిక.



శా॥ శ్రీమద్గోత్రవహుం డఘాంతకుఁడరి శ్రేణీనిరాసుండు ని । స్సీమాజ్ఞాన తమోహరణుండు కరుణాసింధుండు భాస్వద్యశో । దామోదోదయమూర్తి కృష్ణగురు డార్యానందనాథుండు వి । ద్యాహేయుండిడు మాకుభూరితర సౌఖ్యంబుల్ ధరామండలిన్ ॥

సీ॥ ప్రథిత శౌర్యుండు శోభాధురంధరుడు కోటయ్యనేబుధ మౌళికయ్యాయమ్యో । సీతాదృశయయి ప్రసిద్ధిగాంచిన వెంకమాంబిక మెవ్వాని కవ్వయమ్యో । సంధానృశింహులై తన్నానెసంగినపిచ్చ యాఖిధుండేసూరి కన్నయమ్యో । సాధుచర్యాయోగమై ధన్యమైనసుబ్బమ్మయేఘనునకు భార్యమైయెమ్యో । నతడు శ్రీమాడపాటి వంశాంబు

రాశి । చంద్రముడు యాదవాన్వయ జాతుడనఘు । డైన జనుడు రామస్వామి యధిపానొకట । నాతనసుతుండు వెలసె వినమ్రుడగుచు ॥

ఉ॥ బత్తులవంశవార్ధిధి సర్వసుధాంశుడు శౌర్యధైర్యస । ద్వృత్తికి మూలకందమగు వేంకటసామియు కృష్ణమాంబికా । మత్తగవేంద్రయాన పెరిమంబగు చంద్రియతల్లిగాను నం । పత్తి వహించినాకు బుధవందితలక్ష్మయ నామసత్కవీ ॥

సీ॥ పరిపంథి తిమిరభాస్కరుడు మీపెదయన్న శ్రీకళాకరుడు మీ చిన్నయన్న । దలప గభీరోదధులు దయాంతఃకరణులు విద్యలచతుర్ముఖులు నలువురు । మీయనుజన్ములు కోటికీర్తి విశారదులుగారె వెంకయాఖ్యులు మరియును । ననఘపేరయ్య కోటయ్య గుర్వయనారసింహాహ్వయులన ప్రసిద్ధిగలిగి । సకలరాజన్యమాన్య శాస్వత్కృపాప శోభితోద్యోగ విభవ విశ్రుతవిహార । గరిమగాంచిరి మీపూర్వఘనులచరిత । మత్కృతంబందు మీభావములఘుతరము ॥

సీ॥ ఆబుభుక్షజనగోష్ఠి కలుకాలమగు మందిరవినిర్మితికి కంజభవుడవీవు । బహుశిష్య జనపరంపరలకునపవర్గ మార్గంబుజూపు నిర్మలుడవీవు । శ్రీతిరునగరి శ్రీకృష్ణదేశిక పాదవనరుహాదళ మత్తబంభరుడవు । మాధుర్యకావ్య నిర్మాణంబునకు పూర్వకవులబోలిన మహాఘనుడవీవు । యదుకులాంబోధి చంద్రుండ వరయగ మన । వంశమునకాదికందమై వరలుశీల । తిరుమలాదిగ పూర్వికపురుషవరుల । కీర్తినవర్ణింపవయ్య శ్రీకృష్ణపేర ॥

మ॥ కులధర్మంబు పరిత్యజించి మదిలోకుర్ జాడగన్పట్టుచా । యలసత్కర్మకలాప మాత్మనిడి గుర్వాలాప మేత్రాడ్డుహ్పు । జ్వల

జాతంబున దార్చినిశ్చలత మోతుక్రీనివర్తించునా । కిలధర్మంబులకా
దుకొల్ప హృదయంబెట్లొప్ప వర్ణింపుమా ॥

కం॥ కానీతనువింద్రియములు । గాననియధ్యాత్మబోధ కలితచిదా
త్మ । ధ్యానపరత దాదానను । జ్ఞానికి సిహచింత బంధకము గాదె
ధగాన్ ॥

గీ॥ యెంతకాలము మదివిషయేచ్ఛదగులు । నంతకాలము దుఃఖ
క్రియమొదలంప । నెంతకాలము నాత్మేచ్ఛనెనగుమనము । నంతకా
లము నానందమనరె బుధులు ॥

శా॥ దేహాత్మభ్రమదోషి నిత్యవిలసచ్చిన్మూర్తినేనంచు స । త్సో
హంభావము నాత్మగీలుకొలిపి సద్యోముక్తి బ్రాపింపకన్ । సాహం
కారత ధర్మకర్మకుల ముఖ్యవ్యాప్తినెల్లెంతునే । నాహాముష్మ ప
రాశరాత్మజుడు జేయంజింత వాపింపడే ॥

కం॥ కావునకులధర్మంబులు । బోవిడిచివిముక్తిజొప్ప బూనుమని
త్యం । బేదిథిభాతిక జగములు । బోవునుమీధర్మకర్మము లుభ్రమ
లగుటన్ ॥

వ॥ అనిన నయవిశారదుండగు రామస్వామి నన్నుంగని ఇ
ట్లనియె ॥

మ॥ అనఘామీరిపుడానతిచ్చినది సర్వాగ్నోక్తసత్యంబుగా । దనరా
దార్య సుబోధమయ్యెడ ద్రివర్గానంద మైయున్న మ । న్మనముకద్రి
ప్రక వర్ణధర్మము సమంజసూర్తిబోధించివ । ధ్యానలోపించు యు
గప్రచారము సముద్యత్ప్రీతి పాలింపవే ॥

గీ॥ కడగిధర్మార్థ కామమోక్షములు క్రమత । ననుభవింపంగ తగవెల్ల మనుజులకును । పరమపురుషార్థ మందనెవ్వరితరంబు । కోరి కొంకఁ దొఱఁగలరను మాటగాక ॥

క॥ ఇనికుల మిదియాశ్రమమని । విదితంబుగ దెలియరాక వృత్తులకన్యా । స్పదులై శశికులజాతులు । పొదలిరిహ శ్రీనిపరముబోనిడిధాత్రిన్ ॥

చ॥ తలపున గల్గుసంశయవితానము ప్రశ్నలు గాఘటించినే । దెలిపెదనుత్తరంబులు విధించిబుధౌఘము మెచ్చ కబ్బముఁన్ । దెలుఁపుము శాస్త్రరీతి జగతీజనిజమేర్పడ మామకీప్సితం । బలవడ దెల్పగాదగిన యాప్తులుబంధులు మీరలేకదా ॥

క॥ ఏనేకాదిధారుణి । లోనంగల శశికులజులు । లోనానందాంబోనిధిని దేలలాడరె । మానుగనీచరిత మెల్ల మదినారయఁగన్ ॥

క॥ లోకోపకారబుద్ధిని । చేకొనుమీకార్యమాత్మ జేయుడెమున్నా । శ్రీకృష్ణుఁడకల్మషుఁడై । లోకార్థసె వర్ణధర్మములు గైకొనఁగన్ ॥

క॥ ఐదమహాత్ములచరితం । బానవకాదనగ నేరికగు మన్మనమిం । దునదగిలె మిత్రవత్సల । తనుదగ దీర్ఘంగబాధ్య తనుబూనవలెన్ ॥

వ॥ ఆసియిట్లు ప్రార్థించిన స్వకులోద్ధరణ హేతుచేత సుకరంబగు నమ్మహనీయుని మనోభీష్టంబు పరోపకారబుద్ధిని నెరవేర్పందలంచి యుదధితరంగ న్యాయంబున సర్వంబును పరబ్రహ్మంబుగా భావించు నస్మదంతరంగ నిశ్చయంబువీడక శృంగార రసప్రదర్శనీయనవే స్త్రీధారియగు పురుషుని చందంబున స్వస్వరూపావస్థ

తి వికారతంబోరయుక్త పరాశర్యాది ఋషివిరచిత స్మృతులంస్మృతి కిందెచ్చుకొని యేతదభిమాన దోషంబాపాదింపమి నిశ్చయించి రాజవంశప్రదీపికయను నామంబున శ్రీకృష్ణ గుర్వర్పణంబుగ నొనర్పం బూనితెట్లనిన.

ప్రశ్న— అయ్యా యీలోకంబునంగల సర్వవర్ణములయందు బ్రహ్మ, క్షత్ర, వైశ్య, శూద్ర చాతుర్వర్ణంబులు వేదశాస్త్రాదికములయందు ముఖ్యముగా నిర్ణయింపబడియుండె నందుగొల్లలనువారు పైనాలుగు జాతులలోనం దేజాతివారు.

ఉత్తరము— యిప్పుడు సివాతీసగొల్ల గోపాలాదిక నామంబులు వృత్తినామంబులుగాని జాతినామంబులుకావు ఎట్లనిన. శ్లోకం॥ గోపగోపాల గోసంఖ్య గోధు గాభీరవల్లవాః॥ అమరం॥ గోపాది శబ్దంబులు ఆరును గొల్లవానిపేర్లు॥ గాః। పాతీతిగోపః-గాః। పాలయతీతి-గోపాలః-పా। రక్షణే-ఆవులరక్షించువాడు। గా-సంచష్టే-గోసంఖ్యః-చక్షిఙ్-వ్యక్తాయాంవాచి-ఆవులవిచారించువాడు-గాఃదోగ్ధీతి-గోధుక్-దుహ-ప్రపూరణే-ఆవుల పితుకువాడు-అసమంతాత్-భియంరాతీతి-అభీరః-రా-ఆదానే అంతటాభయముగలవాడు-గాః-అభీరః-ఈరయతీతి-ఆభీరః-ఈర-ప్రేరణే అంతట నావులతోలువాడు బల్ స్థైర్యంలు నాతీతి-లవః-స్థైర్యములేనివాడు-గోమహిష్యాదికం వలమానా। సంశ్లేషంతో వాంతగచ్ఛతీతివా. వల్లవాః వలసంవరణే-వాగతిగంధనయోః-గోమహిష్యాదుల చుట్టుకొనిపోవువాడు॥ అని గురుబాలప్రబోధిని॥ టీక॥ గోపః। గోపాః। ఆవులనురక్షించువాడు। గోసంఖ్యః। గోవులను విచారించువాడు-గోధుక్-ఆవులనుపితుకువాడు-ఆభీరః అంతటా భయముగలవాడు। అంతటా నావులతోలువాడు-వల్లవాః-గోమహిష్యాదులను జుట్టుకొనిపోవువాడు॥ అనిచెప్పియుండుటచే వృత్తినామంబులని యెరుంగవలయును. జాతినామంబులువలె వృత్తినామంబులు స్థిరంబులుగావు యేతద్వృత్తులే జాతివారాచరించినను గొల్లలని చెప్పబడుదురు.

భాగ--దశ--పూ.

గీ॥ గొల్లవారిబ్రతుకు కొరతనవచ్చునే। గొల్లరీతిపాల కుప్పద్రచ్చి గొల్లలెరిసురలు గొల్లమ్యోవిష్ణుండు । చేటులేనిమందు సిరియుగనిరి॥

తా॥ గొల్లవారియొక్క జీవనము తక్కువగానెంచకూడదని యు, గొల్లరీతిగా పాలసంద్రముతరచి, విష్ణుదేవుడును సురలును అమృతవిభవమును బడసిరని యు చెప్పియుండుటచే సముద్రమునుదరచుటచే సురలకు విష్ణుదేవునకు వృత్తినామమగు గొల్లలనబడిరని తెలియవలెను. ఇదియునుగాక ఈలోకంబున నేజాతివారైనను వర్తకముచేయుచుండిన వర్తకులనియు వజ్రంగము, కమ్మరము, అగసాల కాసే పనులచే జీవించువారేజాతివారైనను వడ్రంగి, కమ్మరి, అగసాలి, కాసే, బత్తులనే వృత్తినామములు ప్రశస్తముగా వాడుచుండుట మనకెల్లరకు విశదమయ్యేయున్నది. కాపు, గొల్ల, గోపాలాదిక నామములనట్లుగా భావింపవలయును.

గొల్లశబ్దంబునకు.

ఆంధ్రభాషార్ణవము.— స. పంగిరిరాగజెలుగు నుచ్చిష్టంబు గోపాలకుండొప్పు గొల్లవాడు । గొల్లకకీలారి పసులకాపరియు నంగ జెలగుచుండు । గోమహిష్యాకుల నామమునపరిత్రయు తో డుకుపసనము నాసడపుగొను । లంమ్మనంద యునిలాంమ్మ నాగాశీతముపట్టు పెంటనాదనుచుండు । నెద్దులగును వృషభాఖ్య యెసగుచుండు । వెలయుగంగ నాదేవ వృషభసంజ్ఞ । బసవడాబోతనంగ గోపతిపదప్పు। భూమిని ఛిదంగ శ్రీసూర్య సూతిలంగ ॥

తాత్ప॥ గోపాలశబ్దంబునకు ఆంధ్రంబున గొల్లవాడు, గొల్లడు, కిలారి, గొల్ల, కీలారి, పసులగాపరి, అనిచెల్లుచుండును.

భాగ--దశ--పూ.

శా॥ పట్టెగాప్రి మనుజేంద్రచేలములు నీకీబాడి యేమిరాలుం । గట్టంబోలునురేపడొయో ఘృతదధి గాప్రంబులనేమత్తు తై । యిల్లాడం జనెగాక గొల్లరకు మీకెల్లాడ నూరాడెజెన్ । గట్టాపాత్రము గోలు పోయెదు జుమీ కంసోద్ధతిబాలకా ॥

క॥ మారాజుహమ్ము గ్రైక్కొన । నేరాజులు వెరతుచింత యెళ్లిదమేసి
శ్రీరాజరాజగృహము న । నీరాజసమేలగొల్ల యేగుముతలగన్ ॥

క॥ ఏతెంచిచూచిచెలగుచు । నేతులుపెరుగులను పాలనీళ్లనువె
న్నన్ । బ్రీతివసంతములాడిరి । యాతురులై సరసభాష లాడుచుగొ
ల్లల్ ॥

ఉ॥ బల్లిదునన్ను భీష్మజనపాలకుమాకుని జిన్న జేసినా । చెల్లెలిరు
క్మిణిన్గొనుచు జిక్కకనిక్కపు బంటువోలెనీ । గొల్లతువ్వాయెడిన్
రథము గూడగదోలుము తేజితోల్లన । ధ్భల్లపరంపరన్మదము బా
పెద జూపెద నాప్రతాపమున్ ॥

క॥ గురుదేవహీనుబాలుని । గిరిభూజ ప్రముఖవాను గృష్ణునసీశు
న్ । బరిమాణశీలకులగుణ । విరహితుజే పట్టియుంగ్రువిడిచిరిగొల్లల్॥

క॥ అప్పుడుదెప్పరమగునా । చప్పుడు హృదయములజొచ్చి సం
దడిపెట్టన్ । ముప్పరిగొని పడిరెరుకలు । దప్పిధరణి గొల్లలెల్ల తల్ల
డపడగన్ ॥

క॥ జాపెరములేకయప్పుడు । గ్రేవులతో గొల్లసుతుల గృష్ణునిద
రలన్ । గీపెట్టన్మ్రింగెదనని । పాపపురక్కసుడు నేలబడియుండె
నృపా ॥

గీ॥ ఘోరదనుజునేల గూల్చి పర్వతగుహ । వాతనున్నరాయి
ద్రవ్యుదన్ని । గుహాజరించుచున్న గోపాలకులగొంచు । బల్లిదుండు
గొల్లపల్లెకరిగె ॥

మ॥ వల్లవబాలురర న్నగరివాకిటికిన్ వెడలంగద్రొబ్బుచుడీ । గొ
ల్లలముట్టికోల్గొనుచు కూరిమినిలుమని గట్టుడువ్వకిక్ష । దెల్లముగాగ

నేను వసుదేవునిజంపుడుతండ్రిగాను పి । శెల్లవిధంబులంబరుల కిష్టుడు కావను దుగ్రసేనునర్థి ॥

క॥ నాపేరును నాచిహ్నము । లేపునధరియించితిరిగెడిది పంత మొయిం । తేపోముదివరికించిన ॥ నేపంతమెరుంగు గొల్లడెమ్బుటనైనన్

జైమినీభారతము—స్త్రీ.

శా॥ తెల్లనిపట్టునామములు తీగెలనెట్టములుం బదంబులం। బెల్లగ జెప్పలున్నెవుల బింఛ్ఛమ్ములుం మొలనున్నకొత్తకర । బల్లను వన్నెగా బెరుగు పాలును నేతులువీకవంకకా। వ్వల్లధరించి శౌరిగనవచ్చిరికొం దరు గొల్లలర్ధితోన్ ॥

భారతం—అను.

గీ॥ కాలగేలగొల్ల కపిలదండించిన । నరకవాసమునకు నరుగవల యు। భూరినీరులొన్న యూదసియగ్గోవు । సత్కరింపనుగతి సంభవించు॥

ఇట్లుభాగవతాదులయందు యాదవ వంశ్యులయిన శ్రీకృష్ణాదులను గొల్ల, గోపాలక వృత్తినామంబుల వాడుటలు ప్రసిద్ధంబులై యున్నవి.

మరిన్ని.

హరివంశము 7 ఆశ్వా.

సీ॥ జలమున్నపైభూమియు నిలమీదమనుజులు మనుజులపై మేఘ మండలంబు । మేఘమండలమ్ముపై మిహిరుండుదేవ లోకంబననొప్పు నాకంబునాక । మేలుటకైన దివిజేంద్రత్వమిచ్చి నన్నినువ్వప్రతిష్ఠించి తీశ్వరుడవు । నాగలోకమమీద నలినజులోకమా లోకంబుమీద గో లోకమమరు । నట్టిగోలోక మేలువారైన గోపు । లనఘుగోవర్ధనాద్రిం

వ్రి మత్క్రమమున । సత్త్రియాత్మీయసంతతి నీవుగాచు । టాత్మగని యంతయును మోదమతిశయిల్ల ॥

వ॥ ఆగోవులు పితామహ సహితలై యుండి భవద్గౌరవం బభినందించుటకు నన్ను నిటబుత్తెంచి దేనును నామీఁదతప్పు నిన్ను దేలసుట ముఖ్యకార్యంబుగా జనుదెంచితి.

మరియొక వచనములో॥ కొంతభాగములు గోవులు నిన్ను గురించి తారాషినయువిగా జెప్పుమనిన మాటలు కొన్నిగలవా కర్ణింపుము.

సీ॥ పితుకుటమున్నట పెరుగుటలోనుగ గలుగునానావిధ కర్మములకు । నాత్మీయ సంతతులగువారినందర బనిచిలోకైక సంభరణమేము । గావించుకతమున కమలాసనాధులు మమ్ము బాటింతురు మాకునెడరు । పుట్టినచో చక్క జెట్టితిగ్రమ్మన గోరిప్రాణదమైన గురుడవీవు । రిత్తయుపచారములు యాదరించివిలువ । కస్మదీయకులస్వామి యగుటకర్థి । జేసియజనాజ్ఞచే యభిషిక్తుగాను । నర్పబుత్తెంచితిని జగన్మాన్యచరిత॥

గీ॥ అమరకోటికి నింద్రుండవైనయట్లి నీవుగోవులకింద్రుండ విదితముదలుగ గోకులంబున నెట్టెలంతలటిగాన నవఘుగోవిందనామ విఖ్యాతిగనుము ॥

యీపద్యములకన్నిటికి ముఖ్యతాత్పర్యము.

పూర్వము శ్రీకృష్ణుడు గోవర్ధనపర్వతమెత్తి గోవులపాలనంబు జేసి యింద్రుని పరాభవించుటచే స్వామినిగూర్చి దేవేంద్రుడు పలికిన మాటలేమనగా-జలముపై భూమియునందు మనుష్యులాపైన మేఘమండలంబు మేఘమండలంబుపై సోముండాపైని స్వర్గం బందుమీఁ

దసత్యలోకం బాపై గోలోకంబున్నదనియు నట్టిలోకపాలకులు గోపాలకులనియు నీవుగోవర్ధనగిరియెత్తి ఆత్మీయసంతతి అనగా నీవంశస్థులగు గోపకులయొక్క గోవులయొక్క సంతతిని రక్షించుట కాత్మయందలరి యగ్గోలోకంబునంగల గోవులు బ్రహ్మతోగలసి భవద్గౌరవం బభినందించుటకై యింద్రుడనైన నన్నుబుత్తెంచిన నిన్ను దెలియుట కార్యంబుగా జనుదెంచితియని వక్కాణించి తననుబుత్తెంచు కాలంబున గోవులు శ్రీకృష్ణునితో తమపలుకులుగా వలుకుమనినవిధము. పితుకుటయు, పెరుగుటయు, దున్నుటయు, మొదలుగాగల కర్మల కాత్మీయసంతతిచే గోలోకమును భరింపబడుటవలన మమ్ము బ్రహ్మాదులు గౌరవింపుదురట్టి మాకు నెడరుపుట్టినప్పుడు రక్షించితివిగాన మాకుదైవంబ వీవగుటచే నన్మత్కులస్వామి వగుటకు నిన్ను నభిషిక్తుజేయుటకై బ్రహ్మయొక్క యాజ్ఞతో నింద్రుబుత్తెంచితిమనిచెప్పి యాప్రకార మభిషిక్తుంజేయుట గలిగి నాటంగోలె గోవిందుడను నామంబు ప్రశస్తంబాయెనని చెప్పియున్నది.

మరిన్ని.

అమరం 613 శ్లోకం॥ గోమహిష్యాదికం యాదవంధనం॥ గోవులు యదువంశీయుల ధనమని చెప్పియున్నది.

యిందుచే యదువంశక్షత్రియులకు గోపాలక గొల్లవృత్తినామంబులు క్రమేణ స్థిరీకరింపబడినవి.

ప్రశ్న।— యిప్పుడు మీరుకనపరచిన దృష్టాంతరపద్యముల యందు గొల్ల, గోపాలాదికశబ్దములు వృత్తినామములుగానే వాడబడియున్నవి గాని కొన్నిచోటుల నిందార్హమగు నీచవాచకముగా వాడుటకు కారణమేమి.

ఉ|— గురుబాలప్రబోధిక 462 శ్లోకం.

గోపోగ్రామేషు భూరిషు ॥ అనేకగ్రామములయం దధికారముగలవాడు గోపుడనంబడును ॥ గాం - భూమింపాతీతి - గోపః ॥ పా - రక్షణే - భూమినిపాలించువాడు.

[నానార్థరత్నమాల.]

శ్లో॥ గౌః - క్రతౌవృషభే చంద్రే-వాగ్భూ-దిగ్ధే సుషిస్త్రియామ్ । ద్వయోస్తురశ్మి దృగ్బాణస్వర్గ వజ్రాంబులోమసు ॥ గో - పుం - ఇది - యజ్ఞమునకును - వృషభమునకును । చంద్రునకును । వాక్కునకును - నేత్రమునకును - బాణమునకు - భూమికిని - దిక్కునకును - స్వర్గమునకును - గోవునకును - వేరైనపుడు - స్త్రీ - కిరణమునకును - రోమమునకును చెల్లును.

గోపాలశబ్దంబు బ్రహ్మయందును, విష్ణువందును, శివునియందును, యింద్రునియందును, రాజుయందును వర్తించును. తచ్ఛబ్దంబుత్తమవాచకంబుగా విస్తరిల్ల నైచ్యంబెట్లగును. నీచమయినయెడల గోపాలకత్వేనవచ్చిన నామంబగుటచేత దుర్వృత్తిగలవారందరు నీచులెకావలయును అట్లొప్పుకొనిన.

భాగ--దశ--పూ.

గీ॥ గొల్లవారిబ్రతుకు కొరతపడచ్చునె । గొల్లకీలిపాల కుప్పవచ్చి
గొల్లలైరిసురలు గొల్లయ్యెవిష్ణుండు చేటులేనిమందు సిరియు గ.౨౨ ॥

పాలుచిలుకుటయొక్క వృత్తిచే శ్రీవిష్ణువును, సురలును గొల్లలనిచెప్పబడుటచే యావిష్ణువు నాభియందుద్భవించిన బ్రహ్మయును, బ్రహ్మయొక్క ముఖమందు భుజములయందును, నూరువులందు

నః, పాదములందును యుద్భవించిన చాతుర్వర్ణ్యములును గొల్లలేకదా. గాక గోపశబ్దంబుచే త్రిమూర్తులును దేవేంద్రుడాదిగాఁగల దేవతలును గొల్లలై యున్నప్పుడు అందరిని నీచులుగా భావింపవలసివచ్చును. కావున తమను తాము నిందించుకొను వెఱ్ఱివారెందైన గలరా యిదియునుం గాక గొల్లశబ్దంబు గోపాలనంబున వచ్చుటం జేసి గోవులు నీచంబులైన నగదా తత్పాలకుల వృత్తినామంబు నీచబగు నాగోవులయందు నీచత్వంబంగీకరించిన గోబ్రాహ్మణైకత్వమును బట్టి బ్రాహ్మణులు నీచులుకావలెను నందుకొప్పుకొనిన బ్రాహ్మణాధీనమగు చాతుర్వేదంబులును గోవులును తుల్యత్వమువహించుటచే వేదములు నీచములు కావలెను. అందుకొడంబడిన దద్ధర్మంబులగు యజ్ఞాదులును నీచంబులగు నట్లయిన తత్ఫలానుభూతంబులగు స్వర్గాపవర్గంబులును తన్నివాసులగు దేవతలును తన్నియోగాధిపతులగు త్రిమూర్తులును నీచులు కాలయును. అట్లంగీకరించి వేదబాహ్యులను జీవమాషకులనబడుదురు. అట్టివారికి వర్ణాశ్రమాచారాది ధర్మంబులులేవు గావున నట్లనరాదు. ఈవచనములు కొన్నిచోట్ల దూష్యములుగా నగ్గడించుటకు కారణంబేమనిన గోపాలనవృత్తిగల క్షత్రియులగు శ్రీకృష్ణాదులను భూపాలనవృత్తిగల ప్రతిపక్షవాదులగు క్షత్రియుల అధికారవ్యత్యస్తములచే తిరస్కరించి పలికినవాక్యంబులుగాని మరియొకటికాదు

ప్రశ్న.— యిప్పుడు సామాన్యముగా లోకమునందు వృత్తినామంబులచే వాడబడుగొల్లలను వారేవంశీయులు.

ఉ:— ఎరడిగినవారు రాజులుగా నెఱుంగవలయును.

ప్రశ్న:— కేనరుఁడు జాతిగాని । వీసము దా జే యనట్టి వ్యర్థుడు గ
సికోపమైనగాని । గాసులుగలవాఁడె రాజుగదరా సుమతీ ॥

భాగవతం—ద్వాదశస్కంధం.

క॥ బలవంతుఁడైనవాఁడె । కులహీనుండైన దొడ్డగుణవంతుఁడగున్।
కలిమియు బలిమియు గలిగిన । నిలలోపల రాజతండె యేమనవచ్చున్॥

భాగ—ఆది—షష్టా.

క॥ కులముగలవాడు శౌర్యము । గలవాడును నధికసేనగలవాడు
నుభూ । తలమున రాజను నామము । విలసిల్లగ దాల్చు మూఁడువిధ
ముల జేర్గిన్॥

మీఁదు చెప్పినరాజు లీమూఁడువిధములలో నేవిధమగు రా
జులు.

ఉ॥—— నేను చెప్పిన రాజులు వేదశాస్త్ర పురాణాదులయందు
వివరింపబడిన ప్రధానవంశంబులగు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర
జాతంబులలో రెండవదియగు క్షత్రియజాతిగాని వేరువిధముకాదు.
అవియెట్టులనిన క్షత్రియులలో సూర్యవంశమనియు, చంద్రవంశమని
యు ద్వివిధము. అందు గొల్ల, గోపాలాదివృత్తి నామంబులచే సా
మాన్యముగా వాడబడువారు చంద్రవంశపు రాజులుగాని మరియొక
జాతివారుకారు. యీక్షత్రియజాతికి మూలపురుషుడు చంద్రుడగు
టవలన చంద్రుడు రాజగుటచే యీచంద్రవంశ సంజాతులందరును
రాజులని చెప్పబడిరి. యిది కులనామంబుగాని వృత్తినామముగాదు.
మూలపురుషుడగు చంద్రునకు బుధుడును, బుధునకు పురూరవుడును
పురూరవునకు నాయువు, నాయువునకు నహుషుడును, నతనికి యయా
తియాదిగాగల నాలుగురు కొడుకులును నందుయయాతికి యదువు
మొదలుగాగల నైదుగురు కొడుకులుద్భవించి రాయదువంశసంజా
తులగు రాజులు యాదవులనియు, యదువు రెండవకొడుకగు సహ

ప్రజిత్తనువాని వంశజుడైన కార్తవీర్యార్జునుని కుమారుడైన, వధువు నకు వృష్ణుడును, యితనికి నూరుగురు కొడుకులు గలరందు జ్యేష్ఠుడు వృష్ణియనువాడు కీర్తిశాలియుండై యితనిపేర వంశంబు వృద్ధిపొందుటచే వృష్ణులనియును, వార్ష్ణేయులనియును, యాదవులనియును, వాడంబడిరి యదువంశోద్భవుండగు భోజుడనువానిపేరి వంశంబుజగ్గిల్లి యావంశ మువారందరు భోజులనంబరగిరి. సూర్యవంశ క్షత్రియులయందు ఇక్ష్వాకువంశమనియు, రఘువంశమనియు మొదలైన నామములెట్లు వచ్చెనో అట్లనే యదువృష్ణిభోజాంధకాది నామంబులు గలిగినవి. గోవుల పాలించుటచే గోపాలకులనియు, గొల్లలనియు, వృత్తినామ ము కలిగినది గావున వీరలుత్తమక్షత్రియులుగా నెరుంగవలయును.

యిందుకు ప్రమాణములు.

భాగ— నవమస్కంధమందు చంద్రవంశ క్షత్రియులని స్ప ష్టముగా తెలియపరుపబడియె యున్నది. గ్రంధవిస్తారణభీతిచే నక్క డంతగా వివరింపబడదు.

భాగ—నవ—లో.

గీ॥ చంద్రగోత్రమున చంద్రవంశమునందు । జంద్రకీర్తులతోడల జనితమైన । యట్టిపుణ్యవతులైన రారాజులనింక వినుము మానవేం ద్రచంద్ర ॥

భాగ-దశ--పూ.

క॥ తెలిసితివి సోమసూర్యుల । కులవిస్తారంబు వారికులము ధరి త్రి । కులనడవళ్లను వింటివి కలరూపముపెల్ల మాకు గడువెరగు లుగన్ ॥

క॥ ద్విజరాజ వంశవర్యులు । ద్విజరాజముఖాంబుజోపదిష్ట వ్రతు లై ద్విజరాజత్వము నొందిరి । ద్విజరాజాదిక జనంబు దీవింపంగన్॥

తా॥ చంద్రవంశక్షత్రియ శ్రేష్ఠులగు బలరామకృష్ణులు బ్రాహ్మణులచే నుపదేశింపబడి అనగా నుపనయనులై బ్రహ్మత్వమును పొందిర నియు భూసురులచే దీవింపబడినారనియు పరశురామహారాజునకు తెలుపుచు చెప్పినట్లును.

భార—హరివంశం 5 ఆశ్వా.

గీ॥ క్షత్రియుడనేను యదువంశసంభవుండ। దుష్టమర్దనసుజన సంతోషణముల। యందుమజాలెడువాడ ఘాలాక్షుగాంచ। నరుగుచున్నాడ కైలాస గిరికినిపుడు॥

తాత్ప॥ యదువంశమందు జనియించిన క్షత్రియుకననియు, దుష్టశిక్షా శిష్టపరిపాలనయందు నోపెడువాడననియు, శివునిజూచుటకై కైలాసమునకు పోవుచున్నాననియు, ఘంటాకర్ణుడను వానితో శ్రీకృష్ణుడు పలికినట్లునూ.

భాగ—న.

సీ॥ భోజవంశమువారు రాజులై యుండంగ యాదవుల్ కింకరులై చరింతు। రట్టియన్వయమున బుట్టియుగడుబాలు మాలితినీకంసు బాలిశుండు। గలడెయెవ్వడుబుతుర్రి బొలియించియూకృష్ణు డెక్కటి ద్రాజ్యమెల్లదాన। కొనిరెత్త పట్టంబు సనుబూన్పునతని పెట్టెనుర న్నపింఛంబుగుడిచె దొరటు। యొల్లగా పెద్దవాడనై లేమిబ్రతుకు। నిగ్గతి నభోగమెల్ల రుచించునేతు। హరికిబంటవుగాకనీ వవనిపతి వె। యిట్టి రాజ ధర్మధ్వంసినేనుసైప॥

తా॥ శ్రీకృష్ణునిపై జరాసంధుడు యుద్ధమునకు వచ్చినపుడు కృష్ణునకు సహాయమైన యుగ్రసేనునిగూర్చి జరాసంధు డాక్షేపించుటలో

భోజవంశమువారు రాజులై యుండగ యాదవులు దాసులై వర్తింం చిరనియు అట్టిభోజవంశమునందు బుట్టి రాజధర్మమును జెరచి వారి కిలోబడిన నీవు రాజవేనాయని యాక్షేపించినట్లు చెప్పియుండుటచే భోజవంశమువారును క్షత్రియులని యెరుంగవలయును.

భార—హరి—ఉత్త॥ 7 అ.

చ॥ మనుజులయందు నస్ఖలితమానస మగ్రులు రాజవంశసం। జని తులువీను హైహాయులు శైబ్యులు నైన్యులు రాఘవాన్వయుల్ । జనకులు నైషధుల్భరత సంభవులాదిగ గాసికోసలా। ద్యనుపమ దేశ రాజ్యవిభ వాదిక సౌఖ్య కళావిజృంభితుల్ ॥

అనిచిత్రరేఖ యుషాకన్యకతో చంద్రసూర్యవంశ క్షత్రియులను కనుపర్చినట్లును ॥

భాగ—ద—ఉ.

మ॥ ద్విజశిశ్రూషయు సూనృతవ్రతము సద్వృత్తిన్సుజాగర్వము। న్విజమాటోపము చాపనైపుణియు ధీవిస్ఫూర్తిఁ సత్కీర్తుఁలీ । రజనీనాధకు లప్రదీపకుల బౌరంజూడు పద్మాక్షిధ । ర్మజభీమార్జున మాద్రినందనుల సంగ్రామైక పారీణులఁ ॥

తా॥ రజనీనాధకుల ప్రదీపకులనుచో చంద్రవంశ క్షత్రియులు పాండవులని తెలియవలెను. యీవంశము పూరునికొడుకులలో విజయుడను వానిశాఖా సంబంధమగుటచే పాండవులు దుర్యోధనాధులు చంద్రవంశక్షత్రియులని యెరుంగునది.

భార—విరా— 5 ఆశ్వా.

సీ॥ విమలవంశంబునను పుణ్యాన్వృత్తమునను । వరలునీతనిరక్తంబు

వసుమతీశ । ధరణిపై నెన్నిబిందువుల్ దొరుగ । నన్ని వర్షములుగలు
గునిఁదనావర్షభయము॥

వ॥ ఉత్తమ ద్విజశోణిత పాతంబెల్లను గీడని యును.

తా॥ విరాటుప్రియచేతి పాచికె ధర్మరాజునకుతగిలి రక్తబిందువు వె
ల్లినప్పుడు ఇట్లు ద్రౌపతిపలికినట్లును ఇందువలబట్టి యుత్తమక్షత్రియు
లనగా ప్రధమక్షత్రియులుగా నెరుంగవలయును. అనగా రాజ్యామే
లుటచే రాజులనబడువారు కారనియు జన్మమందే ద్విజత్వముకలద
నియు నెరుంగవలయును.

భార—సభా.

క॥ స్నాతకులు పుణ్యకర్మన । నాతనులనబరగు బ్రాహ్మణక్షత్రి
యవి । జ్ఞాతులయందును క్షత్రియు । జాతిస్నాతకులమేము జనవినుత
నిక్కీ ॥

అనియును.

వ॥ ద్వారంబున మిత్రనివాసంబును సద్వారంబున నమిత్రవా
సంబును జొచ్చుట బాహువీర్య సంపన్నులయిన క్షత్రియులకు కర్త
వ్యయంబులనియును శ్రీకృష్ణుడు బ్రహ్మక్షత్ర్య వైశ్యజాతులయం
దు క్షత్రియజాతివారమని భీమాదుల సంబంధించుక పలికినట్లును ॥

భార—సభా.

క॥ సురమునివరులకు వసుధా। మరులకుభక్తుడను సత్తమక్షత్రియు
లాచరితుడనేనన నవనీ । ధరుడమ్మగధేశ్వరునకు దానిట్లనియెన్ ॥

తా॥ దేవతులకును, తాపసులకును, బ్రాహ్మణులకును, భక్తుడనని

యము స్వక్షత్రియుఁడననియును జరాసంధుఁడు శ్రీకృష్ణునితో బలికి నట్లును ఇట్లనేక ప్రమాణంబులవల్ల చంద్రవంశ క్షత్రియులకు రాజ నామంబు కులనామంబై యున్నది.

ఇదియునుంగాక.

అమరం—గురుబాలప్రబోధిని టీక.

శ్లో॥ మూర్ధాభిషిక్తో రాజన్యో - బాహుజక్షత్రియో విరాట్ ॥
టీక॥ రాజ్యారోపణకాలే మూర్ధ్ని అభిషిక్తః - మూర్ధాభిషిక్తః ॥ ప్రథమక్షత్రియః॥ తత్ప్రభవతయా- అనభిషిక్తా - అపి - మూర్ధాభిషిక్తాఖ్యాః । యథాబ్రహ్మ బాహుజస్య - వంశ్యా బాహుజాస్తథైవేతి జ్ఞేయం ॥ రాజ్యమునకు పట్టముగట్టినప్పుడు శిరస్సున నభిషేకము చేయబడు పట్టభద్రుఁడు. మూర్ధాభిషిక్తుఁడు ॥ ఇది ఆవంశమునందు బుట్టిన మూర్ధాభిషిక్తుఁడుగాని క్షత్రియమాత్రునియందును వర్తించును. ఏప్రకారముగ బ్రహ్మ బాహుజుని వంశమందు బుట్టిన బాహుజులనఁబడుదురో అలాగుననని తెలియదగినది.

రాజ్ఞః క్షత్రియస్యాపత్యంపుమాన్ రాజన్యః । జనీప్రాదుర్భావే-రాజుయొక్క అపత్యము రాజన్యుఁడు ॥౨॥ బ్రాహ్మః బాహ్వోర్జాతః బాహుజః । బ్రహ్మయొక్క బాహువులయందు పుట్టినవాఁడు ॥౩॥ క్షతాత్త్రాయతే క్షత్రః । తస్యాపత్యం క్షత్రియః । క్షతమువలన రక్షించువాఁడుగనుక క్షత్రుఁడురాజు । వానిఅపత్యముగనుక క్షత్రియుఁడు ॥ ॥ విరాజతే విరాట్ । ౙ - వృ - రాజృదీప్తౌ - విశేషముగా ప్రకాశించువాఁడు ॥౫॥

ఈవంశమునకు మూలపురుషుఁడు చంద్రుఁడగుటవలన చంద్రు

నకు.విరాజితంవిరాట్॥ జ. పు. రాట్. రాజ్బ. దీప్తౌ. విశేషము ప్రకాశించువాడు గనుక సార్థకనామ మవుటచేతను; శ్లో॥ రాజ న్యకంచనృపతి క్షత్రియాణాంగణేక్రమాత్॥ రాజక రాజన్య శబ్దములు వరుసగా ప్రజలనేలేడు రాజులసమూహమునకును క్షత్రియజాతి మాత్రము వారి సమూహమునకును పేళ్లు॥ రాజ్ఞాం సమూహారా జకం॥ రాజులయొక్క సమూహమని॥ గురుబాలప్రబోధిక॥

అమరం॥ శ్లో॥ ద్విజరాజశ్శశధరోనక్షత్రే శక్షపాకరః॥ ద్వి జానాం-బ్రాహ్మణానాం ద్విజరాజః ॥అని గురుబా॥

క్షత్రియులకు బ్రాహ్మణరక్షణ పరమధర్మమవుటచే ద్విజరా జని సార్థకనామము చంద్రునకు గలిగినది కాబట్టి యీవంశజులకు రాజనామమును క్షత్రియనామమున్ను మూర్ధాభిషిక్తుడనను కాకపో యినను కలిగియున్నది. మూర్ధాభిషిక్తుడు కానట్టి శ్రీకృష్ణుడు ఘంటాసురునితోటి జరాసంధునితోటి తాను క్షత్రియుడని చెప్పి యుండుటయే గాక ధర్మరాజుచేయు రాజసూయయాగమందు నుత్త మక్షత్రియుడనియు సర్వజ్ఞమూర్తియనియు నెంచి యఖిలరాజమం డలిలో అగ్రపూజ ధర్మరాజువలన పొందె గావున నీవంశోద్భవులం దరు రాజులుగా నెరుంగుము.

చంద్రవంశవివరణము॥ మత్స్యపురాణము. ౨౩ అధ్యాయము॥

చంద్రవంశ క్షత్రియకులమునకు మూలపురుషుడగు చంద్రున కుఅశ్విన్యాది యిరువదేడుగురుభార్యలుగాక లచ్చి, శినివాలి, ద్యుతి, తుష్టి,ప్రభ, కుహు, కీర్తి, వసువు, ధృతి, అనుతొమ్మండుగురు,చంద్రు నివరించిరివారిపతులగు నీరజేక్షణుమొదలగువారు చంద్రునికలుషిం

చి యుద్ధముజేసి జయింపలేక్రై రి. పిమ్మట బృహస్పతి భార్యను నపహ
రించి యామెయందు బుధునిగనియె నతనికి ఇలయందు పురూరవుం
డుగలిగె, యితను చక్రవర్తి, ఇతనికి శాపవశంబున నూర్వశి భార్య
యయ్యె. వీరిరువురకు ఆయువు మొదలగు నెనమండ్రుసుతులుగలిగిరి.
యందు ఆయువునకు నహుషుడు,వృద్ధశర్మ,రజి, రసుకు, విపాప్మ అను
నైదుగురు పుత్రులుగలిగి అందు రజయనువాడు నూర్వురపుత్రులం
బడశి తపఃప్రభావుండై దేవదానవ యుద్ధమందు దేవేంద్రాది సుర
ప్రార్థితుండై యసురుల జయించిన యింద్రుడు తనకు పుత్రుప్రా
యుడుగా నటించుటచే సంతసించి తన రాజ్యమంతియు దేవేంద్రున
కిచ్చి తపోవనికేగె. రజి కొడుకులు నూర్వురు తన తండ్రిరాజ్య మిం
ద్రుడేలుట సహింపక పోరి ఇంద్రపదవియు యజ్ఞభాగములుసహ
గొనిరి. పిమ్మట బృహస్పతిమాయచే ఇంద్రుడు వారలనోడించి అం
తయుపహించె॥

యయాతిచరిత్రము.

ఆయువు జ్యేష్ఠపుత్రుడగు నహుషునకు యతి, యయాతి, సం
యాతి, ఉద్భవుడు, పాంచి, సయాతి, మేఘసంయాతి, అన నేడుగురు
సుతులుగలిగిరి.

మత్స్యపురాణం॥ ౨౫--౫౦ శ్లో॥

యతిర్యయాతిసంయాతి రుద్భవః పాఞ్చి రేవచ । యాతిసర్మేఘ
సంయాతి స్సప్తైతేవంశవర్ధనాః॥యతియనుజ్యేష్ఠుడు వైఖానసయోగి
యై బాల్యంబుననచనియె. రెండవవాడగు యయాతి వృషపర్వుని కూ
తురగు శర్మిష్ఠయు శుక్రుని కూతురగు దేవయానయు యిరువురు భా
ర్యలుగనుండి దేవయానియందు యదువు, దుర్వసుడు యిరువురును

శర్మిష్ఠయందు ద్రుహ్యుడు, అనువు, పూరుడను ముగ్గురు పుత్రులు కలిగిరి ఈదేవయాని బృహస్పతి కుమార్తెయగు జయింతికి శుక్రాచార్యునియందు గలిగిన కూతురు.

యయాతికొక కూతురున్నట్లున్నది. యెట్లనగా అష్టకుడను సత్పురుషుడు స్వర్గమునందుండి యయాతి క్రిందబడునప్పుడు మన్మాతామహుడవని యయాతిని అంతరిక్షంబున తనవచన ప్రభావంబున నిలపిరక్షించె॥

యదువు మొదలగువారి వంశవివరము॥

యయాతి కుమారుడగు యదువునకు సహస్రజత్తు మొదలగు అయిదుగురు జనియించిరి. యీయదువంశంబున పంద్రెండవ పురుషుండగు కృతవీర్యునకు కార్తవీర్యార్జునుండు జనించె. ఇతనురావణాదియోధవీరుల పరాభవించినవాడు ॥ ఇతడు సహస్రకరుడు ॥ యీ మహాత్ముని చరిత్ర మఖిలపురాణములయందు వ్రాయబడియున్నది॥

యదువు రెండవకొడుకగు క్రోష్టునిసంతతిని నలువదిరెండవ పురుషుడగు సాత్వతునికి భాగినిడు, భజమానుడు, వృష్టి, యదువు మొదలగు నైదుగురు జనించిరి. అందు భజమానుని సంతతిని అయిదవపురుషునకు దేవకుడు, ఉగ్రసేనుడు అననిరువురు సుతులు గలిగిరి. అందు దేవకునికి దేవకి మొదలగు నేడుగురు కన్యలగనియెను. వారిని శూరునికుమారుడగు వసుదేవుడు పరిగ్రహించె. ఉగ్రసేనునకు కంసాదులుబుట్టిరి. పైభజమానుని వంశములోవాడే కృతవర్మ. సాత్వతుని యేడవ సుతుడగు వృష్టికి అయిదుగురు సుతులు గలిగిరి. అందు కడపటివాడగు శినికి సత్యవంతుడును, నతనికి సాత్యకియు, వృష్టియూడవ

కొడుకునకు ప్రసేనుడు, సత్రాజిత్తు ఇరువురు పుత్రులు గలిగిరి. యా సత్రాజిత్తుయే శమంతకమణిని నపహరించెనని శ్రీకృష్ణునిపైనింద మోపినవాడు. ఇతడే సత్యభామ తండ్రి. పైశూరునకు వసుదేవాది పుత్రదశకంబును శ్రుతకీర్తి, పృథ, శ్రుతశ్రవతాది పుత్రికాపంచకంబు నుకలిగె. అందు వసుదేవుని ప్రథమభార్యయగు రోహిణికి బలరాముడును దేవకికి కృష్ణసుభద్రలును కలిగిరి. వసుదేవుని సంతానమనంతము. వసుదేవుని తోబుట్టువులగు శ్రుతకీర్తికి కేకయులును శ్రుతశ్రీకు చైద్యుడును కలిగిరి. పృథను దానితండ్రి స్నేహాపెంపున కుంతి భోజునకు పాలనకిచ్చియుండగా పృథ కుంతియనంబరగి పాండురాజ మహిషియై ధర్మరాజాదులం గనియె. దేవకీసుతుడగు శ్రీకృష్ణునకు రుక్మిణి, సత్యభామా, జాంబవత్యాది షోడశ సహస్రాంగనలు వెలశిరి. అందు రుక్మిణికి ప్రద్యుమ్నాదులును, జాంబవతికి సాంబాదులు, యీరీతి కృష్ణభార్యలకెల్లం లక్ష యెనుబదివేల తనయులు జనించిరి. వీరలందరికి మూడుకోట్ల నరువదివేవురు సుతులుజనించిరి. యీయాదవ కులమంతయు నూరున్నొక భేదంబులు గలిగి శ్రీకృష్ణునిచే ప్రఖ్యాతిగాంచె.

మత్స్యపురాణము ॥ ౪౭॥ అ ॥౨౯॥ శ్లో॥

కులానాం శతమేకంచ యాదవానాం మహాత్మనాం - సర్వమేతత్కులంయావ ద్వర్తతే వైష్ణవేకులే ॥ మత్స్యపురాణం ౨౩ అధ్యాయముమొదలు ౪౭ అధ్యాయమువరకు పైనవ్రాశినసంగతులుకలవు.

దుర్వసు సంతతివివరము.

యయాతి రెండవకుమారుడగు దుర్వసుని సంతతి యేడుతర

ములవరికివర్ధిల్లి తండ్రిశాపనిమిత్తంబున నక్కడనుండి భిన్నంబయ్యె॥ ఇతని వంశంబున యేడ్వవస్త్రీ జారునివంశజుడు పౌండ్రియాడి దుష్యంతునిగాంచె॥ యయాతి మూడవకొడుకును శర్మిష్ట ప్రథమపుత్రుడగు ద్రుహ్యునిసంతతి తొమ్మండుగురు పురుషులపరియంతము వృద్ధినొందె॥ వారెల్ల మ్లేచ్ఛప్రభువులైరి. నాలవసుతుడగు ననువుసంతతియందు నారవతరపు పురుషునియందు ఉశీనరుడు, తితిక్షుడు, అననిరువురు పుత్రులు కలిగిరి. అందు ఉశీనరునకు, శిబిమొదలగువారుదయించిరి. వారిసంతానం బనంతంబయ్యె॥ తితిక్షునిపరంపరను మూడవపురుషునకు దానవేంద్రుండగు బలిచక్రవర్తి తనవంశంబంత నశించుటచే మనుష్యయోనిన బలియనజన్మించి తనపూర్వపుభార్యయగు సుధేష్ణంగూడి ప్రసిద్ధిజెంది అంగ, వంగ, సింహళ, పుండ్ర, కళింగులన, నేవురబ్రాహ్మణ పుత్రులంబడసె॥ రాజునకు బ్రాహ్మణపుత్రులెట్లుకలిగిరి యనిన॥

## దీర్ఘతముని జన్మాదికథ॥

అంగీరసునకు, ఉచథ్యుడు, బృహస్పతి, అననిరువురు తనయులుకలరు. అందు ఉచథ్యునకు, మమతయను భార్యవెలయు. ఆమెనుజూచి మరిదియగు బృహస్పతి మోహించి పొందంగమకించిననామె మీయన్న వీర్యంబున నిప్పుడు గర్భవతినై యున్నదాన. నాగర్భపిండమెప్పుడు వేదముచ్చరించుచుండును. నివీర్యంబమోఘంబు. యిప్పుడు దానిధరింపవలనుపడదు. యీశిశువుదయించిన పిదప నీయిష్టము వచ్చినట్లు జరుగగలదనియె॥ అనినవినక బృహస్పతి బలాత్కారమున నామమతనురమించె. తద్గర్భస్థుండగు బాలుడు బృహస్పతినిజూచి యిట్లు గర్భిణీస్త్రీని బలోద్గమనము చేయదగదనిన గురుడుకోపించి తనను తిరస్కరించిన కతంబున నాశిశువును దీర్ఘతముడుగను పుట్టం

దానుగను అపత్యగ్లానిళపెంచె. అందుచే నాశిశువు దీర్ఘతముడనుపేర బనించి ప్రఖ్యాతుడయ్యె. మమతగర్భంబు తం... గురునిశాపముభూమి పైబడి తక్షణంబున నొక శిశువై భరద్వాజుడై బరంగె. ఆశిశువును గురుడును మమతయు నిరాకరించి పుట్టినచోటనె డించిపోయిన సప్త మరుత్తులు వానింగొని పరిపాలించిరి. ఇట్లుండ నొకనాఁ డొక క్షే త్రంబుననుండొక సురభిపుత్రుండగు నొకవృషభము గోష్ఠోదయుక్త దర్భలందినుచుండ దీర్ఘతముఁడెరింగి దానికొమ్ములు గట్టిగాబట్టి నీవి ట్టినుష్టకృత్యము సేయఁదగునా నిన్నువిడువననియె. అంతన నావు డు దీర్ఘతమునింజూచి యిట్లనియె. ఋషిశ్రేష్ఠా నీవు నిర్బలిష్ఠుఁడవగుటచే నేనిట్లు చేసితి యిదినాతప్పుంగాక దినరా నిపదార్థంబుల దినరాదనియు చేయరాని కార్యంబులు చేయరాని యును పొందరాని దాని పొందరాదనియు నిబంధనలు జ్ఞానవంతు లగు నరులకేకాని జ్ఞానశూన్యులును చతుష్పాదజంతువులునగు మా కుకాదనియె. ఇట్లుదియూషిన గోధర్మంబు దనమనంబున నిడుకొని యావృషభమును విడచి యూరకుండి కొంతకాలము జరిగిన పిదప తనకు కోడలుగాఁగల స్త్రీని పొందుచుండ యాయమ యీమత్తగ్రుడ్డి వాఁడు యజ్ఞశాలనమున చెడ్డపనులు జేయుచుండెగాన వీనినుంచరాదని కొయ్యలచే నమర్చిన తెప్పపయి యునిచి గంగానదిని విడిచె. యిట్టు లనాదీర్ఘతముడు ప్రవాహమువెంట గొట్టుకొని పోవుచు నయ్యయో నేవచ్చెద ననుగావుడని మొరలిడుచు నొకగట్టుచేరె. ఆగట్టు బలిరాజ పాలిత పట్టణమగుటను బట్టి బలి దీర్ఘతముని తనమందిరమునకుఁగొని చని బహుకాలము బహుప్రకారంబులం దనిపె॥ [యీబలియను రాజు యయాతి మహారాజు నాలవకుమారుఁడగు అనువు వంశములో తితిక్షుని సంతానములో మూఁడవపురుషుఁడగు దానవచక్రవర్తియ

... ... ప్రాశవృద్ధిని మనుష్యయోనియందు బలియను రాజుగా జనియించె. నాయంధునకు దీర్ఘతముడు బలిఁజూచి నీయాదరణకు మోహనమందితి గోరినదాని నిచ్చెద జెప్పుమన బలి తనభార్యయందు పుత్రుల నిమ్మనియె. అంతట నానందించిన బలి తనపత్నియగు సుదేష్ణను దీర్ఘతముని గూడుమని యాజ్ఞచేసిన నాసుకుమారి యామును సళివాని పొందుట కిష్టలేక తనదాసి నాతనియొద్ద కనిచిన నది యాతనితేజంబున కక్షీ, కాంక్షి, అననిర్దష పుత్రులు కలిగిరి. అంత కొంతకాలమునకు బలి వారిద్దరు చిన్నవాండ్రు తనభార్యకు బుట్టినవారు కారనియు దాసియగు శూద్రస్త్రీకి బుట్టినవారనియు దీర్ఘతమునిచే నెరింగి మరల నొకనాడలంకరించి సుదేష్ణను నమ్మునిపాలకనిచె. ఇవ్వాళ్ళిద్ది వచ్చిన సుదేష్ణ దిక్కు ముఖంబుజేసి యమ్ముని యిట్లనియె. నీవు తొలుత ననుదాక ననహ్యాపడితివిగాన నిపుడు నిన్నస్పృశింపను. నీవు ధని మిశ్రితలవణముతో నామేనంతయు పూసి దానికై మధువును బూసి నాకిచ్చితే పుత్రలాభంబు గలుగుననియె. దానికామె యియ్యు చేయునది లేక దీర్ఘతముడు చెప్పిన పెరుగుప్పుతేనెల నాతని వంటికంటించి యాతని మేనెల్ల నాకుచుగాని యపహ్యమున సపాస్థలంబు నాకదయ్యె. అంతట నాబుషి దానికిట్లనియె॥ నీవు గుదము నాకనందున నీకు గుదములేని పుత్రులు కలుగుదురు. అన నావనిత మొక్కి తమింపుమన నొప్పక తప్పదనియె. పిమ్మట దానిశరీరమంత ముట్టిచూచి యపానస్థానంబులేక పోయినను నా స్పర్శచే దివ్యప్రభావులగు సుతులు కలుగుదురనియె. అంత నంతు వీర్యంబున సుదేష్ణయందు బలి, అంగ, వంగ, సింహక, పుండ్ర, కళింగులనేవురు బ్రాహ్మణ క్షత్రులంబడసె॥ అంత సురభి దీర్ఘతామునిపాలికేతెంచి నీవు మాగోధర్మంబు ప్రమాణంబుగా గైకొంటి యనుష్ఠించితివిగాన నిన్ బ్రౌ

హస్పతి శాపనిమిత్తంబున శాపరూపంబను నీయంధత్వంబుమాపెద
నని యతని శరీరము నాఘ్రాణించి శాపపాపంబు పీల్చిన నతండు
దివ్యయవ్వనవంతుండయ్యె॥ తనయంధత్వమును బాసి (గోతముడను)
నాఖ్యచే తేజరిల్లి గిరివ్రజప్రాంతమునకు తపముసేయ నరిగె॥ అతనికి
దాసీయందు బుట్టిన కక్షీసగా నతనివెంట నగ్గిరికరిగి యందుఘోర
తపముజేసి తనశూద్రత్వముబాసి బ్రాహ్మణుండయ్యె॥ కావున గో
తముడాతని (అనగా బ్రాహ్మణుడైన కక్షీని) తన సుతునిగాగానిన
నతనికి కూశ్మాండు గౌతములు అనవేఫురు సుతులు కలిగిరి. యిక
పైన జెప్పబడిన బలిపుత్రులలో నంగునివంశంబున భారత యుద్ధము
నకు ప్రసిద్ధుడగు కర్ణుడు ముప్పదారవ పురుషుడును, ముప్పదేసవవా
డగు సూతుడను పేరుగలవాడు, కర్ణునకు, వృషసేనుడు కొడుకును,
వృషసేనునకు వృషసేని యనువాడును కలిగె. యయాతి నాలవసు
తుడగు పూరునిసంతతిని పదునాలవ పురుషుడగు (దుష్యంతుడు)
యయాతి రెండవకుమారుడగు దుర్వసుని సంతతిలో యేడవస్త్రీ జా
రునివరించిన దుష్యంతుడు కలిగె యితడె॥ ఇతడు శకుంతలయను
కాంతను యేకాంతంబున పొందిన భరతుండు జనించె. అభరతున
కు పుత్రులు లేక మరుత్స్తోమము అను యజ్ఞముజేయ మరుత్తులు సం
తసించి పూర్వము అన్నభార్యను బృహస్పతి పొందినపుడు వెడలిన
వీర్యమువలన బుట్టిన భరద్వాజుని భరతున కొసంగి అవితథమహారా
జనిబరంగి ద్వ్యాముష్యాయణులను బ్రాహ్మణులకును, కాలీనులను
క్షత్రియులకును సంక్రమయ్యె. సితని వంశజాలెల్ల బ్రాహ్మణాది
కారంబును క్షత్రాధికారంబును కలిగి వెలసిరి. యీభరతునకు నే
డవపురుషుడగు శిబికి శైభ్యులను రాజులును గగుల్యులను బ్రాహ్మణు
లుంగలిగిరి. పంచ్రెండవవాడగు హస్తి తనపేర హస్తినాపురి

నిర్మించె. యితనికి అజామీఢుఁడు మొదలగు పుత్రులు జనించె. ఆయజామీఢు భార్యలలో కేశిని యను దానికి కణ్వమహాముని జన్మించె. ఆమహాత్మునికి మేధాతిథి గలిగె. అతని యన్వయజులెల్ల కాణ్వాయనులని బరఁగుచు బ్రహ్మక్షత్రియోచిత కారంబుల రెంటిం గల్గియుందురు. అయ్యజామీఢుని రెండవ భార్యయగు ధూమిని కొడుకు సంతతిలో నిరువదినిమిదవ వాఁడగు జనమేజయుఁడను వాఁడు సంతతి లేక వేయిసంవత్సరములు స్థాణుత్వంబన తపము జేయుచున్న ఉగ్రాయుధుఁడను సూర్యవంశజుని పుత్రునిగా గొని దాయాదులను దోలి ధర్ముని కృపచే జ్ఞానముబొందె. అజామీఢుని మూఁడవభార్య సంతతిని ముప్పదితొమ్మిదవ పురుషుండగు కృతుఁడనువాఁడు సామవేదము పఠించె॥ అజామీఢుని నాలవసతియగు నీలిని యనుదానికి నీలుఁడు కలిగె. అతని సంతతిని నాలవ వానికి అయిదుగురు పుత్రులు కలిగి అయిదుదేశంబు లేలిరి. వారేలిన దేశములే పాంచాలదేశము లందురు. ఆపాంచాలురలో నొక్కండగు ముద్గలునకు మౌద్గల్యులు పుట్టి యీయన్వయజులగు మౌద్గల్యులందరును గాణ్వాయనుల చందంబున బ్రహ్మక్షత్రియోచిత కారంబులుగల్గి యుందురు॥ ఆముద్గలునకు బ్రహ్మిష్ఠియను నతనికి వంధ్యాశ్వుఁడ నతనికి దివోదాసుఁడను సుతుఁడును అహల్యయను కన్యకయును గలిగిరి. అందు దివోదాసునకు మిత్రాయుతి మైత్రాయనుఁడు అను తనయులు జనించిరి. అందు మైత్రాయనునకు మైత్రేయుఁడు కలిగె. ఆయహల్య గౌతముని భార్యయై శతానందుని గనియె. శతానందునకు సత్యధృతియు నను కొడుకు గలిగె. యీసత్యధృతి యొకనాఁడు జలమధ్యంబున నొక యచ్చరకన్నెంగని మోహించిన నతని యమోఘవీర్యము వెడలి భూమిఁబడి యొక పుత్రుఁడును, నొక పుత్రికయు నయ్యె. వీరలే కృపాచార్యు

లు కృపియను స్త్రీ" అట్టిచిన్నవాండ్రి కొలన గట్టుననుండ శంతనుండుగని తన పురికిఁగొనిచని వారింబెంచె॥ అజామిళుని ప్రథమ భార్యయగు ధూమిని సంతాన తృప్తిలేక తపంబున నజామీళుని మెప్పించిన నతండు దానికి ఋక్షుఁడను పుత్రుని కలుగఁజేసె.

ఆఋక్షునకు సంవరణమునియు సతనికి కురువును గలిగిరి. ఆ కురువు ప్రయాగాది దేశంబులేలుచు పెద్దతపముఁజేసె గాన నస్థలం కురుక్షేత్రమనబరగె॥ అతని వంశజులే కౌరవులు. ఆకురువునకు నాలవపురుషుఁడు చైద్యుఁడను వానికి బృహద్రథుఁడు యదువు మొదలగు నేగురు సుతులు గల్గిరి. అందు బృహద్రథుని సంతతిని తొమ్మిదవవాఁడగు బృహద్రథునకు, జరాసంధుఁడును, యితనికి సహదేవుఁడును. వీరలు మగధ దేశాధీశులు॥

ఆచైద్యుని అయిదవ సుతుఁడగు ఋజుని వంశంబున పదునాలవ వాఁడగు ప్రదీపునకు, దేవాపి, శంతనుఁడు, బాహ్లికుఁడు అను మువ్వురు సుతులు జనించి వారిలో దేవాపి కుష్ఠురోగముచే మునియై తపంబుకేగె. బాహ్లికునకు, బాహ్లికశ్వైరులన నేడుగురు పుత్రులు కలిగిరి. శంతనుఁడు రాజ్యముబూని యధిక ధార్మికుఁడై యుండె॥ ఆశంతనుఁడు గంగను వరించి దానియందు భీష్ముఁగాంచె. నాశంతను సుతుఁడగు విచిత్ర వీర్యుని భార్యయందు వ్యాసులు ధృతరాష్ట్రుని, పాండుఁ; దాసియందు విదురుఁగాంచె. అందు ధృతరాష్ట్రునకు నూరుగురు సుతులు గలిగిరి॥

పరిక్షిత్తు కుమారుఁడగు జనమేజయుఁడు యాగముజేసి యందు యాజ్ఞ్యవల్క్యుల బ్రహ్మగా నియమించె. అదిజూచి వైశంపాయనుఁడు సైరింపక జనమేజయుని మాట చెల్లకుండునట్లును నతనికి యజ్ఞాధికార ముండకుండునట్లును శపించె॥

ప్రశ్న:— శ్లో॥ బ్రాహ్మణః। బాహూ విరాజతః॥ బాహుజః॥ బ్రహ్మ బాహువులయందు బుట్టినవారు ప్రథమ క్షత్రియులు రాజులు అనియును ప్రమాణములుండగా నీచంద్రవంశజు లెట్లగుదురు.

ఉ:— ప్రపంచమందు సూర్యవంశ చంద్రవంశ క్షత్రియులని చెప్పబడి యున్నదిగాని వీరు గాక బ్రహ్మయొక్క బాహువులయందు జనించిన వారిని వారి వంశము తెలియదు. సూర్యవంశమునకు సూర్యుడును, చంద్రవంశమునకు, చంద్రుడును, మూలము.

వారి జననములు.

భాగ—హరి—సూర్యజననం.

క॥ తనహృదయేశ్వరుగశ్యపు। ననుకూల ప్రీతిగొలిచి యదితియతపా। వనతేజంబున దాల్చెను। దనయు న్లూలుగ సహస్రధాము మహాత్మున్॥

తా॥ కశ్యపప్రజాపతి అదితియందు సూర్యుని గాంచిన ఆదిత్యుడనంబరగె నని యు జెప్పి యుండుటచే సూర్యవంశముకు క్షత్రియ వంశము బ్రహ్మయొక్క బాహువులయందు జనించినట్లు తోచదు.

చంద్రుని జననం॥ భాగ—నవ.

సీ॥ ఒకవేయి తలలతోనుండు జగన్నాథు బొడ్డుతమ్మిని బ్రహ్మ బుట్టె మొదల। నతని గుణంబుల నతని బోలెడు దక్షు డత్రియను సంజాతుడయ్యెనత్రి। కడకంటి చూపులకలువలసంగడీ డుదయించె విప్రుల కోషధులకు। నంబుగర్భములకు నజుడు పంపున నాధుడై యుండి రాజసూయంబు జేసి। మూడు లోకములను గెల్చి మోదమునను।

జని బృహస్పతిసతి జారజారుమూర్తిః । దారః లుసొచ్చి గోపోయి తన్నగురుడు । వేతునందాక సయ్యింతి విదువవచయ్యో॥

తా॥ సహస్ర శిరస్సులతో ప్రకాశించు నారాయణమూర్తి యొక్క నాభికమలమందు బ్రహ్మజనించెననియు నతనికి గుణతుల్యులగు దక్షుడు అత్రియు జనించెనియు అత్రియొక్క కడకంటి చూడ్కులను జంద్రుడుదయించి విప్రులకు, యోషధులకు, మేఘములకు బ్రహ్మపంపున నాథుడైయుండి రాజసూయ యాగముచేసి త్రిజగ విజయం బొనర్చెననియు జెప్పబడి యున్నది. ఇట్టి సూర్యచంద్రులెవ్వరు బ్రహ్మ బాహువులయందు బుట్టినట్లు కనుపడదు. బ్రహ్మ బాహుజులు కారన వేదవిరుద్ధం బగుటయెగాక క్షత్రియత్వంబునకు హానివాటిల్లును. కావున రజోగుణ విశ్వమూర్తియందు రెండవ జాతియని అన్వయించవలయును. మరిన్ని బాహువులచే జీవించు వారవుటవలన బాహుజులని చెప్పబడియున్న దింతియెకాని మరియొకటికాదు.

ప్రశ్న:— భగవద్గీత॥ మోక్షసంన్యాసయోగం అను అధ్యాయం

శ్లో॥ శౌర్యం తేజోధృతిర్దాక్షం । యుద్ధేచాప్యపలాయనం । దానమీశ్వర భావశ్చ క్షాత్రంకర్మస్వభావజం॥

తా॥ శూరత్వము, తేజము, ధైర్యము, సామర్థ్యము, యుద్ధమునందు పారిపోక నుండుట, దానము, ప్రభుత్వము ఇవి క్షత్రియులకు స్వభావమువలన బుట్టినకర్మలు అని చెప్పియుండగా నీచంద్రవంశ క్షత్రియులు స్వకుల ధర్మంబగు ప్రభుత్వమును విడచి పశుపాలనత్వం బెందుకంగీకరించిరి॥

ఉ.— పూర్వయుగమందు దేవాసుర యుద్ధంబున మరణించిన

దానవులు ద్వాపరయుగంబున చంద్రవంశ క్షత్రియులై జనియించి స్వభూఖండంబు నాక్రమించి మదించి ధర్మంబుదప్పి దుష్టప్రవర్తనంబుల లోకంబుల బాధింప భూదేవి తద్దోషభారంబు భరియింపనోపఁ జాలక బ్రహ్మకు దేవతలన్ గూడుకొని శ్రీకృష్ణుని వేడిన కరుణించి తమ్మాభ భారనివారణార్థము తానును, దేవతలును, యదువంశంబున గంబుట్టి జన్మించె. కంసాదులని చెప్పి తత్ప్రకారము జనించి కంసాది రాక్షసుల దర్పంబున కాగజాలక రాజ్యపాలిత వృత్తులు వదలి స్వకులధర్మంబు తప్పనీక గోపాలనంబొనర్చిరి॥

ఇందుకు దృష్టాంతంబు లుగ్గడించెద వినుము.

భాగవ—ద--పూ.

సీ॥ రాజేంద్ర వినుతొల్లి రాజలాంఛనముల వేలసంఖ్యల దైత్య
విభులు దన్ను । నాక్రమించిన భారమాపఁ జాలక భూమి గోరూపయై
బ్రహ్మ కేఁగఁబోయి । కన్నీరు మున్నీరుగా రోదనము సేయ గరుణ భా
వించి కమలభవుఁడు । ధరణి నూరడఁబలికి ధాత్రియు వేల్పులు గద
లిరా విష్ణునిగానఁ బోగి । పురుషసూక్తంబు చదివి యుద్ధృత సమాధి ।
నుండ నొక మాటవిని వారి జోద్భవుండు । వినుఁడు వేల్పులు ధరయు
నే విన్న యట్టి । పలుకు వివరింతునని ప్రీతిపలికె దెలియ॥

క॥ యాదవకులమున నమరులు । మేదినిపైఁ బుట్ట జనుఁడు మీయం
శములన్ । శ్రీదైవతుఁడు వసుదేవుని కాదరమున బుట్ట భారమంతయు
బాపున్॥

భాగ--ద్వతీ.

చ॥ నరకముర ప్రలంబయవన ద్వివిదముష్టికమల్లకంస శం । బర

శిశుపాలపంచజన పౌండ్రక పిప్పలసంతవక్త్ర వానరఖర సాల్వవత్స బకనాగ విదూరక రుక్మికేశిదు । రుద్ధుర వృషధేనుకప్రముఖ దుష్టనిశాటులదృంచె వ్రేల్మిడిన్॥

యీపద్యమందు కనుపర్చిన నరకాసురాది రాక్షసులను యదువంశమునందు శ్రీకృష్ణుడు జనించి సంహరించి నాడనియు॥

భారతం--అర--౬--ఆ,

క॥ క్షితిసంశస్తకులనగా । శతలక్షసహస్రసంఖ్య జనియించిరి ద । ర్పితులయి దనుజులు తద్బల । తతిచే సమరమున నింద్రతనయుడు చిక్కెన్॥

భాగవతము-- ద--పూ

సీ॥ ఒకనాడు నారదుండొయ్యన కంసుని యింటికి చనుదెంచి యేకతమున । మందలోపలనున్న నందాదులును వారి భార్యలు పుత్రులు బాంధవులును । దేవకి మొదలగు తెరవలు వసుదేవుడాది గాగల పర్యాయాదవులును । సురలుగాని నిజంబున నరులుగారని జెప్పి కంసుండ నీవు రక్కసుడ వనియు । దేవమయుడు చక్రి దేవకీదేవికి । పుత్రుడై జనించి భూతలంబు । జెరుప బుట్టినట్టి చెనటి దైత్యుల నెల్ల । జంపుననుచు జెప్పి చనియెడివేళ॥

క॥ నారదు మాటలు విని పై । ల్లారాటము బొంది యదువు లని మిషలనియున్ । నారాయణ కరఖడ్గని । దారితుండగు కాలనేమి దానని మరియున్॥

భాగ--ద--పూ.

సీ॥ అవనీశ వినుద్రోణుడను వాడు వసువులయందు ముఖ్యుడు ధర యతని భార్య । వారినిద్దరి బ్రహ్మ వసుధపై జన్మింపుడంచు బంపినవా॰

రలతని జూచి । విశ్వేశ్వరుండైన విష్ణుసేవారతి మాకిచ్చి తేసియు మ హీజనింతు । మనవుడు నట్లుగా కనిమె వేల్పులపెద్ద యాద్రోణుడీ నందుడై జనించె।ధరయశోదయయ్యె దనుజేంద్ర వైరియు । కవ లగర్భ మాట గారవించి । తన్నిదంద్రులందు దగవారి మన్నించె । నధిక భ క్తితోడ నలరిరిట్లు॥

పైమూడు పద్యములకు ఒకే తాత్పర్యం.

ఒకకాలమందు నారదుండు కంసునికడ కేతెంచి రహస్యము గా నందాదులును వారి పుత్రమిత్రకళత్రాదులును దేవకి మొదలగు గోపికలును వసుదేవుడాది గాగల సమస్తయాదవులు దేవతాంశసం భూతులుగాని నరులుకారనియు దుష్టరాక్షస శిక్షకై దేవకీదేవికి నారాయణుండు జనియించు ననియును, నీవు కాలనేమియనెడు రా క్షసుండవనియు వసువులలో పెద్దవాడగు ద్రోణుడను వానిని చతు ర్ముఖుడు భూలోకమున జనించుమనిన నాకును విష్ణుసేవారతి గలి గిన జనింతుసను విధియొడం బడుటచే నతని మాట గారవింప దలం చి శ్రీకృష్ణుడు ద్రోణుడను నందునిచేతను ధరయను నతని భార్య య శోదచేతను కృష్ణుడై పోషింపబడెననియు, నారదునిచే తెలిసికొని చింతించెనని చెప్పియున్నది. గావున యాదవంశ్యులగు క్షత్రియులు దేవాంశులనియు కంసాదులు రాక్షసాంశులనియు నెరుంగునది.

యింకను కంసునిచే యాదవాదులు విదేశగాములైనందుకు.

భాగ--ద--పు.

వ॥ తదనంతరంబ తొల్లి కంసభీతుండై విదేశీయులై కృశీయుం పుచున్న యదు, వృష్ణి, భోజ, మధు, దశార్హుల, కుకుర, అంధక, ప్రముఖులగు సకలజ్ఞాతి సంబంధుల రావించి చిత్తంబు లలరిపింత్తుంబు లిచ్చి వారి వారి నివాసంబులనుండ నియమించి నివ్వధంబున॥

5 ‡

తా॥ దేవతలందరికి విష్ణువు కర్తయనియు ఆవిష్ణు ధర్మంబు నంను దేవతులు, గోవులు, భూమిదేవతలు, దీక్షలు, ఆమ్నాయము లు, భూతదయయు, సత్యము, యజ్ఞములు, తపమును అంతరేంద్రి యని గ్రహంబును, శాంతంబును, నివియన్నియు విష్ణునిదేహమని జెప్పియుండుటచే [నావిష్ణుఃపృథ్వీపతిః] యను న్యాయంబున నతని దేహసంబంధమైన ధర్మములను రక్షణ చేసికొనకున్న రాజైన వాని కి విపత్తు కలుగును. గనుక గోబ్రాహ్మణాది రక్షణంబు క్షత్రి యులకు పరమ ధర్మంబై యున్నది గాక.

భార—అ—౩—అ.

క॥ నీవును నవధానముతో గోవుల మన్నింపు పాత్రకోటికొసే గుత । త్పవిత పుణ్యాచరితము । లావైరవ్రుకబోల వెన్నియైన గు మారా॥

తా॥ నీవు గోవుల నెక్కుడు శ్రద్ధతో రక్షించుటయు పాత్ర తగల దానము చేయుటయు ముఖ్యము. ఆపుణ్యమునకు సరియైన పుణ్యము లెన్నియైన కావని భీష్మాచార్యుడు ధర్మరాజున కెరిగించె.

భాగ—న.

గీ॥ శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు । గోవులందు విప్ర కోటియందు । ధర్మపదవియందు దగిలి నాయందు వా । డెన్నడలు గునాడె హింసజెందు॥

దేవతలతో నారాయణుడనుజ్ఞ యిచ్చినట్లును॥

భాగ—షష్ఠమ.

క॥ దేవతలకు ఋషులకు పితృ । దేవతలకు నాకు నీకు ధీరులకు

ను నానావర్ణాశ్రమములకును । గోవులకును బాధయనుగుచు గుంరెదననుగూ॥

ఇట్లు గోరూపిణియగు భూదేవితో ధర్మదేవతపలికె నట్లును.

భాగతము—అను—౧—ఆ.

గ్రంథ విస్తరణభీతిచే గోప్రభావమందు ముఖ్యతాత్పర్యము.

పూర్వంబున విశ్వకర్మ తపోనియతుండై యజ్ఞాదరము తనయ నొత్పత్తిచే కామరూపిణియగు సురభియను కన్యను పురుషుని సృజియించిన నాసురభింజూచి పురుషుండు మోహితుండై యాతని నెంమట జూచి మార్గోద్భవయని యతని యార్తిమాన్పుటచే మాతాజంకుండని యతనికి నామంబిడి యాసురభిని యాతనికిచ్చిన యయ్యిరువురకు ప్రభవించిన సౌరభేయాకులంబు యానెలతకు జనించిన యపత్యంబులు యాగాపవర్గ క్షీరజనకంబులై తనలోకంబునకు పరిలోకంబున వర్తింప బ్రహ్మవరంబిచ్చి యయ్యిరువురకు ప్రభవించిన సౌరభేయాకులంబు సురాసుర ప్రముఖాఖిల జనంబులకు నమస్కారంబును సపర్యభాజనీయంబునునై రాణిల్లునని జెప్పె నమ్మాతాజంకునకు యేకాదశపుత్రులు నటసౌరభేయంబగు గోకులంబు జన్మించె.

సీ॥ ఆననంబునను జిహ్వను శృంగములబలనైరి । రంధ్రంబుల మారుతుండు॥ కకుదంబునందు శ్రీకంఠుడు పదములయందు మరుద్గణమనఘ కుక్షి । వహ్నిచన్నుల సరస్వతి పెండపంచితమున లక్ష్మియును గీర్తియును గ్రమమున । రుధిరంబునందు జంద్రుడు హృదయంబున భగుడను దేవశిపాలవేధ । వెంట్రుకలయం దనుష్టానవితతి దోకధర్మదక్షుల సూర్యుండు చర్మమున ద । పంబు సిద్ధితేజము సంధిపట్లు సిద్ధులునికి గలట్టి గోవునేమనగ వచ్చు॥

## యాప్రకర్ణమందే మరికొన్ని పద్యముల తాత్పర్యం.

మరిన్ని సుమిత్రుడను మునిచే పాలింపబడు గోవులుకొన్ని గోలోక ధేనువులచే హవ్యకవ్యాతిథి పూజనంబులాది గాగల పుణ్య కర్మంబులకు యోగ్యంబులగు పాలు మీరు కురియకుండుటచే గో లోకావాసులు కారని నిందింపబడి రంతిదేవుని యధ్వరోపయోగ ముగా శరీరంబు లర్పించి యధ్వరోపయోగార్హత గలిగి యగ్గో వులు కొన్ని భూలోకంబునకు జనినట్లును దేవతలోక కాలంబున డా గవలసి వచ్చినప్పుడు అగ్నిదేవుని గోవులు తమయందుదాచి దేవతలు కోరినప్పుడు కనుపర్చుటజేసి కపిలగోవుల దానాదికంబుల కెక్కుడు ఫలంబు నిచ్చుననియు అగ్ని తమయందు దాగుటజేసి కపిలత్వంబు గలిగెననియు గోవుల పేడయందు లక్ష్మీదేవి నివసించుటకు గోవుల చే వరంబు గొనెననియును.

భార—అను—౭—ఆ.

సీ॥ గోవెక్కుడు తపోభావితాత్ములకంటె ననదవిస్తారవంబునకు
మేర । గలదె సత్యాఖ్యలోకంబున నవి సోమసంగతత్వంబున సంచ
రించు । వినుత హోమములకెల్లను బాలు పెరుగు నేయును నిచ్చు
గరిశనంబునకు నొసగు । దోలు శృంగంబులు వాలంబు రోమచ
యము శకృన్మూత్రము లఖిలవర్త । నముల కుపచరించు శ్రమము
సీతాతప । వ్యథయులేమి నెప్పుడతిభరింపు । పనులుసేయు గోబ్రా
హ్మణుడ ననేకత్వంబునగుట పరమ పదముగాంచు॥

తా॥ తాపసులకంటె గోవులెక్కువ యనియు బ్రహ్మలోక్త మున చంద్రుని సంగతముగా చరించుననియు ఆగోవుల పాలు పెరుగు నేయి హోమములకు యోగ్యకరములనియు వాటిచర్మము, కొ

మ్ములు, లోక, హోమములు, మలమూత్రంబులు వఖల కర్మంబుల కు యోగ్యంబులనియు గరిశనమునకు లోబదుననియు వర్షము, యెండ, చలి, గాలికి వ్యధపడక అతిభారమైన పనులు చేయుననియు గోవులు బ్రాహ్మణులు సమానులే ననియు.

భార—అను—౨—ఆశ్వా.

గీ॥ అనఘ గోవులు ప్రాణంబులని సమస్త। మునులు జెప్పుదు రట్లుగావున దలంప। బ్రాణదాన విధాన సంప్రాప్తమైన। ఫలము గోదాన కర్తకుగలుగు జూవే॥

తా॥ గోవులు ప్రాణతుల్యమనియు గోదానము చేయుటచే ప్రాణధానఫలము కర్తకు గలుగు ననియును.

గీ॥ రాజ ముఖ్యమగు సరస్వతి శిష్యున। కొసగ భూమిదాన మూార్జితముగ। జేసినట్టి ఫలము సిద్ధించు ధేనువు నిచ్చుటయును భూమి నిచ్చుటయును॥

క॥ గోదానఫలము సపథగ। మైదాతకునెల్ల మేలు నాపాదించున్। వేదప్రియ మదిమరితో। త్పాదకమగు నాతనికి విపథగత య్యైనన్॥

భారతం—అ—౩—ఆ.

గీ॥ శ్రుతులు నోపనిషధ సూక్తులుగోస్వ రూ। పంబులని సరోజభవుడు జెప్పె। ధర్మపరత పరమతపము మహాధ్వర। మనగ గోన మచ్చనంబు దెలియు॥

సీ॥ కాలగేల గోల్లకపిల దండించిన। నరకవాసమునకు నరుగవలయు। బూరినీవు లెస్సయూరసి యగ్గోవు సత్కరింప సుగతి సంభవించు॥

ర పద్యములకు ముఖ్యతాత్పర్యం.

భూమియు గోవు నొక్కటేననియు గోదానం బిచ్చిన భూదానంబిచ్చిన ఫలంబుప్రాప్తించుననియును వేదములును పనిషత్తులు గోస్వరూపమనియు అట్టిగోవును పూజించుట పరమతపము మహాధ్వరము చేయుటయనియు కాల చేత తన్నుట, కొట్టుట, అలకాపరచేశిన నరకమనియు గడ్డి నీరు లెస్సగావిచారించిన మోక్షము కలుగుననియును.

ఇట్లు చెప్పియుండుటచే సకలసుర మునిజన పూజ్యార్హతగలిగి సర్వజన పోషణీయమై వేదోప నిషత్స్వరూజమగు గోవులను రక్షించుట క్షత్రియులకు పరమధర్మముగాదా. ఇట్లశ్రుత్యాదులు పలుకుచుండుటయు ధృతరాష్ట్ర విరాట్రాజు మొదలయినవారికి గోపరిపాలనత్వంబు గలిగినట్లు భారతాదులయందు వినియుంటిమిగదా

ఇదియుమంగాక.

భాగ---చతు.

క॥ మహీపతినప్పుడు గనుగొని। మహిగోరూపమున కంప్రమానయునగుచుఁ। గుహకుండగు లుబ్ధకుగని। గహనంబున దిరుగుహరిణి కైవడిభారెఁ॥

టీక-తా- పృథుచక్రవర్తికి గోరూపధారియగు భూదేవికినైన సంవాదంబునందు-

సీ॥ స్వారోచిషుండన జనుమను ప్రవరుని వత్సంబుగాజేసి వరలుతనదు। హస్తంబుపాత్రమై యతిశయిల్లగమహి ధేనువుబితికి ధాత్రీజనులకు। సకలసస్యంబులు సర్వాయుగంబుల వృథలోకఫలియించు విధముగాగ। నొనరింపలోకు లభ్యుదయ సమేతులయి వర్ధిల్లిరతచే

ల్లి, వలమునకెలుగు । భువనవాస్యులఁ బిలచి వారివిరలమ్మునఁ । వలయునవి వేఱువేఱ నీ వలన నెఱిఁగియ । సిద్ధరా దోగ్ధ్రి ఁగోవుల నెమ్మిఁ జేప్ప । పితికిఁగొన్నుఁడనుభ్ము బలిక్కె సమ్మతముమిగుల ॥

క॥ సోముఁడు వత్సముగాస్తూ । ప్రేమగురుఁడు దోహకుఁడుగాఁ దన ఘనఖిలచ్ఛందోమయ పాత్రికఁ బితికిర । నామర్త్యులగు మునులు బ్రహ్మమును దుగ్ధంబున్ ॥

క॥ సురలుగొనిరి కాంచనవి । స్ఫారధజపాత్రమున బలరిపుని వత్సముగా । మఱిగించి సవితదోగ్ధగ । నరుదగు తేజంబు దుగ్ధమై స్థిద్ధింపన్ ॥

క॥ పిత్రృకోటి పితికె వేద । స్వతకాలురు ప్రేతపిత్సుకు వారనుగా రా । జితపాత్రంబున దుగ్ధం । బతులాన్నదమై యలర్పన వనీసురభిన్ ॥

క॥ ఆయసపాత్రంబున ఘన । మాయాదుగ్ధంబుఁ గొని రమర్త్యేతర విరోధుల్ । పాయక విరోచనుఁడు ద్రేకై । పై యొకఁడు ద్విమూర్ధుఁడను సురారి పితకగన్ ॥

క॥ వసురుచి పితుకఁగఁ బాత్రము । బిసరుహమ్ముగ జిత్రరథుఁడు కేళ్యూగఁ గొనిరిం । పెసఁగం గానక్షీరం । బసమ్ముగ గంధర్వవరులు నమరాంగనలున్ ॥

క॥ తారపితికి కౌనఁజాలి కు । జేరునివత్సముగఁ జేచి పితికిరి యక్షుల్ । ధీరులు లాయసపాత్రను । వారంతర్ధానశక్తి తగు దుగ్ధముగన్ ॥

గీ॥ రజనినాథుఁడు దోగ్ధగా రాక్షసులు । పిశాచములు నృకపాల భాజనములందు । గసిరి నరరుధిరాఖ్యదుగ్ధమును ఘనాళి । వత్సమై పెంపొన్నర్స్గ వసుధపతికి ॥

క॥ వాసుకి పితికెదువాఁడుగ । భాసితఫణ పాత్రికరళ బహుళదుగ్ధ
ములు । ల్లాసమున గ్రోవుతఱుకు । దైసమకొనగొనిరి దారుణోద్ధ
త భుజగుల్ ॥

క॥ మేరుగిరిదోగ్ధగానీ । ఘనరనగము క్రోవుగాసి యదుప్రిలచితికె ।
స్ఫారిశిలాపాత్రికలను । గోరిమహౌషధులు రత్నకోటులనగ్వఁ ॥

అన్నిటికి ముఖ్యతాత్పర్యము.

పృధుచక్రవర్తియాజ్ఞప్రకారము భూదేవి గోరూపధారిణియై మునులకు, బ్రహ్మమను దుగ్ధమును, దేవతలకు తేజమనుదుగ్ధమును, పితృదేవతలకు కవ్యమనుదుగ్ధమును, రాక్షసులకు మాయాదుగ్ధంబును, గంధర్వులకు గానవిద్యాఖ్యాను క్షీరంబును, పిశాచరాక్షసులకు రక్తమనుదుగ్ధమును, సర్పములకు విషదుగ్ధమును, పర్వతములకు ఓషధులు రత్నంబులను దుగ్ధంబును, నింక నెట్టివారికట్టి దుగ్ధంబుగురిసి రక్షించినట్లును.

హరి. క॥ గోవ్రమహీదేవిబడసి । తీవు ప్రియసతీతిలకమ
నఁగ । గావునగోవిందుడవను । భావంబున వామనుడన బరగితిపేర్మిన్

తా॥ గోవు భూదేవియనియు నాభూదేవిని భార్యగాసంగీకరించుటచే గోవిందుడవను నామము గలిగినదనియును ॥

భాగవతము—గాంతి.

భూదేవి కశ్యపుని కశ్యపునితో పరశురామునిచే బాధపడి రాజులం జెప్పిన విషయమందు.

వ॥ అనిపలికి యద్దేవి తనసుగక్షితంబున హైహయులకొందరు బాపుననరు దప్పటయు నారవాన్వయ ప్రభువుండగు విదూర

థ సుతుండు ఋక్షపర్వతంబున ఋక్షంబులచే రక్షితుండగుటయు సౌదాస వంశజనితుండగు నొకండు పరాశర సంయమివరు సద్వర కాలంబునఁ జేసిన కారుణ్యాతిశయంబున నమ్మహాత్ముండు వానిశూద్రప్రవర్తనంబున సర్వకర్ముండనంబరగుటయు శిబిమనుమఁడు గోపతియనువాఁడు వనంబున గోవులరక్షించిన ప్రతీకియుండై బృహద్రథునిపుత్రుండు వత్సాధిదాసుండు వత్సంబుల గోష్ఠంబు రక్షణంబాచరింప సంచరించుటయు విదూరథతనయుండగు దధివాహకోదుకంగుడు అనువాఁడు గంగాకూలంబున గౌతమమునీంద్రరక్షఁ జేసి నిర్భయుండై వర్తిల్లుటయు బృహద్రథకుల జాతుండగు భూతినామధేయుండు గృధ్రకూట శైలంబున గోలాంగూలంబుల రక్షించుటవలనం గలిగి యుండుటయు మరుత్తసంతాన సంభవులు చతుర్వర్ణ వయస్కులు మువ్వురను సముద్రుండు రక్షకుండై వెనుపం దత్తీరంబున పెరుగుటయుఁ జెప్పివా రుత్తమక్షత్రియులు సమ్యక్పరిపాలనంబున నన్నరయువారుగావున ననుగ్రహించిన నచలితవైయుండెద.

క॥ వారలపెద్దలునాకై। ఘోరపరశురామునిచేత బొలిసిరినాకుఁ।
వారిఁ నధిపతుల జేయుట। గోవిందగు గానవిన్నుఁ గోరితినసఘా॥

ఇటు పరశురాముచేత మరణమునకు దప్పినక్షత్రియులుకొందరు భూపాలకత్వము విడిచియు స్వకులధర్మంబగు గోపాలనత్వంబుల గొంతకాలంబు జెందిరి తిరిగి భూపాలనత్వంబుకూడా పొందియున్నట్లును చెప్పియున్నది.

ఇదియునుం గాక గోవులతున్న భూమికి అన్వయవ్యతిరిక్తము లేక తుల్యత్వమువిహించి రాజలక్షణ ధర్మానుకూలంబై యుండుటచే క్షత్రియులకు భూపాలకమెట్లు ధర్మమో గోపాలకత్వమట్లే తెలియవలయు.

ప్రశ్న:— శ్లో॥ కృషిగోరక్ష్య వాణిజ్యం । వైశ్యం కర్మస్వభావ జం ॥ భగవద్గీత- మోక్షసన్యాసయోగము. ౧౮ అధ్యాయము.

భాగ— ఉ॥ స్వేయములేనివృత్తి యశుచిత్వము సన్నుతియు న్నిజేశులకు । మాయ్యలులేక డాయుటయు మంత్రముజెప్పక పంచ యజ్ఞముల్ । సేయుటయుఌ ధరామరుల సేవయు గోవుల రక్షణం బుగ । న్యాయము లేమియుఌ మనుజనాథయెఱుంగుము శూద్రధర్మ ముల్ ॥

ఇందునబట్టి గోపాల భూపాలకత్వంబుల కభేదార్థ న్యాయ మంగీకరించిన వైశ్యులను, శూద్రులను, యేలరాజులని చెప్పకూడదు

ఉ:— అట్లుచెప్పకూడ దేలననగా అగ్రజాతియగు బ్రాహ్మణు లకు గలయజనాది షట్కర్మములలో ప్రతిగ్రహముతప్ప తక్కిన అయి దుకర్మల కధికారము క్షత్రియులకు కలిగియున్నప్పటికి బ్రాహ్మణు లెట్లుగారో అట్లును వైశ్యులకు క్షత్రియధర్మములు కలిగినవైశ్యులు క్షత్రియులెట్లుకారో శూద్రులకు వైశ్యధర్మమగు పశుపాలనవలన వైశ్యులెట్లుకారో అట్లు గోపాలనత్వంబున భూపాలక క్షత్రియనా మంబన్యులకు చెల్లదు.

ప్రశ్న:— అట్లయిన వైశ్యులకును, శూద్రులకును, స్వకులధర్మం బైన గోపాలనవృత్తిచే గొల్లలని యెందుకు జెప్పగూడదు.

ఉ:— గొల్ల గోపాలయను వృత్తినామము గోపాలనంబు జే యు వారందరియందున వర్తించునని యిదివరకే చెప్పియుండబడె ను గావున వైశ్యులకు, శూద్రులకు ప్రత్యేకముగా కులవృత్తి అయి వున్నందున వృత్తినామంబు వారియందు వర్తించుట కేయాక్షేపణ యులేదు. ప్రతికులము వారికి విధింపబడియుండిన అనేకవృత్తులలో

నెవ్వరి యొప్పుడాచరింపబడునో వారలకావృత్తినామంబులు కలి
గియుండుట లోకప్రసిద్ధము.

ప్రశ్న:— బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రులను చాతుర్వర్ణ్యంబులలో చంద్రవంశ క్షత్త్రియుడగు శ్రీకృష్ణుడు వరియించిన పదియారువేల గోపికలను వారేజాతివారు.

ఉ:— గోపికయను శబ్దంబు వృత్తినామంబగు గోపాలశబ్దంబునకు స్త్రీవాచకంబగును. గోప, భూప, శబ్దంబులు కేకార్థంబగుటచే రాజస్త్రీలనియును కూడా చెప్పవచ్చును.

భాగ—దశ.

ఉ॥ రాజకులావతంసుడు పరాక్రమకంసుడు సొచ్చికాంచె ఘో। రాజులరాజులన్బటు శరాహతినుంచి ధరాతనూజుడు। తేజిత శక్తిదోర్నిచెరదెచ్చినవారి పదారువేలధా। త్రీజనమాన్యలన్గుణపవిత్రత ధన్యల రాజకన్యలన్॥

భాగ—దశ.

చ॥ అమితవిహారుడీశ్వరుడనంతుడు డాసొకనాడు మంచిల। గ్నసువ బదారువేల భవనంబునలోన బదారువేల రూ। పముల బదారువేల్నృపబాలతిబీతి బదారువేలవందముల విభూతినొందుచు యథావిధితో వరియించె భూవరా॥

చ॥ వరవరయొక్కనాడువిను నారదసంయమి మాధవుండుదా। వరశనిద్రించివాని భవనంబునున్న పదారువేల సుం। దరులనొక్కనాడె ప్రమదంబున నందరకన్నిరూపులై పరిణయమయ్యెనావిని శుభస్థితి తద్విభవంబు భూవరా॥

ఇందువలన గోపికలు రాజకన్యలనియును విద్యుక్తముగా భాగవతాదులందును స్పష్టముగా నిరూపింపబడియున్నది.

ప్రశ్న:— శ్రీకృష్ణునకు జనించిన పుత్రులసంఖ్య లెక్కించుటకు పదివేలసంవత్సరములకు దీరదనియును తద్బాలకులకు విద్యాబుధులుగరు పిన గురుజనసంఖ్య మూడుకోట్ల యెనుబదెనిమిదివేల నూర్వురనియు జెప్పితిరి. అష్టభార్యలును షోడశసహస్ర గోపికలును మాత్రము కలిగినవారా శ్రీకృష్ణునకు వీరుగాక భార్యలసంఖ్యకూడా అమితము యియుండెనా అట్లుండిన ప్రమాణమేమి.

ఉ:— పైనజెప్పిన షోడశ సహస్రగోపికలు గాక ఋషిగోపిక లును, మిథిలాగోపికలును, కౌసలగోపికలును, అయోధ్యాగోపికలు ను, పుళిందగోపికలును, శ్రీలోకాచల రమావైకుంఠ ఊర్ధ్వవైకుం ఠ వాసినీ గోపికలును, దివ్యస్త్రీగోపికలును, జాలంధరీ గోపికలును, సముద్రగోపికలును, ఇట్లు పెక్కుమందిగలరు. వారల వృత్తాంతము వినుము.

శ్రీకృష్ణకథామంజరి. ఋషిగోపికల వృత్తాంతము.

వంగదేశమునందు మంగళుడను గోపవరుడుకలడు. యతనికి తొమ్మిదిలక్షల గోవులుకలవు. పెద్దలసేవించునతడు అయిదువేల గోపికల పెండ్లియాడి బహుమంది కూతుళ్ళగని పిమ్మట ఆదేశమే లురాజునకు తనకు కలహముపొసగి పశ్వాదికముల గోలుపోయి మి గుల దరిద్రుడై యుక్తవయస్కులగు కన్నెలకు వివాహము సలుపలే మి దుఃఖించుచుండి నందునియొక్కయగు బృందావనమునుండి విజ యుడను గోపవరుడు యాయన యింటికివచ్చి యీవృత్తాంతము దె లిసి యితనివలన నందునివృత్తాంతము దెలుసుకొని వివాహమునకై యితనివెంబడి కూతుళ్లను నందునియింటికి పంపించి నందునింట సౌ ఖ్యపడుచు యమునానదిగూర్చి శ్రీకృష్ణుడు తమకుభర్తగావలయునని తపంబుశేయ నాతడుప్రత్యక్షమయి వరంబిచ్చె. నందున ఆకృష్ణునితో

భార్యలయిరి. యీగోపికలు పూర్వము రామావతారమునందు దండకారణ్యమునందు రాముని మోహించిన ఋషులు.

## మిథిలాగోపికల వృత్తాంతము.

శ్రీరామావతారమందు మిథిలానగరములో స్త్రీలు రాముని మోహించుటచే నవనందుల గృహములందు గోపికలయి జనించిరి ఆసుందరులు శ్రీకృష్ణుని భర్తగా బడయువలయునని రాధాదేవికడకేతెంచి యామెయనుమతిని యమునాతటంబున కాత్యాయని వ్రతంబు జేయుచున్న నెక్కాన దాదేవిని పూజించుటకు వేకువను లేచి వివస్త్రలయి యమునానదిలో స్నానమాడుట దెలసి శ్రీకృష్ణుడు చీరలెత్తుకొని పొన్నవృక్షమునందుండి వారల నమస్కారములనంది వారల గయికొని కోర్కెలీడేర్చెను.

## కోసలగోపికల వృత్తాంతము.

కోసలదేశమునందు వసియించెడి స్త్రీలు శ్రీరాముని వలచి వరమునందియున్నందున వారు ఉపనందులనియెడి నందరాజ సహోదరులగు తొంమ్మిద్దృగుర గోపకులయిండ్లలో జనియించిరి. వీరితరగోపకుల పెండ్లియాడినను పాతిణధర్మముచే శ్రీహరితో విహరించిరి.

## అయోధ్యా గోపికావృత్తాంతము.

సింధుదేశంబేలు విమలుడను రాజుగలడు యతడు ఆరువేలమంది యువతుల పెండ్లియాడి సంతతిలేక వ్యసనపడుచున్న విమలుని కడకు యాజ్ఞవల్క్యుడు ఋషివచ్చిన తనదుఃఖంబతనితో విన్నవించిన దివ్యదృష్టిని పరికించి అసంఖ్యాకమగు పుత్రికలుద్భవింతురని చెప్పిన పుత్రులు లేక గతులు లేవుగదా దీనికేమి యుపాయమున శ్రీకృష్ణుండు మథురయందు వసుదేవునకు జనించు నతడు శ్రీనారా

యుణుంచు యాతనికినీ కూతుళ్ళను నీరాజ్యమర్పించిన నీకిత్రరుణములు దీరి నీకుమోక్షముకలుగునని చెప్పిన తనకుగలిగిన కుమార్తెలను శ్రీకృష్ణునకునిచ్చి వివాహముచేసి తామమోక్షముబొందెను. యీ గోపికలు శ్రీరామావతారములో శ్రీరాముని మోహించి వరంబుగోనిన అయోధ్యాస్త్రీలు. వీరిని బృందావనమునకు గొంతెచ్చి మేడల యందుంచి సుఖించెను.

## నవనగోపికల వృత్తాంతము.

శ్రీరాముడు తనసతియగు సీత నరణ్యంబున కంపినకాలంబున తానానేక యజ్ఞంబు లాచరించినందున సతీయుతముగా జేయుట కర్తవ్యమగుటచే బంగారముచే సీతాప్రతిమచేయించి ప్రాణప్రతిష్ఠలు చేయించి కార్యంబులు గడుపుచుండుటచేత నాప్రతిమలు సజీవులయి రాముని గోరిన యారాము డేకపత్నీ వ్రతస్థుడగుటచే యనంతరము శ్రీకృష్ణావతారమున మిమ్ములవరించెదనని వరంబిచ్చుటవలన యీకన్యకలిత ఉశీనరదేశమునందు కొందరి గోపాలకులకు జనించినందున వారు ద్వాదశక్షామమునకు నందరాజు చెంతకు గోవ్రజంబులతో చేరి కాళిందీతీరంబున నిలయంబు లేర్పరుచుకొని వసించిరి. పిమ్మట యీకన్నియలు శ్రీకృష్ణుని తమకు వరునిగా బడయుటకు రాధాదేవి యుపాస్తిని షట్కాదశి వ్రతమవలంబించి శ్రీకృష్ణుని యనుగ్రహపాత్రులయ్యిరి.

## పుళింద గోపికల వృత్తాంతము.

వింధ్య పర్వతప్రాంతమునందు కొందరు పుళిందులువసించి బలసంపన్నులయి రాజులయిండ్ల ధనంబులు దోచుచుండ నాదేశపు ప్రభువు వారలతో యుద్ధముచేసి వధింప కంసనహాయుడగు ప్రలం

బుడను రాక్షసుని సహాయముతో బారలాప్రభువును పారదోలి కం స్థునకు భృత్యులైయుఖ కామగిరియందు వసించిరి. శ్రీరామువలు పం చవటియందు వసించినప్పుడు పుళింధులు రాముని వరించినకతంబున యాపుళింధులకు కన్యలై జనించి శ్రీకృష్ణుని భక్తిభావ మధనసు ఖంబు లనుభవించిరి.

## శ్రీలోకాచల రఘూన్వైకుంఠ ఊర్ధ్వవైకుంఠవాసినీ గోపికల వృత్తాంతము.

నందవ్రజమునందు నీతివేధి మాగధుడు, శుక్లుడు, పతంగు డు, దివ్యవాహనుడు, గోపేష్టుడు, అను నార్గురు వృషభానులుగలరు వారికి పాలకడలి తీర్పునెడ లక్ష్మితోడ జనియించి యాశ్రీదేవి యేలుచుండెడి వైకుంఠమున వసియించు నారామామణి కనుంగుచె లులగు విలాసినులు ఊర్ధ్వవైకుంఠమున నుండెడి లక్ష్మిదేవి చెలిక త్తియలును, సముద్రమునబుట్టి శ్రీలోకాచల వాసముచేయుచు శ్రీదే విసఖియలును, నారాయణుని వరంబున వృషభానుల యిండ్లజనించి గోవిందునిగోరి మాఘవ్రతమాచరించు యువతులకు ప్రత్యేకమై మ ధనతమి దీర్చుమనిన గోపికలును.

## దివ్యస్త్రీ గోపికావృత్తాంతము.

నీతిహోత్రుడు, అగ్ని, భుక్కు, సాంబుడు, శ్రీకరుడు, గోప తి, శ్రుతుడు, ప్రజేశుడు, పావనుడు, శాంతుడు, అనుప్రసిద్ధనామంబు లుగల యుపనందులు, నందవ్రజంబునందు గలరు. కోసల గోపి కోపఖ్యానంబునం జెప్పిన యుపనందులుకారు. ఆవుపనందులు బ హుళవముస్త్రీల పెండ్లియాడి పెక్కుపుత్రులును, మరికొందరు క న్యకలును జనించిరి. యాకన్యలలో కొందరు దివ్యులు, కొందరు శ్రీ

గుణావృత్తులు, కొందరు భూమిగోపికలు వీరు నావిధవ్రతంబులాచరించి రాధాదేవికి చెలికత్తియలయి రాధాకృష్ణుల కేళీవోత్సవముల దోడ్పడుచుందురు. ఫాల్గుణమాస మందొకనాడు వేలకొలంది కోట్లకొలంది గుంపులయి శ్రీకృష్ణుని దొడరినవారి కందరికిన్ని రూపుల తృప్తిపరచెను.

దేవజన గోపికావృత్తాంతము.

మాళవదేశంబునందు నందిదివస్పతియను గోపవరుడు .. స్త్రీల పెండ్లియాడి తీర్థయాత్రా గమనముజేయుచు నందరాజు మహిమలువిని బృందావనంబుసజేరి నందునిచే సన్మానింపబడి యా బృందావనము వసతిగాజేసుకొని ఘోషమేర్పరుచుకొని పుత్రమిత్రకళత్ర బంధుయుతముగా నివశించి పూర్వము దేవతలువరంబు వరంబువడశిన దేవకన్నియ లితనికి పుత్రికలయిజనించి శ్రీకృష్ణునిగోరి యమునానది యందరుణోదయ కాలంబున దానమాడి శ్రీకృష్ణలీలలచే పరితృప్తినొందుచున్న నొకనాడు శ్రీకృష్ణుడు వరంబులొసగి వరించె.

జాలంధరీ గోపికల వృత్తాంతము.

సప్తనదీతీరమునందు రంగపత్తనమొండుగలదు. దానిద్ద రంగోజియనెడు గోపవరుడు అనేక గోపాలకు నేలికయై ధనధాన్యసమృద్ధిచేతను పుత్రమిత్ర కళత్రాదులచేతను మించి హస్తినాపురాధిపతియగు ధృతరాష్ట్రునకు సంవత్సరమునకు పదివేలనిష్కములు పన్నుకట్టుచు పరిపాలించుచు పన్నుకొంత కట్టకున్నందున రాజుచే యుద్ధముజరిగి కంససహాయుడై ధృతరాష్ట్రుని జయించి కంసునిచెంతకుజేరి మధురకుసమీపమందున్న బాహిణమడంబను పురంబునందు

రాజుగారున్గు యతనిభార్యలయందు పూర్వము శ్రీహరివరంబు వడ శిన జాలంధరకాంతలు గోపికలై జనించి ఇతరగోపికలను పెండ్లియాడి జారత్వంబున శ్రీకృష్ణునితోఁ గలిశి చైత్రమాసంబున భక్తిమార్గ౦బున రాసమునందు విహరించిరి.

సముద్రగోపికల వృత్తాంతము.

శోణపురంబున కతినాథుండగు నందుండను గోపవరుఁడు అయిదువేలమంది గోపికల పెండ్లియాడి అతనికి సముద్రకన్యకలును మత్స్యమూర్తివరంబు బొందినవారును అత్రివరంబున పృథ్విదోషాన ముజేశి హరికృపవడశిన యప్సరసలును నారాయణుని వరంబుబొందిన యప్సరసలును, వామనునివరంబు వడశిన సుతలవాసినులగు కన్యకలును, శేషునివరంబుబొందిన నాగకన్నికలును గోపికలయిజనించి దూర్వాసుని యనుగ్రహంబున యమునా పంచాంగమును కవచస్తవ సహస్రనామ పటలపద్ధతులనియెడి నైదంగములు గతులతోఁ డనబడశి దానిచే యమునను పూజించి తద్వారంబున శ్రీకృష్ణునకు సతులుగాబడసి బృందావనంబున రాధాకృష్ణునకు డోలోత్సవంబుసల్పి హరినిమెప్పించి పతినిగాబడసిరి. ఇట్లు శ్రీకృష్ణకథామంజరియందు కలదుగావున శ్రీకృష్ణుం డగణితంబగు గోపికలను వరించి లెక్కలేని సంతతిని బడసినాడని స్పష్టముగా తెలియుచున్నది.

ఆపస్తంభసూత్రము. ౧-౧-౧౧.

ప్రశ్న:— అశూద్రాణా మదుష్టకర్మణా ముపాయనం । వేదాధ్యయనమగ్న్యాధేయం ఫలవంతిచ కర్మాణి ॥ చంద్రవంశక్షత్రియులగు యదుభోజాంధకాదులు రెండవజాతి వారైనయెడల యజనాదిషట్కర్మలతో ప్రతిగ్రహముతప్ప తక్కినకర్మలు యుపనయనాదులు జరిగి

త్వము రాజనీతియును శబ్దప్రక్రియయు జెప్పె నాథా దేవాగ్రణి రామ కృష్ణులకు సంభూత ప్రమోదంబునన్॥

వ॥ అనఘా మన మధ్యాయనము సేయుచు అన్యోన్య స్నేహ వాత్సల్యంబులన్ జేయుకృత్యంబులు మరువము గదా యనియు.

చంద్రవంశ శ్రేష్ఠులగు బలరామకృష్ణులకు వసుదేవుం డుపన యనము చేయించెననియును చతుర్వేదంబులు ధనుర్వేదంబును మ న్వాదిధర్మశాస్త్రంబులును తర్కవిద్యాదిగాగల సర్వవిద్యలు సాందీ పునిచే రామకృష్ణులు నేర్చుకొనిరనియును.

భాగ--ఆది--౫--ఆ

వ॥ ఈచేవి పతితోడన షోడశసమకట్టి పుత్రరక్షణార్థణంబు మునిగణప్రార్థితయై యెట్టకేని మృతపాణ్డుయయ్యే నికుమారులు గురుకుల విస్తారకులు దేవమూర్తులు యుధిష్ఠిర భీమార్జున నకుల సహదేవులనంగా దేవాధిష్ఠిత నామంబు లందాల్చి బ్రహ్మఋషి ప్రణీ తోపనయనులై శ్రుతాధ్యయన సంపన్నులగుచు దిరుగుచున్నవారు॥ బ్రహ్మఋషులచే పాండవులుపనయ నాధ్యయనములు నొందినట్లును.

భాగ--న.

గీ॥ వినుము దూరంబు నాడిన వినుచునుండు। మఱియు జాడము డగ్గర నరుగుదేర। నరులలో బ్రభుకంబె నున్నతుడు లేడు। యో జదేవాన్వధునకంబె నొరధుగల డె॥

క॥ పదునాలుగు వేవ్వరు నలు। వదివాలుగు నరులు ముక్తివడశిరి బ్రభుం ధుడిత్తుడు దేవాన్వధుడును షదపడియోగంబు దెలియుబ్రకిన కృత్యనన్॥

యదువంశంబున జనించిన సాత్వతుని కుమారులేడుగురియందు దేవావృధుడును యీయన కుమారుడు బభ్రుడనువారలు మోక్షోపదేశార్హతగలిగి కేశవస్వామునకై పదునాలుగువేల యిరువదిన ల్వురను విశేషకైవల్యంబుబొంది తాము నట్టిపదవి బొందిరనియు, వీరిమహిమ నెప్పుడు మహాపురుషులందరు శ్లోకరూపంబున పఠించుచుందురనియు నీదేవావృధుని తమ్ముడు మహాభోజుడను వానిపేర వంశంబు వృద్ధిబొందుటచే నావంశంబువారు భోజులనం బరగిరి. శ్రీకృష్ణుడును యుద్ధవార్జున విదురాది యనేకులకు పరబ్రహ్మోపదేశంబు జేసినటుల భగవద్గీతాదులయందు ప్రత్యక్షనిదర్శనీయంబైయుండె మఱియు.

భార--శాంతి--అ.

గీ॥ దీని నెఱిగిందునపుడు భక్తియును శమము । దమము నాశ్రయమును వేదతత్పరతయు । గలుగువారల కెఱింపుకాని వాని । కీకువిద్యా విద్యపాత్ర దానైకనిరత॥

గీ॥ అఖిలవస్తు పూర్ణమగు వసుంధరయెల్ల । నొసగితేని యొసగు యోగ్యతాధి । యుక్తిలేనివాని కొసగకు మీవిద్య । తగినపాత్రమైన తడయకిమ్ము॥

ఇట్లు భీష్మాచార్యులు ధర్మరాజునకు తత్వోపదేశం బొసంగెననియును మఱిన్ని చంద్రవంశ క్షత్రియులగు పురూరవుండాదిగాగల సకల భరత, కురు, యదు, వృష్టి, భోజాంధక ప్రభృతులు ప్రతిగ్రహంబుదప్ప యజనాదివేదోక్త కర్మంబులాచరించి రాజ్యాది స్వకులధర్మంబులందు కొఱంతలేక చిరకీర్తి గలవారయినట్లు పంచమవేదంబగు భారతంబు భాగవతంబు మొదలుగాగల సకల పురాణము

లున్న ప్రత్యక్ష ప్రమాణంబులై యుండగా యీచంద్రవంశ క్షత్రియులయొక్క యథార్థమును గురించి యింతగా జెప్పవలసిన నిమిత్తం కనుపడదు.

ప్ర:— పరాశరస్మృతి–౧౮౩ పద్యం–తృతీయభేదం.

శ్లో॥ శౌచాచారగరిష్ఠమైన నృపజాసంబంధు బద్ద్యంట సంకోచంబందకన్త్రైవర్ప్పై త్రికములకగోరం బదాయుగ్రజా । నాచానుల్దినుటొప్ప గుక జనులుదవందుం బాలిలోగావుచే ప్రవేశంబుడ్డ పదార్థముల్ వదులకుం వేంచేసి బోసేవలేక॥ పూర్వ్యయుగమునందు గొల్లలను వృత్తినామముగల చంద్రవంశ క్షత్రియులయింట బ్రాహ్మణులు భుజియించినట్లు ప్రమాణము గలదా.

భార–అను

ఈ:— వచనములో కొంతభాగం॥ నొక యాశ్చర్యంబు జెప్పెదనా కర్ణింపుము. మాగ్యాసుందు మన మందిరంబునకుం వచ్చి మందహాసంబు జేయుచు గోపించుచు సుముఖుండగుచు విముఖుండగుచు కుదువ వొల్లననుచు చెక్కెంద్రకుం గావించిన కుదువుకూరలు దానా కెక్కందు భుజియింపుచు నెల్లనిద్రించుచు భూమిశయనించుచు నెందేనింబోవుచు మరలి వచ్చుచు నిట్లు వర్తించుచుండి యొక్కనాడు కృష్ణానాడు పాయసంబునక వేడుక బుట్టెను పెట్టింపవేయున తక్షణంబ గావించినక కొంతగుడిచి కొంత తనయొడల బూయుమనిన బూసితి॥ శ్రీకృష్ణునియింట మాగ్యాసుందు భుజించినట్లు కృష్ణుండు ప్రద్యుమ్నునకు బోధించె.

భారతం–హరి–౬ అశ్వా.

వచనములో కొంత॥ కర్తవ్యానుష్ఠానంబులు సెల్లిన పిదప

నిట కొఱంజేయుండెడు మేలిమిమీగడతోటిపెరుగున్ గలిపిన చల్దివం
టకంబు చిక్కంబున నున్నయది మరియు శర్కరామిశ్రమంబగు పా
యసంబు వలసినంతయు దెచ్చినారము. మీకు ప్రియంబైనవిధంబు
న నారగింప నర్హులగుదురు. శ్రీకృష్ణుండు గోపాలురతో గూడి తాను
నేవ భరద్వాజులను ప్రార్థించి భుజింపబెట్టినట్లును॥

భాగ--ఆది--7--ఆశ్వా.

సీ॥ ఆతండు తద్భావ మరయంగమదిగోరి రూపింపనొకమరి కే
వుచస్తు। ననిపోయినదిరేయి యధికతోజను దెంచి రేయివచ్చెదనని రే
వుచచ్చు। నేప్రొద్దువచ్చిన నింతియుస్వాదభక్త్య భోజ్యముల్ క్రొత్తపా
ల్పుగనొనర్చు। నెయ్యెడగోరిన నిచ్చుకురాబెట్టు నలయదుమదిలోన న
లుగదెవుడు। ననుదినంబుభోజు డాశ్చర్యబడిన్చెత। ద్వర్తమానముడుగ
వనజముఖయు। దానిగొల్చుతెరగు తాపసవర్యుచం। దమునుదెప్పు
చుండు దండ్రియలర॥

యదువంశ సంభవుండగు కుంతిభోజునింట దూర్వాసులవా
రు భుజింపుచు భోజునికుమార్తెయగు కుంతీదేవిచే నుపచర్యలను
బొందెననియును॥

భాగ--దశ--పూ.

సీ॥ అతిథిభూసురుడొక్కడా కూరమడిగి నగవపక్రియమతో గార
వించి। కూరిసమగ్రమ మందునన్నంబులో సగమిచ్చిభుజియించి యే
గనాత। కంతలోనొకశూద్రు డశనాధికైవచ్చి పాదసూపలేతని
బోకతనకు। నున్నయన్నములోన నొకభాగమిచ్చిన। సంతుష్టుడైవా
డు చనిన వెనుక। కుక్కగమియు తాను నొక్కడే తెరనాయన్న శే
షమిచ్చెనన్నదమున। దానిక్రొమ్మిక్కషంపవరుసతో చండాలుడొక్క

రుగువెంచిచక్కనిలిచి ॥

ఇట్లు రంతిదేవుడను రాజు భూసుర కాహారమిచ్చెననియును.

భార--అర--ప్రథ.

గీ॥ వనమునకువచ్చి నవయుగవలవదుడుగు-దనినసుద్ధుగక తింత్రో
వ యరుగదలతు । యరుగుదెంతువనిరి బ్రాహ్మణుల్ పిడికాహార ము
యువాయమున బడయవచ్చు ॥

వ॥ ఆదరగర్భ గ్గవందను దహన్నతిచేత వరంబువరంబునెమ్మతో । బ
డసిన హీనరోత్తముల ధవ్యులబల్వర నిర్వహించెవ । నృపుడు ద్రుపదా
ధిరాజసుత బొల్పుగవండిన శాకమూలముల్ । గదురుచి నిష్టభోద
న సుఖంబును దృప్తియు జేయుచుండగన్ ॥

వ॥ ఇట్లనేక సహస్రమహీసురవరుల ననుదినంబు సభిమతభో
జనంబులందనిపి విఘసావృత భోజనంబులం దృప్తులయిన పతులభుక్త
శేషంబు ద్రుపదపుత్రిక యుపయోగించుచుండగ గొన్నిదినంబులంద
యుండి చంద్రవంశక్షత్రియులగు పాండవులు తమ భార్యయగు ద్రౌప
దిచే వండిన వంటకంబులచే బ్రాహ్మణులు సంతసింపబడిరనియు.

ఏతత్ప్రమాణములచే అయాయుగములయందు విఖ్యాతము
గా రెండవజాతియగు చంద్రవంశక్షత్రియుల వంటకంబు బ్రాహ్మణు
లు భుజింపబడిరని తెలియవచ్చెను.

ప్రశ్న:— మీరువివరించిన గొల్లలను వృత్తిసామ్యములగల క్షత్రియు
లగు యాదు, వృష్ణి, భోజాంధకాదులకును, కురు, భరత, వంశీయుల
కును భేదమేమైనగలదా ॥

ఉ:— లేదు మీరియు తెలిపెట్లనగా భరతవంశములో బుట్టినహ

స్త్రి యనువాడు తనపేర హస్తినగరము నిర్మించె. ఇప్పటికి ఢిల్లియ
ను నామాంతరంబున ప్రసిద్ధిగాంచె. నాహస్తికొడు కజమీఢుండను
వ్యాసమునిమనుమండగు కురువు తనపేర కురుక్షేత్రము నిర్మించె. నిప్ప
టికి నది యొకటి పుణ్యక్షేత్రంబనబరగె. నాకురువంశ్యులు కౌరవు
లనియు చెప్పబడుదురు. భరతవంశ్యులు యయాతిమహారాజు కని
ష్టకుమారుడగు పూరుని వంశీయులు. భరతవంశ్యుల విశేషములు దె
ల్పుటచే భారతమనంబరగె. సీభరతవంశస్థులగు పాండవాదులు
యాదవులతో నన్యోన్యసంబంధ బాంధవములు జేయుట ప్రశస్తము
గా నెల్లరకు విశదమే. అయినను కొంత వివరించెద, శ్రీకృష్ణుని
మేనత్తయగు కుంతిని పాండురాజునకును, బలరామునితో బుట్టువగు
సుభద్రను నర్జునునకిని, బలరాముని కూతురగు శశిరేఖను అభిమ
న్యునకును, దుర్యోధనుని కూతురుని శ్రీకృష్ణుని కుమారుడగు సాంబు
నకును భార్యలగానిచ్చి సంబంధబాంధవములు చేసినట్లు భారతభాగ
వతములయందు కనుపడుచూనేయున్నది.

భాగ—పంచ.

గీ॥ యాదవులకు మీకునత్యంతకులగురు । వైనకృష్ణ దేవట్లైనగ
లదు ! కొలుచువారికెల్ల సులభుడై మోక్షంబు । నిచ్చుజింతసేయ
నేలనీకు ॥

యదువంశులకు ,మీకు అనగా భరతవంశులకు కులగురువు
అనగా యీరెండువంశములకు అధికఘనత వహించిన వాడని పరీక్షి
న్మహారాజునుగూర్చి శుకులవారు పలికినట్లును ॥

భాగ—దశ—మ.

గీ॥ కూడినదువంగ గనివారితోడభజుడు । ధార్త్రరాష్ట్రులు మన

ఇట్లు భారత భాగవతాదులయందు యదుకురువంశ్యులకు పరస్పరబంధు ప్రమాణంబులు గలిగి యుండగాను యదు కురువంశ్యులు చంద్రవంశ క్షత్రియులై యుండగాను యయాతికుమారుల సంతతియైయున్న వీరిని గురించి భేదాభేద విచారముచేయుట లెక్కవగాదైనను గ్రంథాంతరములయందక్కడక్కడ బంధు సంబంధంబు పెక్కు-మాకులుగ్గడింపకుంకుటచే యాద్యంతంబులుగా విచారింపని వారి సందేహ నివర్తికై దెల్ప నవశ్యకమైనదిగాని భేదమేమియు లేదు॥

భాగ-౯-పూ॥

ప్రశ్న:— చ॥ అనఘయయాతిశాపమున యాదవవీరులకున్నరేశ్వరా। సనమువనుండరాదు నృపసత్తమరాజపుగమ్ముభూమికి । న్నినుగొలువంగ నిర్జరులునీకరిబెట్టుదురన్యరాజుల । న్ననిగొనుకొంతరమ్మజనపాలన శీలివిగమ్ము వేడ్కతో॥ అను ప్రమాణంబుచే గొల్లలను వృత్తినామముగల యదువంశ క్షత్రియులకు యయాతి శాపమువలన సింహాసనాధికారార్హతలేనట్లు చెప్పియుండగా పాండవాదులకును యదువులకును భేదము నేమియు లేదనుటకు కారణమేమి॥

ఉ:— [illegible] ము నుండరాదను పదమునకు యదువంశమునకు రాజసింహాసనాధికారార్హత యేమియు లేదని యర్థము కాదు. ఆరాజు పరిపాలనచేయు రాజ్యమునకు రాజధానియగు మధురా పట్టణమందుగల సింహాసనమునకు మాత్రమే యర్హత లేనట్లు సంగవలయు॥

ఇందుకు దృష్టాంతములు.

భారతము-ఆది-౩-ఆశ్వా॥

వ॥ నాజరాభారంబుదాల్చిన పుత్రుండు రాజ్యంబునకర్హుండు

డును వంశకర్తయగునని యు శుక్రుఁవచనంబు నిట్టిదియనియు యయాతి ప్రభృతి జనంబుల నొడంబరచి పూరునఖిల భూభార దురంధరుం జేసి యదుప్రభృతుల ప్రత్యంతభూములకు రాజులం జేసి తాను తపోవనంబునకుంజనియె॥

భార-ఆది-౩ ఆశ్వా॥ (శాపవిధము.)

వ॥ అని యొడంబడకున్న యదువంశంబు వారు రాజ్యంబున కనర్హులుగా॥ దుర్వసువంశంబు వారు ధర్మాధర్మవివేకశూన్యులై సంకీర్ణకిరాత దేశంబులకు రాజులుగా ద్రుహ్యువంశంబు వారుడకప్లవ విరహితంబైన దేశంబునకు రాజులుగా జరాదూషకుండగుటన నుపువంశంబువారు ముదిమియగునంతకనుండక యవ్వనంబున పంచత్వంబు నొందువారునుగా శాపంబిచ్చి॥

భాగ-నవ॥

వచనము॥ కొంత॥ పూరునియవ్వనంబిచ్చి ముదిమితానగైకొని విగతలోభుండై నిజభుజశక్తి పాలితంబగు భూమండలంబు విభాగించి ద్రుహ్యునకు పూర్వభాగంబును। యదువునకు దక్షిణభాగంబును। దుర్వసునకు పశ్చిమభాగంబును ననువునకు నుత్తరదిగ్భాగంబును సంరక్షింపుండని యిచ్చి వారల నమక్షంబున॥

క॥ నాలుగుచెరగులనేలయు। బాలింపుండంచు నగ్రభవులకు బంచెన్। భూలోకమేలు మనుచును। బాలాపోకుం వారిబూరు బట్టముగట్టెన్॥

మత్స్యపురాణం-౩౪-అ॥

శ్లో॥ యఃపుత్రోగుణసంపన్నో। మాతాపిత్రోర్హితస్సహి। సర్వశోహ్యాతికల్యాణంక నియానపిసప్రభుః॥ ౨౬॥

అహ్నః పూరిరంరాజ్యం । యః ప్రియః ప్రియకృత్తవ । వర దానే శుక్రస్య నశక్యం వక్తుముత్తరమ్ ॥ ౨౭॥

తా॥ జనకుని జననిల వాక్యానుసరణ నటించెడు కొడుకు కొడుకుగాని జడమతిచే జనకునుల్లంఘించిన కొడుకు కొడుకుగాడు గావున వారు రాజ్యార్హులుగారు శుక్రవచనమిట్టిదయె॥

మ-౩౯-అధ్యా.

శ్లో॥ శక్రః ॥ యదా పూరుస్తవకృతే రాజ్యం రాజ్యగృహీత్వా ప్రచచారలోకే తదాసరాజ్యం సమ్యదాప్తేన తస్మైత్వయాకిము క్తః । కథయోమహసత్యమ్ ॥ ౪ ॥ యయాతిః ॥ గఙ్గా యమునయోర్మధ్యే కృత్స్నోయంవిషయస్తవ మధ్యేపృథివ్యాస్త్వం రాజాభ్రాతరోన్త్యధిపాస్తవ ॥ ౫ ॥

తా॥ పూరునకు పట్టముగట్టుచో యేమిచెప్పితివని యింద్రుడు యయాతి నడిగిన తాను పూరునకు గంగా యమునల మధ్యరాష్ట్రిమేలునటులను అతని యన్నలు దానిచుట్టునున్న రాజ్యంబులం బాలించునటులను యేర్పరచితినని చెప్పెను॥

ఇట్లు యయాతి జరిగించినట్లు తెలిసియుండుటచే యయాతి కాలములోనె యదువు మొదలగు వారికి సింహాసనార్హత కలిగినట్లు కనుపడుచున్నది॥

భాగ ॥ నవ ॥

సీ॥ హరికళాసంజాతుడైన దత్తాత్రేయు సేవించి సద్యోగసిద్ధి బొంది । బహుయజ్ఞదాన తపంబులు గావించి సకలదిక్కులు గెల్చి జయముతోడ । సతతంబుహరినామ సంకీర్తనము శేయ ధనములు బొందియు దారవృత్తి । యనుబడినట్టెడు వేనేండ్లు భూచక్రంబు ఘనకీర్తి దనపేరుగానేల । ముసలులేకత నయోమూర్తియై మారుకీర్తి । నమరగార్తవీర్యుడనగవిభుడు । నిజము వానిభంగి నలయేలినయట్టి । రాజు

గానమెందురాజముఖ్య ॥ ఇతడు యదువంశమందు జనించిన కార్త
వీర్యార్జనుండు॥

భాగవత॥

మ॥ కృశమధ్యల్ పదివేవురంగనలతోఁ గ్రీడద్స్వమోదింపన । న్కృ
శలుండై పదివేలులక్షలు సుపుత్రుల్భక్తి సేయఁగా జతుర్దశరత్నుం
డనుయోగినాఁబరగి సప్తద్వీప రాజేంద్రుడై శశిబిందుండురునీతిమం
తుడమరేఁ సత్కాంతి పూర్ణేందుడై ॥ ఇతడు యదువు రెండవ
కుమారుడైన క్రోష్టువు వంశమందు జనించినవాడు॥

యదువంశమునకు సింహాసనార్హతయే లేనియెడల యీ
వంశమందు జనించిన కార్తవీర్యార్జునుడు శశిబిందుడు మొదలగు
వారు భూచక్రంబంతయు వేలసంవత్సరము లెల్లేలిరి॥

భారతం । మౌసల ॥

సీ॥ నిలిపిన తెరగెల్ల నృపవరజెప్పెద వినుకృత ధర్మనందనునిజూ
చి । నీతల్లియును నీవు నీతోఁడబుట్టినవారును మృత్తికావరపురమున ।
నిలుడబహుసంపదలబొల్చు నప్పట్టణంబు తదీయదేశంబునిచ్చి । య
భిషిక్తుజేసిననాతండు నిజపరిజనములు దానుహర్షంబెల్లపఁ । నందు
బోయె సరస్వతి యనగబరగు । ఘననగరమున సాత్యకి తనయునెల్ల ।
నెయ్యమును గారవంబును నెరయనిల్పి । యనుపముదమున నందుల
కతడుచనియె ॥

సీ॥ తక్కినవారినింద్రప్రస్థ నగరంబునకుం గొనిచని వజ్రునాథుగాగ ।
నందుబట్టముగట్టి హస్తితురంగరథంబుల విభజించితగినభంగి । న
మ్మురకుం సమర్పితమ్ములుజేసి యన్యోన్యబంధులనందునందు । నిలుచు
నట్లొందగనియమించియంతట యక్రూరుంభార్యల నాత్మజులను । వ

ర్జునకునొప్పగించెనవ్యాసుడేళ్ళు । పౌత్రుడతివినయంబునబల్కెవరుస । వారినిటువలెవారిరివలయు నెడకు । దానివిషయమొరకుండే భీమాను జాందు ॥

భాగ-ప్ర.

సీ॥ కలివర్తనంబున గ్రాగ్ర్యహింసాసత్య దంభకౌటిల్యాద్యధర్మ చయము । పురముల గృహముల గ్రామముల వనలోన గలుగుట దల పోశి కరిపురమున । మనుమని రాజుగా మనుపనదీవించి సింధుతోయక నాభిషిక్తుజేసి । యనిరుద్ధనందనుండైనవజ్రుని దెచ్చి మధురబట్టముగ ట్టినమతిబాసి । కరులతురగములను కంకణాదికముల । మంత్రిజనుల బుధుల మానవతుల । సకలమైనధనమునభిమన్యుసుతునకు । నప్పగించి బుద్ధివాత్రసయుంచి ॥ యీమూడుపద్యములకు ముఖ్యతాత్పర్యము॥

కలియుగాదియందు కృతవర్మ కుమారునకు మృత్తికావురము రాజధానిగా నియమించి పట్టాభిషిక్తునిజేశినట్లును సరస్వతి యనుపేరుగల గొప్పపట్టణమును రాజధానిగా నియమించి సాత్యకి కుమారునకు పట్టాభిషేకము జేసి సింహాసనాధ్యక్షునిచేశినట్లును, శ్రీకృష్ణుని మనుమండగు వజ్రుని యింద్రప్రస్థ నగరంబున రాజుగా నియమించి పట్టాభిషిక్తుని జేసినట్లును, మరియును మధురకును నావజ్రుని పట్టాభిషిక్తుజేసినట్లు జెప్పియున్నది. యీమొదలగున కారణములనుబట్టి యదువంశ క్షత్రియులకు రాజసింహాసనాధికారము కలిగయేయున్నది. ఇచ్చట యదువంశ సంభవుండగు వజ్రునకు ఇంద్రప్రస్థపురమును, మధురయును, రాజధానులుగా నియమించుటేమియని సందియంబు ప్రతిపాదించుచున్నట్లైతే కేసిగసిన యయాతి శాపమున తత్సింహాసనాధికారము లేకపోవుటచే, అనగా మధురయందు సింహాసన

నము యయాతి యొక్కనది. వీలుగలుగక యింద్రప్రస్థపురంబు ముఖ్యరాజధానిగా నియమించి సింహాసనస్థునిజేసి తత్పూర్వరాజధాని యగు మధురకునుకూడా వజ్రునినధిపతిగా నియమించిరని యెరుంగ వలయును ॥

(అనఘ యయాతి శాపమున) అనెడు పద్యమందు శాపకారణ సిద్ధాంతముగా తాను యదు కులమునందు జనించిన వాడనని యు తనకు రాజ సింహాసనార్హత లేనట్లు బలికి యుగ్రసేనునికి పట్టాభిషేకము జేయుటయేమనిన ఆమధుర రాజధాని యయాతి యేలిన సింహాసనమై యుండుటనుబట్టియును తాను రాజ్యభారాపేక్ష లేని వాడవుటవలనను పుత్రదుఃఖ నివారణార్థము రాజ్య సుఖంబులనుభవింపజేయుటకు నట్లుజరిగింపబడెను। నట్లుగాకున్న రాజ్యసింహాసనార్హత లేని శ్రీకృష్ణుని ధర్మరాజెట్లు రాజసూయ యాగమందు సకలరాజన్యుల మండలిలో నగ్రపూజార్హత యెట్లుగలిగినది విష్ణువవుటచే నట్లుజరిగించిన నిన త్రయీధర్మనిరతులగు వారు లౌకిక విరుద్ధంబున కెట్లంగీకరింతురు? అట్లంగీకరించిన మహావిష్ణువగు శ్రీకృష్ణుండు రాజ పీఠార్హత కెందుకంగీకరింపబడడు। కావున యయాతి శాపాభిప్రాయము పెద్దకొడుకగు యదువు వంశము వారికి రాజ్యపరిపాలనత్వాదులు లేకపోవుటకాదు. రాజ పీఠార్హత లేదనగా అప్పుడు మధురయందుగల [illegible]నము పూరునివంశమువారు యొక్కటి వశసినదిగాని యదువం[illegible]క్కరాదని శపించినట్లు యెరుంగవలయును- యెందువల్లనన ఆయయాతి యదువునకు దక్షిణదేశము భాగమిచ్చినట్లును తన రాజధానియందుగల సింహాసనము పూరునకిచ్చినట్లున్నది, శాపఫలమేమనగా! పెద్దకొమారునకు తం

ద్రి రాజపీఠాభిషేక హానికర ధర్మశాస్త్రమైయుండగా పితృవాక్యపాలన చేయని కుమారుని అగ్రజునిగా భావింపక కనిష్టపుత్రుడైన పితృవాక్య పరిపాలన ధర్మంబాచరించుటచేత । అగ్రజాధికారమివ్వబడక యగ్రకుటుంబాధికారహానికి దప్పించి కనిష్ట కుటుంబమునకు గలిగించుటయే శాప ఫలంబని యెఱుంగుము ॥

ప్రశ్న:— యీచెప్పబడిన చంద్రవంశ క్షత్రియులకును సూర్యవంశ క్షత్రియులకును భేదమేమైనకలదా.

ఉ:— సూర్యవంశమునకు మూలము సూర్యుడు.

భా-ఆది-3ఆశ్వా॥

తొల్లి దాక్షాయణియైన యదితికి కశ్యపునకు బుట్టిన వివస్వంతునకు వైవస్వతుండను మనువును యముండును శనైశ్చరుడును యమునదపతియును బుట్టిరి. అందువైవస్వతుడను మనువునందు బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రులైన మానవులుబుట్టి మరియు వానికి వేన ప్రముఖులైన రాజులేబండ్రుబుట్టి వంశంకరులై తమలో దాము యుద్ధంబులుజేసి చనిరి ॥ మరియు నమ్మనుపుత్రియైన యిలయను దానికి చంద్రుని కుమారుడగు బుధునకును పురూరవుండు జనియించి చక్రవర్తియయ్యె నతనికి నూర్వసియందు నాయువు ధీమంతుడు వసువు దృఢాయువు వనాయువు శతాయువులను నార్వురు కుమారులలో నాయువునకు స్వర్భానవను - నతనికి నహుషుడాదిగా బలువురు గలిగిరి. యానహుషునియందు ప్రియంవదయను దానికి యయాతి యాదిగా అయిదుగురు పుత్రులు యదువు మొదలుగాగల వారు జనించి వంశకరులైరి ॥

భారతం-ఆది-[illegible]॥

సీ॥ ఆదిత్యునకు పుత్రియైయొప్పగ సావిత్రికి ననుజయై యుత్తమ లక్షణాభిరా
మాంగి। తపతియన్నకన్యక ధవళాయతేక్షణ యౌవనసంప్రాప్త యైన
దాని। కావిమలకలాన్యకసురుచిరగుణముల కనుగుణుండగు నిర్మలాభిజా
త్యు। బతినెవ్విధంబున బడయుదునో యని తలచుచునున్న యత్తపను
గూర్చి। భక్తి తపముజేసె ప్రభుడజామీఢనం। దనుడుభరతకులుడు
ధర్మవిదుడు। సర్వగుణహితుండు సంవరణుండను। వాడుకృతజ
పోవ్రతాదివిధుల ॥

వ॥ దానం జేసి మహీతలంబున కనావృష్టియైన నెఱింగి వసి
ష్ఠుండు శాంతికపౌష్టిక విధుల నొనర్చి సంవరణుండు దోడ్కొని హస్తి
పురంబున కరిగిన నఖిల ప్రజలకు ననురాగంబయ్యె. ననావృష్టి దోషం
బులుం బాసె నంత సంవరణునకుం దపతికిం దాపత్యుండన కురుం
డు బుట్టె. నది మొదలుగ మీరలు దాంపత్యులైతిరని గంధర్వుండు
సెప్పిన నర్జునుండిట్లనియె ॥

ఇట్లు చంద్రవంశ సంభవుండగు బుధుడు వైవస్వత మనువు
కూతురగు యిలయను దాగిః, ఆదిత్యుని కూతురగు తపతియను దా
నిని సంవరణుడును పరిగ్రహించుటచే॥

మనుస్మృతి॥

సవర్ణాగ్రే ద్విజాతీనాం ప్రశస్తా దారకర్మణి। కామతస్తు ప్ర
వృత్తానా। మిమాస్స్యుః క్రమశోవరాః ॥ ఇతి॥ శూద్రైవ భార్యా
శూద్రస్య- సాచస్వాచవిశస్స్మృతే-తేచస్వాచైవ రాజ్ఞస్స్యు। స్తాశ్చ
స్వాచాగ్రజన్మన ॥

అయా యుగములయందు గోప్పవంశక్షత్రియులని తక్కువవంశీయులు పెండ్లియాడుట విధిలేనందువలన పవిత్రమయిన కులముగలవాని కొరకై సూర్యుండు ప్రయత్నించి సంవరుణునకు దపతినిచ్చుట చేతను చంద్రవంశ క్షత్రియులకన్న సూర్యవంశపు రాజులధికులయినట్లు కనుపించవద్దు.

భాగ.

ప్రశ్న:— కం॥ బాలాయమ్ముయదుకుల ని। ర్మూలకరంబైనయట్టి ముసలంబొకటీ। బాలిక ఉదయించునుబొం। డాలస్యము లేదటంచు ననిపల్కుటయుక్॥ అనుప్రపన్నాణంబున మునిశాపంబున యదువంశ క్షత్రియుడగు సాంబునకు ముసలంబుబుట్టి యదుకులమంతయు నిర్మూలమైనట్లు జెప్పియుండగా నీకలియుగంబున గొల్లలను వృత్తినామముగలవారు యదువంశక్షత్రియులని యెట్లుచెప్పవచ్చును

ఉ:— చంద్రవంశక్షత్రియులలో యదువృష్టి భోజాంధకాది వంశంబులు బహుళముగా వృద్ధిబొంది గణనాతీతంబై యొప్పెనెట్లనగా.

భాగ—దశ—ఉ.

సీ॥ హరియిట్లు గృహమేధియగుచు శతోత్తర షోడశసహస్రసుందరులను। మునునీకు నెరుగజెప్పినరీతి, నందరకన్నిరూపములు దాన శ్రీధాల్చి। గ్రక్కొని యొక్కొక్క కామినీమణియందు రమణనమోఘవీర్యమునజేసి। పదురేశికొడుకుల బడసెరుక్మిణ్యాది పట్టమహిషుల కుద్భవులునైన। నందనులలోన ధరణినెన్నంగ బాహు। బలపరామవిజయ సంపద్విశేష। మానితాత్ములు పదినెనమండ్రువారి। నెరుగవినుపింతు వినుమురాజేంద్రచంద్ర॥ వ॥ అనియిట్లనువారలు ప్రద్యుమ్న, అనిరుద్ధ, దీప్తిమద్భాను, సాంబ, మిత్ర, బృహద్భాను,

మిత్రవింద, సృష్ట, అరుణ, పుష్కర, దేవబాహు, శ్రుతదేవ, సునంద
న, చిత్రభాను, వరూథ, కవి, న్యగ్రోధులను నామంబులచే ప్రసిద్ధులై
రి. పెంజడియు, త్రివక్రయందు సంభవించిన యుపశ్లోకుండనువా
డు తనజనకుండగు కృష్ణసేవారతుండగుచు నారదయోగీంద్రు
నకు శిష్యుండై యఖండిత దివ్యజ్ఞాన బోధాత్ముండగుచు స్త్రీశూ
ద్ర దాసీజన సంస్కారంబై స్మరణమాత్రంబున ముక్తి సంభవించున
ట్టి సాత్వతతంత్రంబను వైష్ణవస్మృతిగల్పించె. నిట్లు మధుసూదననం
దనులు బహుప్రజలు నధికాయు రోన్నతులు ననల్పవీర్యవంతులు
బ్రహ్మణ్యులై విఖ్యాతిబొందిరి. వారిని లెక్కబెట్ట పదివేల సం
వత్సరంబులకైనం దీరదు. మున్ను నీకెరిగించినట్లు తత్కుమారులకు
విద్యావిశేషంబులు నియమించు గురుజనంబులు మూడుకోట్ల నేను
బదెనిమిదివేల నూర్గురు గలిగియుండు. నక్కుమారుల గణింపనెవ్వ
రికిని వశంబుగా దదియునుంగాక.

కం॥ నతదేవాసురపం। గరమున మునునిహతులైన క్రవ్యాదన
ము। త్కరము నరేశ్వరులై। ద్వాపరమున జనియించి ప్రజల బాధ
లబరచగ॥

కం॥ హరితద్భారార్థమై ని। జహరులను యదుకులమునం జని
యింపగ। ధరనూటొక్క కులంబై బరగిరి। వారినిగణింప బ్ర
హ్మకవశమె॥

యదుమహాంతకుటుంబికుండగు శ్రీకృష్ణునకు మాత్రము పదహారువే
ల గోపికలయందును నొక్కొక్కస్త్రీకి పదునేసివంతున కొడుకులును,
పట్టపుదేవులగు రుక్మిణ్యాది యెనిమిదిమందికి పదునెనిమిదిమంది బ
లపరాక్రమాది విశేషవంతులగు ప్రద్యుమ్నాది కుమారులును శ్రీ

వక్రియందు నుపశ్లోకుడనువాని గనినట్లును వారిలెక్కబెట్ట పదివేల వత్సరంబులకు దీరదనియును, తద్బాలకులకు విద్యాదులుగరపిన గురుజనసంఖ్య మూడుకోట్ల యెనుబదెనిమిదివేల నూర్గురనియును నందుచేత నగణితంబనియును, చెప్పియున్నది. యిక్కడనొక్కసందియంబు బాధించుచున్న దదేమనిన, నొక్కొకస్త్రీకి పదిమందిచొప్పున నన్నప్పుడు స్త్రీసంఖ్యనుబట్టి యేకలక్ష యరువదివేల సంఖ్యకనుపదుమండగా నగణితమని చెప్పరాదు. జాగ్రత్తలజెప్పవలసిన యొక్కొకస్త్రీకి పదుగిరికి తక్కువగాకుండా కన్నాడనియర్థము చేయవలెను. యింతవృద్ధికికారణము దేవాసురయుద్ధమున మరణించిన రాక్షస సమూహమంతయు ద్వాపరంబున క్షత్రియవంశమునందు జనియించి జనులబాధించుటజేసి దేవతలు హరియును యదువంశమునందు జనియించిరనియు. నీయదువంశమందు జనియించినవారి వంశంబులు నూటొక్కకులమైనదనియు వారలగణింప వశముకాదనియు భాగవతమునందు జెప్పబడియున్నది. యీనూటొక్కకులముువారు ద్వారకయందుండిననుగదా మునిశాపమరణము తటస్థపడును. యెవరెవ రేయేదేశముల యందరెందరుండిరో తెలియదందరొక్కమాటు నశించిరని చెప్పరాదు. మునిశాపమందరిని నశింపచేయక తప్పనాయనిన కొందరు యదువంశ్యులు తప్పినట్లు భాగవతమునందు జెప్పియున్నది.

భాగ—౧౦—౬.

వ॥ అట్టిసమయమునందు మాధవునకు రుక్మిణీ పితృసముండును సమగ్ర భుజావిజృంభణుండును ప్రద్యుమ్నుండు జనియించె. నతనికి రుక్మిణికుమారుడు శుభాంగివలన ననిరుద్ధుడుదయించె నతనికి మౌసలావశిష్టుడయిన వజ్రుండుసంభవించె నతనికి ప్రతిబాహుండును

డు. వానికి సుబాహుండు జనియించె, నతనికి నుగ్రసేనుండు ప్రభవించె, నాతనికి శతసేనుండుగలిగె. నిట్లు యదువృష్ణి భోజాంధక వంశంబులు పరమపవిత్రంబులై పుండరీకాక్షు కటాక్షవీక్షణ శయ్యాసనాసనగత సరసాలాప స్నానాశన క్రీడావినోదంబుల ననిశంబు జెందుచు సర్వదేవతార్థణంబు సమస్తంబులై వక్రీత్రవ్యలోనరింపుచు పరమానంద కందళిత చిత్తులై రని చెప్పివెండియు ॥

భాగ—ప్ర.

మ॥ యదువీరుల్ మునినాథశాపమున గోలాధీనులై యన్యుదర్పా । న్మదిరాపాన వివర్ధమానమద సమ్మర్దోగ్ర దోషాంధులై । కదనంబుల్ దమలోనమున్ష్టి హేతులక గావించినీల్గిరి రివ । వ్వదశా జక్క–రి నల్గురేవ్వరచటన్ । నర్వాంసహవల్లభా ॥

సీ॥ కలివర్తనంబున క్రౌర్యహింసాసత్య ధంభకౌటిల్యావ్య ధర్మచయము । పురములగృహముల భూములదములోన గలుగుడదలపాసి కరిపురమున । మనుమని రాజునై మనుమనిదీవించి సింధుతోయకణాభి షిక్తు జేసి । యనిరుద్ధనందనుండైన వజ్రుని దెచ్చి మధురబట్టముగట్టి మమతబాసి । కరంలతురగములను కంకణాదికములు మంత్రిజనుల బుధులమానవతుల । నఖిలమైనధనము లభిమన్యుసుతునకు । నప్పగించిబుద్ధి సొత్రయించి ॥ ముఖ్యతాత్పర్యము.

శ్రీకృష్ణుని మనమండగు వజ్రుడనువాడు మౌసలావస్థుండైన ట్లునను వానిని ధర్మరాజు కలియుగాదియందు మధురకు వానిపిబట్టముగట్టినట్లును యతనికి సుబాహుండాదిగాగల పుత్రులుజనించి వంశంబుల వృద్ధిబొందినట్లును పూరువంశజుడగునట్టియు నర్జునిమనుమండగు పరీక్షిత్తును హస్తిపురంబునకు పట్టాభిషిక్తుని జేసినట్లును

ఇదియునుంగాక మునిశాపకారణమున గలిగిన యుద్ధమందు మరణింపక నలువురేవ్వరు జీకిలిరనియు జెప్పియున్నది (సప్తదశం జికిలిరి నల్వురేవురుమువా) కొమ్మం(దుగురు నిలచినని యుద్ధముజేయుటకం బె. నలుగురైదుగురు పద్దెనుగురుఅనుట, ఇందరుఅని యెన్నిక చేయని కొద్దిసంఖ్యనుచెప్పు లోకసాధారణ వాచకమై యున్నది. అందు చేత అపరిమిత జనసంఖ్యయందు యుద్ధమందు నిలచిన వారు బహు కొద్దియని చెప్పుటయె కాని నిష్కర్ష సంఖ్యావాచకముగాదు. గాక.

భాగ—త్ర.

క॥ శౌరియు నతిరధవరులు మ। హారథిక సమరధులు యదు బలాదివులెల్లన్। బోరి మృతిబొంద నుద్ధవు। డేరీతిన్ బ్రతికె దా ని నెరింగింపు తగన్॥

తా॥ శ్రీకృష్ణుడును అతిరధ, మహారధ, సమరధులు యుద్ధమందు మృతిబొందగా నుద్ధవుడు మాత్రమెట్లు బ్రతికియుండెనని శుకుల వారిని పరీక్షన్మహారాజు ప్రశ్నజేసినట్లు చెప్పియున్నది.

భాగతం--మౌసల.

సీ॥ పదపడియాదవ భామినీ బాలక వృద్ధజనంబు నాశుద్ధబుద్ధి। కలయంగ గైకొని పలుకుల మాదఱవమూర పురంబున కరుగజెప్ప। రామకృష్ణులు దపోరతులై ప్రవతిలందు వనభూమియారసికొని తదీయ। సందర్శనమునకు జనుటకై వారల కామంత్రితులజేసి యేమి యనుచు। టకును శోకము మాన్పుటకును దారకుడాదియైన తగిన వారి నహాఱవచన। రచన నెరయ బనిచి యుచితత్వకతిపయ। జన్ములతోడరాగ జనియె నధిప॥

తా॥ అర్జునుండు ద్వారవతికేగి యదుక్షయానంతరమున గల స్త్రీ బాలవృద్ధ జనులను మిక్కిలి యాదరణగల మాటలచే యింద్రప్రస్థ పురంబున కరుగ నియోగించి స్త్రీ బాలవృద్ధ దుఃఖోపశమనమునకై వారలవద్ద నిల్చెననియు॥

భారతం—మౌస.

సీ॥ కోపించి గాంధారి శాపమిచ్చినయది యాదవ సంక్షయమ్ము గుటమెట్లు! దప్పదు మనముత ద్బాలవృద్ధ స్త్రీ జనంబుల నెల్ల నహీనం బులైన! కావుల సప్రతిష్ఠా విశేషంబుగా జేయంగవలయు నశ్రాంత మునకు। నోదవి యత్తెరంగున కుత్సహింపు టకృత్యమర్జున నీకని యాడుచుండు। బలుమరును దలంచి పాండవాగ్రజుడది। కారణ ముగ నతని కరుణ జెంపు। నొప్పనెరుగు గాన నప్పార్థుడయ్యెదు। నికరశేష జనుల నెమ్మి నిల్పె॥

సీ॥ నిలిపిన తెరగెల్ల నృపవర జెప్పెద వినుకృతవర్మ నందనునిజూచి। నీతల్లియును నీవు నీతోడ బుట్టిన వారును మృత్తికావర పురమున। నిలుడని బహుసంపదల బొల్పునప్పట్టణంబు తదీయదేశంబునిచ్చి। యభిషిక్తుజేసిన నాతండు నిజపరిజనములతోడ హర్షం బెలపగ। నందు బోమె సరస్వతి యనగ బరగు। ఘననగరమున సాత్యకి తనయు నట్లు। నెయ్యమును గారవంబును నెరయనిల్పి। యనుపముదమున నందులకతడు చనియె॥

సీ॥ తక్కిన వారి నింద్రప్రస్థనగరంబునకు గొంచని వజ్రునాథు గాగ। నందు బట్టముగట్టి హాస్తితురంగ రథంబుల విభజించి తగిన భంగి। నమ్మ్రప్పురకు సమపితంబుజేసి యట్టె బంధులనందు నందు। నందును నిలుచునట్లొంగా నియమించి యాకృష్ణు భార్యల

నాత్మజులను । వజ్రునకు నొప్పగించిన వాసుదేవు । పౌత్రుడతి వినయంబున బట్టువడుచు । వారు నిలువక పోయిరి వలయునెడకు । దానివిని యారకుండె భీమానుజుండు॥

గీ॥ వినుడు యాదవ భామినీవృద్ధ బాలజనులనందరి నుచితవర్తనముతోడ । పొ్రిద్దువడవక ముందర బురజన ప్ర । యుతముగా బురి వెలువరించితి గడంగి॥

గీ॥ చాపదండని యతినోపిన భంగి గి । రాతకోటినాగి రామకృష్ణ । వల్లభాదులైన వనితల గొందర । వృద్ధబాలకులను వెరవుతోడ॥

అన్నిటికి ముఖ్యతాత్పర్యము.

పూర్వము గాంధారి కృష్ణునిపై కోపించి శాపం బిచ్చుటచేత యదు సంక్షయంబు గాక తప్పదనియు తద్బాలవృద్ధ స్త్రీ జనంబుల నాకాలంబునకు తగిన చోటుల ముందు ప్రతిష్ఠించుటకు కర్తవ్యుడ వీవేయని ధర్మరాజు అర్జునునితో నాడుచుండె ననియు నట్లనె యిప్పుడర్జునుండు యదు నికర శేషమగు కృతవర్మ నందనుని యతని తల్లిని తోడబుట్టిన వారితో సహా మృత్తికావురమున నిల్పి తత్పట్టణము తద్దేశము వారికిచ్చి పట్టాభిషేకము జేసెననియును సరస్వతి యను పేరు గల పట్టణమును సాత్యకి కుమారుని రాజుగా నియమించి తద్దేశములునొసంగి పట్టాభిషిక్తు జేసెననియు దక్కిన వారిని యింద్రప్రస్థ పురంబునకు దోడ్కొనిపోయి తద్దేశమునకు శ్రీకృష్ణుని పౌత్రుడగు వజ్రుని రాజుగా నియమించి తత్రాజ్యమునకు పట్టభద్రునిగా నొనరించి రథగజ తురగాదుల ముప్పురికి సమంబుగా బంచి యిచ్చెననియు దక్కిన బంధువుల నక్కడక్కడ నుంచెననియు కూ్రుని భార్యయు పుత్రులు వజ్రుపాలనలో నుండక యిష్టవచ్చినచోట నుండిరనియు

యదుసంబంధమైన స్త్రీలను, వృద్ధులను, బాలురను గ్రామములో నుండు యితర జనులతోఁగూడా వుదయము గాక పూర్వము ద్వారవతి వెడలించితినని రుక్మిణ్యాది కృష్ణమహిషులతో నర్జునుఁ డాడినట్లును రామకృష్ణవల్లభాదులైన స్త్రీలను, వృద్ధులను, బాలకులను కిరాతదండనను చిక్కకుండునట్లుఁ జేసి తెచ్చితినని వ్యాసులవారితో అర్జునుం డాడుటయు మొదలుగాఁగల ప్రమాణంబులనుబట్టఁగా యదువంశమునందనుకులు వంశాకరు యదుక్షయంబున దప్పిరని తెలియు వచ్చుచున్నది. (సీ॥ పదపడి యాదవభామినీ బాలక వృద్ధజనంబు) రెండవ పద్యములో రెండవ చరణము (దప్పుదు మనము తద్బాలవృద్ధస్త్రీ జనంబులనెల్ల) గీతపద్యము ప్రథమ పాదంబున (వినుడు యాదవ భామినీ వృద్ధబాలజనుల) రెండవ గీతపద్యములో (వల్లభాదులయిన వనితల గొందర వృద్ధబాలకులను) అని చెప్పియుండుటచే బాలురు, వృద్ధులు, స్త్రీలు నిలచిరని విస్పష్టముగా వ్రాశియుండుటను బట్టియు యాదవాదులలో ప్రముఖులైన వారే మరణించిరిగాని అనేకమంది బాలురు, వృద్ధులు, స్త్రీలు, వజ్రుడు సాత్యకి కుమారుడును కృతవర్మ కుమారుడును విదేశీయులు మొదలగు వారు చాలామంది నిలచి యుండుట తెల్పబడియె యున్నది. నూటొక్క వంశములుగానేర్పడిన శ్రీకృష్ణసంతతి యంతయు కొందరు యదుక్షయములో ప్రముఖులయిన వారలు గలశినను పెక్కుమంది వంశాకరులై మనిరనుటకు యేయాక్షేపణయును లేను.

## చంద్రవంశవృక్షము.

1 నారాయణమూర్తి.

2 బ్రహ్మ.

3 అత్రి.

4 చంద్రుడు.

5 బుధుడు.

6 పురూరవుడు — యితను చక్రవర్తి

7 ఆయువు.
8 శ్రుతాయువు.
9 సత్యాయువు.
10 రయుడు.
11 జయుడు.
12 విజయుడు.
} నె 6 వ పురూరవుని కొమాళ్లు ఆరుగురు.

13 భీముడు — యితడు నె 12 వ కుమారుడు.

14 కాంచనుడు.

15 హోత్రుడు.

16 జహ్నువు — యితను గంగను పుక్కిట నిడినవాడు.

17 బూరుడు.

18 బాలకుడు.

19 సజకుడు.

20 కుశుడు

21 శాంబుడు.
22 ధూర్తయుడు.
23 వసువు.
24 కుశనాభుడు.
} నె 20 వ కొడుకులు నలువురు.

25 గాధి — నె 21 వ కొమారుడు.

యితడు రాజ్యపాలన చేసినవాడు

73 భార్గభూమి — వీరి వంశమువారు గార్గ్యవంశజులును వృద్ధక్షత్రవంశ జాతులన బరగిరి.

74 దృహ్యుడు.
75 యదువు.
76 దుర్వసుడు.
77 అనువు.
78 పూరుడు.

యీయైదుగురు 62 రు యయాతి కుమారులు. వీరిలో యదువంశమున బుట్టినవారు యాదవులనబరగిరి. పూరుని వంశమువారు పౌరవులు.

79 బభ్రుసేతువు. — నె 74 రు కొడుకు.
80 నారబ్ధుడు.
81 గాంధారుడు.
82 ఘర్మ్మడు.
83 ఘృతుడు.
84 దుర్మ్మదుడు.
85 ప్రచేతస్సు.
86
87

ఇతనికి నూర్వ్వురు కొడుకులుపుట్టి మ్లేచ్ఛాదిపతులై యుదీచిదిశ నాశ్రయించిరి.

88 వహ్ని. — నె 76 రు కుమారుడు.
89 భర్గుడు.
90 భానుమంతుడు.
91 త్రిసానువు.
92 కరంధముడు.
93 మరుత్తుడు.
94
95

ఇతనికి యయాతిశాపవశంబున సంతతి లేదయ్యె.

96 సభానరుడు.
97 చక్షుస్సు.
98 పరోక్షుడు.

నె 77 రు అనువుకొడుకులు మువ్వురు.

దృఢవ్రతుడు.

147 సత్యకర్మ్ముడు. ఇతనిది (111) అంగ, వంగ, వంశము.

కృత్స్నమదుడు. ఇతడు పురూరవుని మునిమనమడగు (38) సుహోత్రుని కొడుకు.

148 శునకుడు. ఇతను కృత్స్నమదుని కొడుకు.

149 శౌనకుడు. యితడు బహ్వృచ ప్రవరుండై జన్మించి తపోనియతుండై చనియె.

150 రభసుడు. యితను నె 36 రు కొడుకు.

151 గంభీరుడు.

152 కృతుడు. ఇతను బ్రహ్మకులంబున బుట్టె.

153 శుద్ధుడు. ఇతడు పురూరవునిమనుమడు నె37రు కొడుకు.

154 శుచి.

155 రజస్సు.

156 త్రికకుత్తు.

157 కృతకృత్యుడు. ఇతను విజ్ఞానియై కృతకృత్యుడై చనియెను.

158 జనమేజయుడు. ఇతను(33)రు నహుషుని మనుమడును (78)రు పూరుని కొడుకు.

159 ప్రాచీవానుడు.

160 ప్రవిరోధనమన్యుడు.

161 చారువు.

162 సుద్యువు.

163 బహుగతుడు.

164 శర్యాతి.

165 సంయాతి.

166 రౌద్రాశ్వుడు.

| | |
|---|---|
| 126 చిత్రకేతుఁడు. | ఇతనికి రోమపాదుడను నామాంతరం బుగలదు. యితను సూర్యవంశ క్షత్రియుఁడగు దశరథునికూతురగు శాంతను దత్తతజేసుకొని ఋష్యశృంగుడను ఋషికి వివాహము చేసెను. |
| 127 చతురంగుఁడు. | |
| 128 పృథులాక్షుఁడు. | యితనికి బృహద్రథాది నలుగురుకొడుకులు. |
| 129 బృహద్రథుఁడు. | |
| 130 బృహన్మనస్సు. | |
| 131 జయద్రథుఁడు. | |
| 132 విజయుఁడు. | |
| 133 ధృతి. | |
| 134 ధృతవ్రతుఁడు. | |
| 135 సత్యకర్ముఁడు. | |
| 136 అతిరథుఁడు. | |
| 137 కర్ణుఁడు. | ఇతఁడు సూర్యునకును కుంతికిని పుట్టినవాఁడు. |
| 138 వృషసేనుఁడు. | ఇతను కర్ణునికొడుకు. మరికొందరు గలరు. |
| 139 చంపుడు | ఇతడు పై 128 దు పృథులాక్షుని కొడుకు వీని పేర చంపానగరము నిర్మింపంబడియె. |
| 140 హర్యంగుఁడు. | |
| 141 భద్రరథుఁడు. | |
| 142 బృహత్కర్ముఁడు. | |
| 143 బృహద్భానుఁడు. | |
| 144 జయద్రథుఁడు. | |
| 145 బృహత్కర్ముఁడు | |
| 146 విజయుఁడు. | |

దృఢప్రతుడు.

147 సత్యకర్ముడు. ఇతనికి (111) అంగ, వంగ, ...

కృష్ణమనుడు. ఇతడు పురూరవుని మునిమనుమనకు (33) ...
శాస్త్రుని కొడుకు.

148 శునకుడు. ఇతను కృష్ణమనుని కొడుకు.

149 శౌనకుడు. ఇతను బహ్వృచ ప్రవరుండై జన్మించి త
పో నియతుండై చనియె.

150 రభసుడు. ఇతను నె 36 రు కొడుకు.

151 గంభీరుడు.

152 కృతుడు. ఇతను బ్రహ్మకులంబున బుట్టె.

153 శునకుడు. ఇతను పురూరవుని మనుమడు నె37 వ కొడుకు.

154 శుచి.

155 రజస్సు.

156 త్రికకుప్పు.

157 కృతకృత్యుడు. ఇతను విజ్ఞానియై కృతకృత్యుడై చనియెను.

158 జనమేజయుడు. ఇతను (33) వ నహుషుని మనుమడును (78) వ
పూరుని కొడుకు.

159 ప్రాచీనాసుడు.

160 ప్రతికోధనమన్యుడు.

161 చారుపు.

162 సుజ్ఞాపు.

163 బాహుబలుడు.

164 శర్యాతి.

165 సంయాతి.

166 రౌద్రాశ్వుడు.

126 చిత్రకేతుడు. — ఇతనికి రోమపాదుడను నామాంతరంబుగలదు. యితను సూర్యవంశ క్షత్రియుడగు దశరధునికూతురగు శాంతను దత్తతజేసుకొని ఋష్యశృంగుడను ఋషికి వివాహము చేసెను.

127 చతురంగుడు.

128 పృధులాక్షుడు. — యితనికి బృహద్రదాది నలుగురుకొడుకులు.

129 బృహద్రధుడు.

130 బృహన్మనస్సు.

131 జయద్రధుడు.

132 విజయుడు.

133 ధృతి.

134 ధృతవ్రతుడు.

135 సత్యకర్ముడు.

136 అతిరధుడు.

137 కర్ణుడు. — ఇతడు సూర్యునకును కుంతికిని పుట్టినవాడు.

138 వృషసేనుడు. — ఇతను కర్ణునికొడుకు. మరికొందరుగలరు.

139 చంపుడు. — ఇతడు నె 128 రు పృధులాక్షుని కొడుకు వీని పేర చంపానగరము నిర్మింపంబడియె.

140 హర్యంగుడు.

141 భద్రరధుడు.

142 బృహత్కర్ముడు.

143 బృహద్భానుడు.

144 జయద్రధుడు.

145 బృహత్కర్ముడు.

146 విజయుడు.

దృఢవ్రతుడు.
147 సత్యకర్మ్ముడు. ఇతనిది (111) అంగ, వంగ,
కృత్స్నమదుడు. ఇతడు పురూరవుని మునిమనమడగు (88) సుహోత్రుని కొడుకు.
148 శునకుడు. ఇతను కృత్స్నమదుని కొడుకు.
149 శౌనకుడు. ఇతడు బహ్వృచ ప్రవరుండై జన్మించి తపో నియతుండై చనియె.
150 రభసుడు. ఇతను నె 36 రు కొడుకు.
151 గంభీరుడు.
152 కృతుడు. ఇతను బ్రహ్మకులంబున బుట్టె.
153 శుద్ధుడు. ఇతడు పురూరవునిమనుమడు నె37రు కొడుకు.
154 శుచి.
155 రజస్సు.
156 త్రికకుత్తు.
157 కృతకృత్యుడు. ఇతను విజ్ఞానియై కృతకృత్యుడై చనియెను.
158 జనమేజయుడు. ఇతను(33)రు నహుషుని మనుమడును (78)రు పూరుని కొడుకు.
159 ప్రాచీవానుడు.
160 ప్రవిరోధనమన్యుడు.
161 చారుపు.
162 సుద్యుపు.
163 బహుగతుడు.
164 శర్యాతి.
165 సంయాతి.
166 రౌద్రాశ్వుడు.

126 చిత్రకేతుడు. — ఇతనికి రోమపాదుడను నామాంతరం బుగలదు. యితను సూర్యవంశ క్షత్రియుడగు దశరధునికూతురగు శాంతను దత్తతజేసుకొని ఋష్యశృంగుడను ఋషికి వివాహము చేసెను.

127 చతురంగుడు.

128 పృధులాక్షుడు. — యితనికి బృహద్రదాదినలుగురుకొడుకులు.

129 బృహద్రధుడు.

130 బృహన్మనస్సు.

131 జయద్రధుడు.

132 విజయుడు.

133 ధృతి.

134 ధృతవ్రతుడు.

135 సత్యకర్ముడు.

136 అతిరధుడు.

137 కర్ణుడు. — ఇతడు సూర్యునకును కుంతికిని పుట్టినవాడు.

138 వృషసేనుడు. — ఇతను కర్ణునికొడుకు. మరికొందరుగలరు.

139 చంపుడు. — ఇతడు నె 128 రు పృధులాక్షుని కొడుకు వీని పేర చంపానగరము నిర్మింపంబడియె.

140 హర్యంగుడు.

141 భద్రరధుడు.

142 బృహత్కర్ణుడు.

143 బృహద్భానుడు.

144 జయదధుడు.

145 బృహత్కర్ముడు.

146 విజయుడు.

స మరుత్తులు పెంచి అపుత్రకుండగు భర
తునకు దత్తతగానిచ్చిరి. యితడు భరత
వంశమునకు కర్తయయ్యె.

| | |
|---|---|
| 189 మన్యవు. | |
| 190 బృహత్క్షత్రి. | |
| 191 జయ. | |
| 192 మహావీర్య. | యీ అయిదుగురు నె 189 రు మన్యవు కుమాళ్లు. |
| 193 నర. | |
| 194 గర్గుడు. | |
| 195 ఉరుక్షయు. | ఇతడు నె192రు మహావీర్యునికొమారుడు |
| 196 త్రయ్యారుణి. | యీ ముగ్గురు బ్రాహ్మణులైచనిరి. |
| 197 కవి. | |
| 198 పుష్కరారుణి. | యీ ముగ్గురు నె195రు కుమాళ్ళు. |
| 199 సుహోత్రుడు. | ఇతడు నె190రు బృహత్క్షత్రి కొడుకు. |
| హస్తి. | ఇతనిపేరట హస్తినాపురి నిర్మింపంబనది దీనికి ఢిల్లీయని యిప్పుడు నామాంతరంబు గలదు. |
| 200 అజమీఢుడు. | ఇతనికి నళినియందు ప్రియమేధాదులుబుట్టి బ్రాహ్మణులయిరి. యీ ముగ్గురు |
| 201 ద్విమీఢుడు. | హస్తి కుమాళ్ళు. వీనికి సంతతిలేదు. |
| 202 పురుమీఢుడు. | |
| 203 యవీనరుడు. | ఇతను నె201రు ద్విమీఢునికొడుకు. |
| 204 కృతిమంతుడు. | |
| 205 సత్యధృతి. | |
| 206 దృఢనేమి. | |
| 107 సుపార్శ్వకృతుడు. | |

208 పార్శ్వకుడు.
209 సుమతి.
210 సన్నమంతుడు.
211 కృతి. ఇతడు హిరణ్యనాభునివలన యోగమార్గంబెరింగి పూర్వదేశంబున సామసంహిత పఠించె.
212 సుగ్రాయుధుడు.
213 క్షేమ్యుడు.
214 సువీరుడు.
215 పురంజయుడు.
216 బహురథుడు.
217 సుహోత్రుడు.
218 సుతహోత్రు.
219 గయుడు.
220 కపిలుడు.

యీ నలుగురు (188) రు భరద్వాజుని కొడుకులు.

221 ఋక్షుడు.
222 నీలుడు.
223 బృహజిష్ణుడు.

యీ ముగ్గురు (200) నజమీఢునికొడుకులు.

224 బృహద్ధనుడు. ఇతడు నె 223 రు బృహజిష్ణుని కొడుకు.
225 బృహత్కాయుడు.
226 జయద్రథుడు.
227 విశ్వజిత్తు.
228 సేనజిత్తు.
229 వత్స్యుడు.
230 కాశ్యుడు.
231 దృఢహనువు.
232 రుచిరాశ్వుడు.

యీ నలుగురు నె 228 రు సేనజిత్తుని కొడుకులు.

233 ప్రాజ్ఞుడు. ఇతడు నె 232 రు. రుచిరాశ్వునికొడుకు.

234 ప్రథసేనుడు.

235 పారుడు.

236 నీపుడు. ఇతనికి శుకునికూతురు సుందరివలన 100, కొడుకులు పుట్టిరి.

237 బ్రహ్మదత్తుడు. రాజ్యపాలకుడు.

238 విష్వక్సేనుడు.

239 ఉదక్సేనుడు.

240 భల్లాటుడు. ఇతని వంశమువారు బార్హదిషవులను రాజులైరి.

241 శాంతి. ఇతడు నె 222 రు నీలునికొడుకు నజమీఢుని మనుమడు.

242 సుశాంతి.

243 పురుజుడు.

244 అర్కుడు.

245 భర్మ్యాశ్వుడు.

246 సృంజయుడు.

247 ముద్గలుడు.

248 వీనరుడు.

249 బృహదిషుడు.

250 కాంపిల్యుడు.

వీరలు నె 245 రు భర్మ్యాశ్వునికొడుకులు. ముద్గలునివలన బ్రాహ్మణకులంబున బుట్టి ముద్గలగోత్రంబున నెగడె.

251 దివోదాసుడు. ఇతడు నె 247 రు ముద్గలుని కొడుకు.

252 మిత్రాయువు.

253 చ్యవనుడు.

254 సుదాసుడు.

255 సహాదేవుడు.

256 సోమకుడు.

257 జన్మక్రృతు. — ఇతనికి నూర్వురు కొడుకులు.

258 జంతువు. — ఇతడు నె257రు జన్మకృతునకు జ్యేష్టుడు

259 వృషదుడు. — ఇతడు డిటో కనిష్టుడు.

260 ద్రుపదుడు. — ఇతడు నె259రు వృషదుని కొడుకు యిరకా కుమాళ్ళు గలరు.

261 ద్రుష్టద్యుమ్నుడు. — నె260రు ద్రుపదునికొడుకు.

262 ద్రౌపది. — పాండవుల భార్య.

263 దృష్టకేతుడు. — ఇతడు నె 261రు దుృష్టద్యుమ్నుని కొడుకు పాంచాలరాజులని యెరుగవలెను.

264 అహాల్య. — యీమె (247) రు ముద్గలుని కూతురు. యీమెను గౌతముడు పెండ్లియాడె.

265 శతానందుడు.

266 సత్యధృతి.

267 కృపి.

268 కృపుడు. — వీరలనిద్దరిని శంతనుడుపెంచి కృపిని ద్రోణాచార్యునకు భార్యగానిచ్చెను.

269 సంవరణుడు. — ఇతను నె221రు ఋక్షునికొడుకు నజమీఢుని మనుమడు. యితనిభార్య తపతియను సూర్యునికూతురు.

270 కురువు. — ఇతను నె269రు కొడుకు తనపేర కురుక్షేత్రంబు నిల్పె రాజ్యపాలనుడు కౌరవుల వంశకర్త.

271 సుధనస్సు.
272 పరిక్షిత్తు.
273 జహ్నువు.
274 నిషధుడు. } యీనలుగురు నె 270 రు కొడుకులు.

275 సుహోత్రుడు. ఇతను నె 271 రు సుధనస్సుకొడుకు.

276 చ్యవనుడు.

277 కృతి.

278 వసువు.

279 బృహద్రధుడు.
270 కుసుంభుడు.
281 మత్స్యుడు.
282 ప్రత్యగ్రుడు.
283 చేదిషుడు. } వీరుఅయిదుగురు 278 వసువు కొడుకులు

284 జరాసంధుడు. ఇతను నె 279 రు కొడుకు మరియొకడుగ లడు మగధ దేశాధీశుడు.

285 సహదేవుడు.

286 సోమాపి.
287 మార్జాలి. } వీరిరువురు నె 285 రు సహదేవుని కొడుకులు.

288 శ్రుతశ్రవుడు. యితను నె 286 రు కొడుకు.

289 శ్రుతశ్రవస్సు. యితను నె 287 రు కొడుకు.

290 నయుతాయువు.

291 నిరమిత్రుడు.

292 సునక్షత్రుడు.

293 బృహత్సేనుడు.

294 కర్మజిత్తు.

ధృతరాష్ట్రుడు కనెను. యీదుశ్శల సైంధవునిభార్య.

| | |
|---|---|
| 337 ధర్మరాజు.<br>338 భీముడు.<br>339 అర్జునుడు.<br>340 నకులుడు.<br>341 సహదేవుడు. | వీరిఅయిదుగురిని కుంతీమాద్రులయందు నె 333 రు పాండురాజు ధర్మసంతతి వడసె. |
| 342 దేవకుడు.<br>343 ప్రతివింద్యుడు. | నె 337 రు ధర్మరాజుకుమాళ్ళు. |
| 344 సర్వాంగదుడు.<br>345 ఘటోత్కచుడు.<br>346 కృపసేనుడు. | వీరు ముగ్గురు నె 338 రు భీముని కుమాళ్ళు. |
| 347 అభిమన్యుడు.<br>348 బభ్రువాహనుడు.<br>349 నిశావంత్తుడు.<br>350 శృతకీర్తి. | వీరు నలువురు నె 339 రు అర్జునుని కుమాళ్ళు. |
| 351 నిరమిత్రుడు.<br>352 శదానీకుడు. | వీరు నె 340 రు నకులుని కుమాళ్ళు. |
| 353 సుహోత్రుడు.<br>354 శ్రుతకర్ముడు. | వీరిద్దరు నె 341 రు సహదేవుని కుమాళ్ళు. |
| 355 సహస్రజిత్తు.<br>356 క్రోష్టు.<br>357 నలుడు.<br>358 రిపుడు. | యీనలుగురు (75) రు యదుమహారాజు కుమాళ్లు. |

359 మహాహాయుడు. } యీముగ్గురు నె 355 రు సహస్రజిత్తు కొడుకులు.
360 వేణుహాయుడు.
361 హేహాయుడు.

362 ధర్ముడు. ఇతడు హేహాయుని పుత్రుడు.

363 నేత్రుడు.

364 కుంతి.

365 మహిష్మంతుడు.

366 భద్రసేనుడు.

367 దుర్మదుడు.

368 ధనికుడు.

369 కృతవీర్యుడు. } యీనలుగురు నె368రు ధనికునికుమాళ్ళు.
370 కృతాగ్ని.
371 కృతకర్మ.
372 కృతౌజస్సు.

373 కార్తవీర్యార్జునుడు. ఇతడు నె369రు కొడుకు రాజ్యపాలకుడు.

374 జయధ్వజుడు. } యీయేవురు కార్తవీర్యార్జునుని పుత్రులు.
375 సూరసేనుడు.
376 వృషణుడు.
377 మధువు.
378 పూరితుడు.

379 తాళజంఘుడు. ఇతడు నె 374 రు జయధ్వజుని కొడుకు. ఇతనికి వీతిహోత్రుడు మొదలుగాగల 99 కొడుకులు గలరు.

380 వృష్ణుడు. ఇతడు నె 377 రు మధువుకొడుకు ఇతనికి 100 కొడుకులు. వారిలోజ్యేష్ఠ

381 వృష్టి. డు వృష్టి యితనిపేర వంశంబు వృద్ధిబొంది వృష్ణులు యాదవులనంబరిగిరి.

382 వృజనవంతుడు. ఇతడు యదువుమనుమడు (356) క్రోష్టువు కుమారుడు.

383 స్వాహితుడు.

384 జేగసిసేకుడు.

385 చిత్రరతుడు.

386 శశిబిందుడు. ఇతడు సప్తద్వీపములు యేలినవాడు. ఇతనికి చాలాసంతతిగలదు. ముఖ్యులు ఆగ్గరు అందులో జ్యేష్టుడు.

387 పృథుశ్రవుడు. యితడు.

388 ధర్ముడు.

389 యుశనస్సు. ఇతడు రాష్ట్రమేలినవాడు.

390 రుచికుడు.

391 పురుజిత్తు.
392 రుక్ముడు.
393 రుక్మేషువు.
394 పృథువు.
395 జానుజంఘుడు.
యీ యేవురు నె 390 రుచికుని కొడుకులు.
395 ఇతనిభార్య శైబ్య.

396 విదర్భుడు.

397 కుశుడు.
398 కృథుడు.
399 రోమపాదుడు.
యీ ముగ్గురు నె 396 రు విదర్భుని కొడుకులు.

400 బభ్రువు. యితను నె 399 రు కొడుకు.

401 విభువు.

402 శృతి.

403 ఉశికుడు.

404 చేదుడు. ఇతనికి చైద్యాదులుపుట్టి రాష్ట్రపాలకులైరి.

405

406 కుంతి. ఇతడు నె 398 ణు క్రథునికొడుకు.

407 దృష్టి.

408 నిర్వృతి.

409 దశార్హుడు.

410 వ్యోముడు.

411 జీమూతుడు.

412 నికృతి.

413 భీమరథుడు.

414 నవరథుడు.

415 దశరథుడు.

416 శకుని.

417 కుంత్రి.

418 దేవరాతుడు.

419 దేవక్షత్రుడు.

420 మధువు.

421 కురువశుడు.

422 అనువు.

423 పురుహోత్రుడు.

424 సంశుడు.

425 సాత్వతుడు.

| | |
|---|---|
| 426 భజమానుడు. | ఇతనికి యిద్దరుభార్యలు. |
| 427 భజయుడు. | |
| 428 దివ్యుడు. | నె 425 రు సాత్యతుడు. యీక్రింద గనుపరచినవారు యితనికుమాళ్ళు. |
| 429 వృష్ణి. | |
| 430 దేవావృధుడు. | యితడు యోగపురుషుడై బహుమందికి బ్రహ్మోపదేశమొనర్చి మోక్షమును బొందెను. |
| 431 మహాభోజుడు. | ఇతనిపేర వంశంబువర్ధిల్లి భోజులనంబంగిరి. |
| 432 అంధకుడు. | ఇతనివంశస్థులను అంధకు లనియెదరు. భజమానుడు మొదలు 7 సాత్వతుని కొడుకులు. |
| 433 బభ్రుడు. | ఇతను నె 430 రు కొడుకు బ్రహ్మోపదేశకర్తయై బహుమందిని మోక్షముజెందించెను. |
| 434 నిమ్రోచి. | యీయార్వురు (426) భజమానుని కొడుకులు. |
| 435 కంకణ. | |
| 436 శతజిత్తు. | |
| 437 సహస్రజిత్తు. | |
| 438 అయుతజిత్తు. | |
| 439 వృష్టి. | |
| 440 సుమిత్రుడు. | వీరిరువురు నె 439 రు వృష్టి కుమాళ్ళు. |
| 441 యుధాజిత్తు. | |
| 442 శిని. | వీరిరువురు నె 441 రు యుధాజిత్తుని కుమాళ్ళు. |
| 443 అనమిత్రుడు. | |

444 నిమ్నుడు.
445 శిని.
446 బృశ్ని.

ఈ మువ్వురు నె 443 రు అనమిత్రుని కుమాళ్ళు.

447 సత్రాజిత్తు.
448 ప్రసేనుడు.

వీరిద్దరు నె 444 రు నిమ్నుని కొడుకులు వీరిలో సత్రాజిత్తు సూర్యునిమెప్పించి స్యమంతకమణినిగొని తత్కారణమున తన కూతురగు సత్యభామను శ్రీకృష్ణునకు యిచ్చె.

449 సత్యకుడు.

ఇతడు నె445రు శినియనువానిపుత్రుడు

450 సాత్యకి.

ఇతనికి యయుధానుడను వేరొక పేరు గలదు.

451 జయుడు.
452 గుణి.
453 యుగంధరుడు.

వీరిరువురు నె 446 రు బృశ్నికొడుకులు.

454 శ్వఫల్కుడు.
455 చిత్రుతుడు.

యితనిభార్య గాందిని.
యీచిత్రుడనువానికి బహుమంది కొడుకులుకలిగి వృష్టివంశ్యులయిరి.

456 పృధుడు.
457 విదూరథుడు.

వీరిరువురును మరికొందరును నె 455 రు కుమాళ్ళు. వీరువృష్టివంశ జాతులైరి.

458 అక్రూరుడు.
459 అసంగుడు.
460 సారమేయుడు.
461 మృదుకుడు.
462 మృదుపచ్ఛివుడు

అక్రూరుడు ఆదిపదమువ్వరు (454) శ్వఫల్కుని కుమాళ్లు. యీఅక్రూరుడె కంసునిపంపున శ్రీకృష్టునికై వ్రేపల్లెకు వెళ్ళినవాడు.

463 వర్మదృక్కు.
464 దృష్టవర్ముడు.
465 క్షత్రోపేకుడు.
466 అరిమర్దనుడు.
467 శతఘ్నుడు.
468 సుంగంధమాదుడు.
469 ప్రతిబాహుడు.
470 సుచారువు.

471 భజమానుడు.
472 కుకురుడు.
473 శుచి.
474 కంబళబర్హిషుడు.

ఈ నల్వురు సాత్వతునికొడుకగు (432) అంధకుని పుత్రులు.

475 విదూరథుడు. — యితను నె471రు భజమానుని కొ...

476 శూరుడు.
477 శిని.
478 భోజుడు.

479 కృతవర్మ.
480 శతధన్వుడు.
481 హాదికుడు.

యీమువ్వురు నె478రుభోజునికొడుకులు

482 వృష్ణి౨. — ఇతడు నె 472 రు కుకురుని కొడుకు.

483 విలోమతనయుడు.
484 దేవమీఢుడు.
485 విధాజిత్తు.
486 మిత్రవర్ధనుడు.
487 సుమిత్రుడు.

యీ అయిదుగురు నె 482 రు [illegible] కొడుకులు.

488 కపోతలోముడు. ఇతడు నె 483 రు విలోమతనయుడుకు.

489 అనువు. ఇతడు తుం?

490 దుందుభి.

491 రవిజ్యోతుడు.

492 పునర్వసు.

493 ఆహుకుడు. } వీరిద్దరు నె 492 రు పునర్వసునికొడుకు కూతురు.
494 అహకియను స్త్రీ.

495 దేవకుడు. } నె 493 రు ఆహుకుని కొడుకులు.
496 ఉగ్రసేనుడు.

497 దేవలుడు. నె 495 రు దేవకునకు నలువురుకుమరులు యేడుగురు

498 ఉపదేవుడు.

499 సుదేవుడు.

500 దేవవర్ధనుడు.

501 ధృతదేవ, స్త్రీ.

502 శాంతదేవ, స్త్రీ.

503 పదేవ, స్త్రీ.

504 శ్రీదేవ, స్త్రీ.

505 దేవరక్షిత, స్త్రీ. యీ యేడుగురు స్త్రీలను శూరుని

506 సహదేవ, స్త్రీ. కొమారుడగు వసుదేవుడు పెండ్లియాడె.

507 దేవకి, స్త్రీ.

508 ఉగ్రసేనుడు. ఇతడు నె 493 రు ఆహుకుని కొడుకు.

యితడు రాష్ట్రపాలుడు

509 కంసుడు.
510 న్యగ్రోధుడు.
511 సునామునముడు.
512 గవ్యాడు.
513 శంకుడు.
514 సుభువు.
515 రాష్ట్రపాలుడు.
516 విశుష్టుడు.
517 తుష్టిమంతుడు.
518 కంస, స్త్రీ.
519 కంసవతి, స్త్రీ.
520 సురభి. స్త్రీ.
521 రాష్ట్రపాలిక, స్త్రీ.

యీ పదముప్పదరు స్త్రీపురుషులు నెం 508 రు ఉగ్రసేనుని సంతతి. యీ కంసాదులు శ్రీకృష్ణునకు మేనమామలు.

522 శూరుడు లేక శూ.
523 రసేనుడు.

ఇతడు అంధకుని మునిమనుమడగు నెం 484 రు దేవమీఢుని కొడుకు.

524 వసుదేవుడు. — ఇతనిభార్య దేవకి.
525 దేవభాగుడు. — ఇతనిభార్య కంస.
526 దేవశ్రవుడు. — యితనిభార్య కంసవతి.
527 యూనకుడు. — ఇతనిభార్య సురభి.
528 శృంజయుడు. — ఇతనిభార్య రాష్ట్రపాలిక.
529 శ్యామనీకుడు.
530 కంకుడు.
531 నకుడు.
532 వత్సకుడు.
533 వృకుడు.
534 పృథ, స్త్రీ

నెం 524 రు లగాయతు నెం 538 రు వరకుగల స్త్రీపురుషులు నెం 522 రు శూరునికుమాళ్ళు కుమార్తెలు.

యీమెను కుంతి దత్తుయిచ్చినందున

549 బకుడు.
550 సత్యజిత్తు.
551 పురజిత్తు.

ఈముగ్గురు నె 530 రు కంకునికొడుకులు.

552 సుమిత్రుడు.
553 ఆనకుడు.
554 బాహుకుడు.

ఈముగ్గురు నె 531 రు శమునికొడుకులు.

555 వృకుడు. ఇతను (532) వత్సకునికొడుకు.

556 దక్షుడు.
557 పుల్కలుడు.
558 సాళ్వుడు.

ఈ ముగ్గురు నె 533 రు వృకునికొడుకులు.

559

560 ఇకను వసుదేవుని సంతతి చెప్పుచున్నాను.

561 వసుదేవునకు. రోహిణి, పౌరవి, మదిర, కౌసల్య, రోచన, ఇళ, సహదేవి, శాంత, దేవాత్మజ, ఉపదేవి, శ్రీదేవి, దేవరక్షిత, సహదేవ, దేవకీదేవి వీరు వసుదేవునిభార్యలు.

562 బలుడు లేక బల.
563 రాముడు.
564 గదుడు.
565 సారణుడు.
566 దుర్మదుడు.
567 విపులుడు.
568 ధృవుడు.
569 కృతుడు.

ఈయెనమండుగురు నె 561 రు వసుదేవునికి రోహిణియందు జనియించినవారు మరికొంతమంది గలరు.

570 సుభద్రుడు.
571 భద్రబాహుడు.
572 దుర్మదుడు.

ఈయైదుగురు వసుదేవునకు పౌరవియందు జనించినవారు మరికొందరు గలరు.

573 భద్రుడు.
భూతుడు.
574 దృవుడు.
575 నందుడు.
576 ఉపనందుడు.
577 శ్రుతకర్మితుడు.
578 శూరుడు.

ఈనగ్గురు మదిరయందు గలిగినవారు.

579 కేశి.

ఇతడు వసుదేవునందు కౌసల్యకు పుట్టినవాడు.

580 అస్త్రుడు. ఇతను రేచనకు బుట్టినవాడు మరికొందరు గలరు.

581 వల్కలుడు. ఇతడు శాంతకు పుట్టినవాడు.

582 ద్రిపృష్టుడు. ఇతడు ఉపదేవికి బుట్టినవాడు.

583 ప్రశ్రమ.
584 ప్రశ్రితుడు.

వీరిద్దరు శ్రీదేవికి బుట్టినవారు.

585 కల్పుడు.

ఇతడు దేవరక్షితకు బుట్టినవాడు. మరికొందరుగలరు.

586 గదుడు.
587 జహూఘుడు.
588 శ్రుతముఖ్యుడు.

వీరు సహదేవికి బుట్టినవారు. మరికొందరు గలరు.

589 కీర్తిమంతుడు.
590 సుసేనుడు.
591 భద్రసేనుడు.
592 ఋజువు.
593 భద్రుడు.

వీరలు దేవకీదేవియందు జనించినవారలు. ఈసుభద్రను పాండురాజకుమారుడు అర్జునునకు పెండ్లిచేయనైనది.

594 సమదనుడు.
595 సంకర్షణుడు.
596 శ్రీకృష్ణుడు.
597 సుభద్ర.

నె 562 లగాయతు నె 597రు వరకు నె561రు వసుదేవుని సంతానము. యీమె అర్జునుని భార్య.

598 ప్రద్యుమ్నుడు.
599 అనిరుద్ధుడు.
600 దీప్తిమద్భానుడు.
601 సాంబుడు.
602 మిత్రుడు.
603 బృహద్భానుడు.
604 మిత్రవిందుడు.
605 వృకృడు.
606 అరుణుడు.
607 పుష్కరుడు.
608 దేవబాహుడు.
609 శ్రుతదేవుడు.
610 సునందనుడు.
611 చిత్రభానుడు.
612 వరూధుడు.
613 కవి.
614 న్యగ్రోధుడు.

వీరలు శ్రీకృష్ణుని భార్యాష్టకమందు జనించినముఖ్యులు వీరుగాక పదహారువేల గోపికలయందు అష్టభార్యలయందును లెక్కింపరాని పుత్రులు జనియించిరి. ఇందున గురించి భాగవతమందు దశమస్కంధోత్తర భాగమందు (మధుసూదనందనులు బహుప్రజలు నధికాయురోన్నతులు ననల్పవీర్యవంతులు బ్రాహ్మణ్యులునై విఖ్యాతి బొందిరి. వారిని లెక్కింప పదివేల వత్సరంబులకైనం దీరదు. తత్కుమారులకు విద్యావిశేషంబుల నియమించు గురుజనంబులసంఖ్య మూడుకోట్ల యెనుబదియెనిమిదివేల నూర్గురట కలియుగంబందు నక్కుమారుల లెక్కింపయెవ్వరికి వశంబుగా దటియుంగా క) అనిచెప్పియున్నది.

615 ఉపశ్లోకుడు. ఇతడు త్రివక్రయనుదానికి శ్రీకృష్ణునియందు జనించినవాడు. జనకుండగు శ్రీకృష్ణదేవుని పాదారవింద సేవాభిరతుండగుచు నారదయోగీంద్రునకు శిష్యుండై యఖండజ్ఞాన

భావాత్మ్యంబగుచు స్త్రీ శూద్ర దాసీజనసం
స్కారంబై స్మరణమాత్రంబున ముక్తి సంభ
వించు నసాత్వతతంత్రంబను వైష్ణవస్మృతి గ
ల్పించె.

616 అనిరుద్ధుడు. ఇతడు శ్రీకృష్ణునికొడుకగు నె 598 రు ప్రద్యు
మ్నుని కొడుకు.

617 వజ్రుడు. ఇతడు నె 616 రు అనిరుద్ధుని పుత్రుడు శ్రీ
కృష్ణుని మనుమడు యితనినే కలియుగాది
యందు మధురకును ఇంద్రప్రస్థ పురంబునకు
సింహాసనస్థుజేసిరి.

ఇచ్చటికి కలియుగాంతమువరకు గలరాజులవివరము:—సరి.



## రెండవభాగం.

### కలియుగాది చంద్రవంశ క్షత్రియులు.

పరీక్షిన్మహారాజు. ఇతను శ్రీకృష్ణుని మేనల్లుడగు అభిమన్యునికు
మారుడు. హస్తినాపురి రాజధానిగా భూ
మండలము పాలించినవాడు ఇతడు శ్రీశుకుల
వారిచే శ్రీమద్భాగవతోపదేశమునొందె.

జనమేజయుడు.
శ్రుతసేనుడు.
భీమసేనుడు.
ఉగ్రసేనుడు.
} యీనలువురు పరీక్షిన్మహారాజు కుమా
ళ్లు.

శతానీకుడు. ఇతడు జనమేజయుని కుమారుడు.

సహసానీకుడు.
అశ్వమేధజుడు.
అశీమకృష్ణుడు.
నీచకుడు.
ఉష్ణుడు.
చిత్రరథుడు.
శుచిరథుడు.
వృష్టిమంతుడు.
సుషేణుడు.
సునీతుడు.
నృచక్షుస్సు.
సుఖానిలుడు.
పరిప్లావుడు.
మేధావి.
మనయుడు.
కృతజయుడు.
దూర్వసుడు.
నిమి.
బృహద్రథుడు.
సుధాంశుడు.
శతానీకుడు.
దుర్దమనుడు.
వహీనరుడు.
దండపాణి.
నిమితుడు.
క్షేమకుడు.

ఈయిరవై ఆర్వురు పరంపరా క్రమసంతతిగా నెఱుంగునది.

బ్రహ్మక్షత్రియుడు. ఇతడు దేవరుషి సత్కృతుండై కలియుగంబున జనగలవాడు.

వజ్రుడు.

ప్రతిబాహుడు. ఇతడు వజ్రుని కుమారుడు.

సుబాహుడు. ఇతడు ప్రతిబాహుని కొడుకు.

ఉగ్రసేనుడు. ఇతడు సుబాహుని కొడుకు.

శతసేనుడు. ఇతడు ఉగ్రసేనుని కుమారుడు. మరియు కృతవర్మ కొమారుడును సాత్యకి కుమారుడు మొదలయినవారు కలియుగంబున నిలచినారు. పెక్కు వంశములుగా నేర్పడిన శ్రీకృష్ణవంశతతియందు కొందరు ప్రముఖులు యదుకులక్షయంబునందు గలిగిననూ పెక్కుమంది వంశకర్తలయి యుండిరి.

పైన జెప్పబడిన చంద్రవంశక్షత్రియుల వివరమంతయును భాగవతము నవమస్కంధమునందు జూచుకొనేది.

శ్రీ కోశలింగం పంతులుగారిచేత రచింపబడిన ఆంధ్రకవులచరిత్ర ప్రథమభాగము 1-వ పేజీ మొదలుకొని 14-వ పేజీవరకు చెప్పబడిన విధిప్రకారం.

విజయాదిత్యుడు:—— ఇతడు భారతము కృతియందిన రాజరాజనరేంద్రుని పూర్వుడు. ఇతడయోధ్యా నగరమునుండి దక్షిణదేశమునకు దండెత్తి వచ్చి త్రిలోచన పల్లవునితో యుద్ధముజేసి కాలధర్మమునొందగా భర్తవెంటవచ్చిన యితనిభార్య గర్భవతియైయుండి ముడివేము అగ్రహారమునకు తప్పించుకొనిపోయి విష్ణుభట్ట సో[illegible]

యను తమపురోహితునిచే పుత్రికవలె నాదరింపబడి పుత్రునిగనిన విష్ణువర్ధనుడని పేరుబెట్టిన నతడువృద్ధియై తన తల్లివలన పూర్వవృత్తాంతము తెలుసుకొని చళుక్యపర్వతమున తపస్సుచేసి తనతండ్రిరాజ్యమును వహించి నర్మదమొదలుగా సేతుపరియంతము యేడుబదిలక్షలు గ్రామములుగల దేశమునంతయు పాలించె నప్పటినుంచి విష్ణువర్ధనుడను బిరుదునామము ఆవంశమువారికి పరంపరా నచ్చుచున్నది. యీచళుక్య వంశపురాజులు రెండుశాఖలవారై ఒకశాఖవారు కల్యాణపురమందును రెండవశాఖవారు రాజమహేంద్రవరమందును రాజ్యము జేయుచుండిరి. వీరిలో కల్యాణ రాజధానిగాగలవారు పడమటి చాళుక్యులు, కుంతలులు, రాజులనియు రాజమహేంద్రవరము రాజధానిగాగలవారు తూర్పుచాళుక్యులువేగిరాజులనియును వ్యవహరింపబడుచు వచ్చిరి. యీవిష్ణువర్ధనునికి జయసింహుడను బిరుదునామమున్నది. ఇతడు కాంచీపుర రాజధానిగాగల పల్లవరాజకుమార్తెను వివాహమాడెను. ఆమెవలన.

విజయాదిత్యుడు:— ఇతనికి రణరాగుడ బిరుదునామము గలదు.

పులికేశివల్లభుడు:— విజయాదిత్యుని కొడుకు.

కీర్తివర్మ పృథివీపతి, మంగళేశుడు:— వీరిరువురు పులికేశవల్లభుని కొడుకులు వీరిలో కీర్తివర్మ క్రీస్తుశకము. 567 సం॥ వరకు రాజ్యము చేసెను.

పులికేశివల్లభుడు, కుబ్జవర్ధనుడు:— వీరిరువురు కీర్తివర్మకొడుకులు. వీరిలో పులికేశవల్లభుడు తనపినతండ్రియైన మంగళేశునియనంతరము 610 సం॥ రాజ్యమునకు వచ్చెను. ఇతను మిగుల బలవంతుడై బ

హాలు దేశములు జయించి ఆకాలమందు పిష్టపురమనబడెడి పీఠికాపురమునందలి దుస్సాధ్యమయిన దుర్గమునుబట్టుకొనియెను. యనంతరమితని తమ్ముడగు కుబ్జవిష్ణు వర్ధనుడు 615 సం॥ చైత్ర శు 15 మందు రాజ్యమునకు వచ్చి క్రీ శ॥ 633 సం॥ వరకు రాజ్యమేలె. నితను తూర్పు చళుక్యపు రాజులకు మూలపురుషుడై పూర్వచాళుక్య రాజ్యస్థాపకుడయి వేగిదేశము బౌద్ధమతస్థులకు సాలంకాయన రాజులనుండి గైకొనబడుటచే యితనివలన్నె నీర్థాంధ్రదేశమునందు బౌద్ధమతమునకు క్షీణత్వమును బ్రాహ్మణమతమునకు ప్రాబల్యమును ప్రారంభమయ్యెను. యీచళుక్యరాజు శైవబ్రాహ్మణ మతస్థుడు మానవ్యగోత్రుడు శాలివాహనశకము 555 సం॥ శ్రావణశు 15 లు నాటికి సరియగు క్రీస్తుశకము 632 సం॥ జులయి 7 తేది చంద్రగ్రహణమున విష్ణుశర్మ, మాధవశర్మలను బ్రాహ్మణులకు దివిలిశీమలోని కలవకొండగ్రామము దానముచేశి శాశనము వ్రాశియిచ్చెను.

2 జయసింహుడు:— ఇతడు కుబ్జవిష్ణువర్ధనుని జ్యేష్టపుత్రుడు. క్రీ॥ శ॥ 633 సం॥ మొదలుకొని 663 సం॥ వరకు 30 సం॥ ములు రాజ్యముచేసెను. ఇతనికి సర్వసిద్ధియని బిరుదునామముగలదు.

ఇతడు గుడివాడతాలూకాలో పెణుపఱ్ఱుఅను గ్రామమొక బ్రాహ్మణునికి యిచ్చినట్టు దానశాశనమున్న దితని దేశము నెల్లూరి మండలమువరకు వ్యాపించియున్నది.

3 ఇంద్రభట్టారకుడు:— ఇతడు జయసింహుని ద్వితీయపుత్రుడు. ఇతనికి ఇంద్రరాజని బిరుదునామమున్నది. ఇంద్రరాజు 663 సంవత్సరము మొదలుకొని 7 రోజులుమాత్రం రాజ్యమేలి మృతుడయ్యె.

4 విష్ణువర్ధనుడు:— ఇతడింద్రభట్టారకుని కొడుకు. సర్వలోకాశ్రయుడనియును విషమసిద్ధియనియును బిరుదునామములు గల యితడు క్రీ॥ శ॥ 663 సం॥ మొదలుకొని 672 సం॥ వరకు రాజ్యమేలె. యితడు రెండవ విష్ణువర్ధనుడు. ఇతడుచేసిన యొక దాన శాశనమందు ఆత్మనోవిజయ రాజ్యపంచమె సంవత్సరే ఫాల్గుణ మాసె అమావాస్యాం సూర్యగ్రహణ నిమిత్త(ము) అనిశకవత్సర 560 సం॥ ఫాల్గుణ బ 15 లకు సరియగు క్రీ॥ శ॥ 668 సం॥ పిబ్రేవరు నెల 17 తేది యితనిరాజ్యములో నైదవయేడని చెప్పటచే యితనిరాజ్యము 663 సం॥ ఫాల్గుణ బహుళములో నారంభమైనట్లు తేలుచున్నది.

5 మంగీవరాజు:— ఇతడు రెండవ విష్ణువర్ధనుని పుత్రుడు. ఇతనికిన్నీ సర్వలోకాశ్రయుడనియు జయశిద్ధుడనియును బిరుదునామములుగలవు. ఇతడు క్రీ॥ శ॥ 672 మొదలుకొని 696 సం॥ వరకు 25 సంవత్సరములు రాజ్యమేలెను.

6 జయసింహుడు, 7 కొక్కిలిరాజు, 8 విష్ణువర్ధనుడు:— యీముగ్గురు మంగియువరాజు కొడుకులు. జయసింహుడుమాత్రము ప్రథమభార్యపుత్రుడు. యీజయసింహుడు 696 సం॥ మొదలుకొని 709 సం॥ వరకు 13 సం॥ లు రాజ్యమేలె. కొక్కిలిరాజు 709 సం॥ లో 9 నెలలుమాత్రం రాజ్యమేలె. విష్ణువర్ధనుడు జయసింహుని మరణాంతరము తనకు రావలసిన రాజ్య మక్రమముగా నాక్రమించుకున్న తమ్ముడగు కొక్కిలిరాజును సింహాసన విహీనునిచేసి 709 సం॥ మొదలుకొని క్రీ॥ శ॥ 746 సం॥ వరకు 30 సంవత్సరములు దేశమేలెను.

ఇతను 3 వ విష్ణువర్ధనుడు.

9 విజయాదిత్యుడు:— ఇతడు మూడవ విష్ణువర్ధనునికొడుకు విక్రమరాముడనియుం విజయసిద్ధుడనియుం బిరుదనామములు గలవాడు ఇతడు క్రీ॥ శ॥ 749 సం॥ మొదలుకొని 764 సం॥ వరకు 15 సం॥ భూపాలనము చేసెను. ఇతడు విజయాదిత్య నామము గలవారిలో మొదటివాడు.

10 విష్ణువర్ధనుడు:— ఇతను విజయాదిత్యుని కుమారుడు. 764 సం॥ మొదలుకొని 799 సం॥ వరకు 36 సం॥ వరకు రాజ్యభారము వహించెను. ఇతడు నాలవ విష్ణువర్ధనుడు.

11 విజయాదిత్యుడు:— ఇతడు విష్ణువర్ధనునికొడుకు మొదటి విజయాదిత్యుని మనుమడగు యీరెండవ విజయాదిత్యునకు నరేంద్ర మృగరాజనియుం సమస్త భువనాశ్రయుండని బిరుదునామములు వహించి 799 సం॥ మొదలుకొని 843 సం॥ వరకు 44 సంవత్సరములు రాజ్యమేలెను. ఇతడు గాంగులతోను రాష్ట్రకూటులతో బహు యుద్ధములుచేసి వారినిజయించి తనరాష్ట్రమందు నూటయెనిమిది శివాలయములు కట్టించెను.

12 విష్ణువర్ధనుడు:— ఇతడు విజయాదిత్యుని కొడుకు యైదవ విష్ణువర్ధనుడు సర్వలోకాశ్రయుడనియు విషమసిద్ధియనియు బిరుదాంకములువహించి క్రీ॥ శ॥ 843 సం॥ మొదలుకొని 844 సం॥ వరకు 18 నెలలు రాజ్యమేలెను.

13 గణక విజయాదిత్యుడు, విక్రమాదిత్యుడు, యుద్ధమల్లుడు:— యీముగ్గురు విష్ణువర్ధనుని కొడుకులు వీరిలో విజయాదిత్యుడు గణి

తశాస్త్రమునందు పండితుఁడగుటచేత గణక విజయాదిత్యుఁడని యం
దురు. ఇతఁడు రాష్ట్రకూటులజయించి మంగిరాజు శిరస్సుఖండించి
క్రీ॥ శ॥ 844 సంవత్సరము మొదలుకొని 888 సం॥ వరకు 44 సం॥ వ
రకు ప్రజాపాలనము చేసెను. యీతనికి యువరాజు విక్రమాదిత్యు
డనియు యుద్ధమల్లుఁడనియు యిద్దరుతమ్ములుగలరు.

14 చాళుక్యభీముఁడు:— ఇతఁడు యువరాజ విక్రమాదిత్యునికు
మారుఁడు ఇతఁడు తనపెదతండ్రియైన విజయాదిత్యుని పిమ్మట రాజ్య
మునకు వచ్చి రాష్ట్రకూటరాజయిన కెండవకృష్ణు నిజయించి యావ
రకన్యాక్రాంతమయిన వేగిదేశముయొక్క భాగమును మరల నాక్ర
మించుకొని 888 సం॥ మొదలుకొని 918 సంవత్సరములవరకు 30
సం॥ రాజ్యమేలెను.

15 విజయాదిత్యుఁడు, విక్రమాదిత్యుఁడు:— వీరిరువురు చాళు
క్యభీముని కొడుకులు వీరిలో జ్యేష్ఠుఁడగు యీనాలవ విజయాదిత్యు
డు కళింగులనుజయించి 918 సం॥ మొదలుకొని 6 మాసములు రా
జ్యమేలి దేశవియోగమును పొందెను.

16 అమ్మరాజ విష్ణువర్ధనుఁడు, చాళుక్యభీముఁడు:— వీరిరువు
రు నాలవ విజయాదిత్యుని కుమారులు వీరిలోజ్యేష్ఠుఁడగు అమ్మరా
జ విష్ణువర్ధనుఁడు రాజమహేంద్రుఁడన్న బిరుదునామము గలవాఁడు.
ఇతనికాలములోనే రాజధాని రాజమహేంద్రవరమునకు మార్చబడె
ననియు యీతనిపేరనే యీపట్టణమునకు పేరుకలిగినదనియు చెప్పె
దరు. ఆరవ విష్ణువర్ధనుఁడు యీఅమ్మరాజు 918 సం॥ మొదలు
కొని 925 సం॥ వరకు 7 సం॥ భూపాలన మాచరించెను.

17 విజయాదిత్యుడు, భీముడు, దానార్ణవుడు, అమ్మ విజయాదిత్యుడు:— యీ అయిదవ విజయాదిత్యునికి బేటరాజని నామాంతరముగలదు యితడమ్మరాజుయొక్క జ్యేష్ఠపుత్రుడు, 925 సం॥ 15 దినములు రాజ్యముచేశి యితనిని యుద్ధమల్లునికొడుకైన తాళ్ళరాజు రాజ్యపదభ్రష్టునిజేశి చెరసాలయందుబెట్టి రాజ్యమునాక్రమించుకొనియెను.

18 తాళరాజు:— ఇతను యుద్ధమల్లునికొడుకైన ఈతాళ్ళరాజు రాజ్యమాక్రమించుకొని 925 సం॥ రములో నెలదినములు రాజ్యపాలనముచేశి తర్వాత చాళుక్యభీముని ద్వితీయపుత్రుడను నాలవ విజయాదిత్యుని యనుజుడైన విక్రమాదిత్యుడితనినిజంపి రాజ్యమునాక్రమించుకొనెను.

19 విక్రమాదిత్యుడు:— ఇతడు చాళుక్యభీముని కొడుకైన యీ రెండవ విక్రమాదిత్యుడు వేగిత్రికళింగదేశములను 925-26 సం॥ లో 11 మాసములు పాలించిన తర్వాత అమ్మరాజ విష్ణువర్ధనుని కొడుకగుభీము డితనిని సింహాసన పీఠానునిజేసి రాజ్యముగొనెను.

20 భీముడు:— ఇతడు అమ్మరాజ విష్ణువర్ధనునికొడుకును అయిదవ విజయాదిత్యుని తమ్ముడునైన యీమూడవ భీముడు విక్రమాదిత్యుని జయించి 926-27 సం॥ లో 8 మాసములు రాజ్యము చేశినతర్వాత తాళ్ళరాజు కొడుకైన యుద్ధమల్లు డితనినిజంపి రాజ్యముచేకొనెను.

21 యుద్ధమల్లుడు:— ఇతడు తాళ్ళరాజుకొడుకు రెండవ యుద్ధమల్లుడు ఇతడు 927 సం॥ మొదలుకొని 934 సం॥వరకు 7 సంవత్సరములు రాజ్యము చేసెను.

తర్వాత నాలవవిజయాదిత్యుని ద్వితీయ పుత్రుడైన చాళుక్య భీమునిచే జయింపఁ రాజ్యపదభ్రష్టుడయ్యె.

22 చాళుక్యభీమవిష్ణువర్ధనుడు:—— ఇతడు రెండవ చాళుక్య భీముడు 7 విష్ణువర్ధనుడైన యితడు నాలవవిజయాదిత్యుని రెండవ భార్యకొడుకు అమ్మరాజ్యవిష్ణువర్ధనుని చవితి తమ్ముడు. ఇతడు గండమహేంద్రుడు రాజమార్తాండుడు అను బిరుదులు గలవాడై చోళరాజయిన లోవభికేరి-రాష్ట్రకూట ప్రభువైన అయిదవ గోవింద రాజు మొదలయిన వారిని జయించి 934 సం॥ మొదలు 945 సం॥ వరకు పండ్రెండేండ్లు రాజ్యమేలె.

23 అమ్మరాజవిజయాదిత్యుడు:—— ఇతడుపై రెండవ చాళుక్యభీముని రెండవ కుమారుడు. ఇతడు శాలివా॥శ॥ 867 సం॥ మార్గశిర శు ౧3 శుక్రవారమునకు సరియగు క్రీస్తుశకము 945సం॥ డిశంబరు నెల 5 తేదీని పట్టాభిషిక్తుడైనట్లు చెప్పబడినది. ఇతడు రాజపరమేశ్వర త్రిభువనాంకుశాది బిరుదాంకములు గలవాడై క్రీ॥ శ॥ 945 సం॥ మొదలుకొని 970 సం॥ వరకు 25 సం॥ రాజ్యముపరి పాలించెను.

24 దానార్ణవుడు:—— ఇతడు రెండవ చాళుక్యభీముని జ్యేష్ఠ పుత్రుడు. అమ్మరాజ విజయాదిత్యుని చవితియన్న ఇతడు 970 సం॥ మొదలుకొని 973 సం॥ వరకు 3 సం॥ రాజ్యముచేసెను ఒకశాసనములో నితడు 30 సం॥ రాజ్యము చేసినట్లున్నదిగాని 973 సం॥ మొదలుకొని 1003 సం॥ వరకు 30 సం॥ దేశ మరాజకమైనట్లు తెలియ వచ్చుచున్నది యీకాలములో చోళులు యీదేశమునకు దండెత్తి వ

చ్చి గెల్చినట్లును కొంతకాలము వేగిదేశము పాలించినట్లును కనుబడుచున్నది.

25 శక్తివర్మ 26 విమలాదిత్యుడు:— వీరిరువురు దానార్ణవుని కొడుకులు వీరిలో శక్తివర్మకు చాళుక్యచంద్రుడన్న బిరుదుపేరుగలదు యితడు 1003 సం॥ మొదలుకొని 1015 సం॥ వరకు 12 సం॥ దొరతనముజేసెను దానార్ణవుని రెండవ కొడుకగు విమలాదిత్యుడు ఇతడు రాజేంద్రచోళుని చెల్లెలును గంగికుండై రాజరాజరాజ కేసరివర్మకూతురగు గుండమాంబాదేవి చోడరాజకన్యకను వివాహమాడి ఆమెవలన నాంధ్రభాష భారత కృతిపతియగు రాజనరేంద్రుని గనెను రాజనరేంద్రునిది మాతామహునిపేరు విమలాదిత్యుడు 1015 సం॥ మొదలు 1022 సం॥ వరకు 7 సం॥ ప్రభుత్వముజేసెను ఇతనికి విష్ణువర్ధనుడను నామమొకటియున్నది. ఇతను గోదావరిమండలములోని పెనుగొండలో నుండిన కుసుమశెట్టియను కోమటియొక్క కుమార్తెను కామించి తనకిమ్మనియడుగగా ఒప్పుకొననందున బలాత్కారముగా విష్ణువర్ధనుడు పట్టుకొనగా కుసుమశెట్టియును కూతురును 102 గోత్రముల యితరవైశ్యులును అగ్నిప్రవేశమైనట్లును వైశ్యులలో 100 కుటుంబములు పడమరకును 80 కుటుంబములు తూర్పునకు 200 కుటుంబములు దక్షిణమునకును 130 కుటుంబములు ఉత్తరమునకును పారిపోయినట్లును కన్యకాశాపమువలన విష్ణువర్ధనునికి శిరస్సు వ్రక్కలై చచ్చినట్లును, అంతట నతనిపుత్రుడైన రాజనరేంద్రుడు వైశ్యులను శాంతపరచి కుసుమశెట్టికొడుకయిన విరూపాక్షునికి 18 పట్టణములకు అధికారినిజేసి, మిగిలినకోమట్లను పెనుగొండ నుండునట్లుజేసెనని ఆంధ్రకవులచరిత్రము 144 పేజియందు చెప్పబడియున్నది

27 రాజరాజవిష్ణువర్ధనుడు:— ఇతడు ఆంధ్రభారత కృతిపతి విమలాదిత్యుని పుత్రుడైన రాజరాజనబడినవారిలో మొదటివాడు విష్ణువర్ధనులలో తొమ్మిదవవాడు (విష్ణువర్ధనుండు వంశవర్ధనుండు) అని ఆంధ్రభారతములో సహిత మీరాజనరేంద్రునకు విష్ణువర్ధన నామమున్నట్లు జెప్పబడియున్నది. ఇతడు తనమేనమామయగు రాజేంద్రచోళుని కూతురైన యమ్మంగదేవిని వివాహమాడెను. ఇతను శక సం॥ 944 సం॥ భాద్రపద బ ౨ గురువారము నుత్తరాభాద్ర నక్షత్రమున ననగా క్రిస్తుశకము 1022 సం॥ అగష్టునెల 16 తేదిన పట్టాభిషిక్తుడయ్యెను ఇతనితమ్ముడు విజయాదిత్యుడు కులోత్తుంగ చోళదేవుని కాలములో వేగిదేశమునకు పాలకుడుగానుండెను యీరాజనరేంద్రుడు 1022 సం॥ మొదలుకొని 1063సంవత్సరమువరకు 41 సం॥ రాజ్యపాలనముచేసె.

28 కులోత్తుంగ చోళదేవుడు:— ఇతడు రాజరాజనరేంద్రుని ప్రథమపుత్రుడు. ఇతడే రాజేంద్రచోడుడు ఇతని మొదటి పేరిదే నైనను యితడు వేగిదేశ రాజ్యభారము వహించినది మొదటి సం॥ లోనే చోడదేశముమీద దండెత్తి దానినిజయించి స్వాధీనపరచుకున్న తర్వాత కులోత్తుంగ చోళదేవుడనబడుచు వచ్చెను. ఇతనికి రాజనారాయణుడని బిరుదుపేరు గలదని కలికాలచోళుడనియు వాడుదువచ్చిరి. మూడుతరములనుండి చోళరాజుల కూతులను వివాహమాడుచు వచ్చుటచేత తమ తల్లులనుబట్టియు భార్యలనుబట్టియు చాళుక్యుల కంతకంతయు వేగిదేశమునకంటె చోళదేశమున నభిమానమెక్కువయగుచు వచ్చెను విమలాదిత్యుడు రాజరాజ కూతురైన కుందమాంబాదేవిని వివాహమాడి తనకుమారునకు రాజరాజను పేరుబెట్టెను.

రాజరాజు తనకు మేనమామయైన రాజేంద్రచోళుని కూతురైన అమ్మంగదేవిని పెండ్లియాడి తనపుత్రునకు రాజేంద్రచోడుడని నామకరణముచేసెను. తర్వాత రాజేంద్రచోడుని కూతురైన మధురాంతకదేవిని పరిణయముచేసుకొని చోడదేశముమీదనే అధికారముగలవాడై తానాదేశమును జయించినతోడనే తనరాజధానిని చోడదేశమునకు మార్చుకొని వేగిదేశమును పాలించుటకై పాలకులను నియమించి రాజ్యాధికారమును వారికివిడచిపెట్టెను. 1063 సం॥ నందు వేగిదేశమును పరిపాలించుటకై కులోత్తుంగ చోడదేవుడు తనపినతండ్రియైన విజయాదిత్యుని నియమింపగా అతడు 15 సంవ॥ లు రాజ్యపాలనముచేసి 1077 సం॥ లో చోడదేశమునకు పోయిచేరెను. తరువాతను 1077 సం॥లోనే వేగిదేశ పాలనమునకై తనరెండవ కుమారుడైన రాజరాజును బంపిన నతడక్కడ నుండనొల్లక మరుసటి సంవత్సరములోనే తల్లిదండ్రులవద్దకు లేచిరాగా 1078 సం॥ నందు శ్రావణమాసములో తనమూడవకొడుకైన వీరచోడదేవుని వేగిదేశపాలునిగా బంపెను. యీవీరచోడదేవుడు 9 వ విష్ణువర్ధనుడను బిరుదుపేరుతో 1100 సం॥ రము వరకు వేగిదేశాధిపతిగా యుండెను. కులోత్తుంగ చోడదేవునికి విక్రమచోడుడు రాజరాజు వీరచోడదేవుడు మొదలుగాగలవారు కొడుకులును రాజసుందరియను కూతురును గలిగిరి. యీరాజసుందరి కళింగరాజయిన రాజరాజునకు భార్యయయ్యెను. కులోత్తుంగ చోడదేవుడు 1063 సం॥ మొదలు 1112 సం॥ వరకు 49 సం॥ లు రాజ్యముచేసెను.

29 విక్రమచోడుడు:— ఇతడు కులోత్తుంగ చోడునకు బడెడు రాజేంద్రచోడుని జ్యేష్ఠకుమారుడు ఇతడును కొంతకాలము వేగిదేశపాలకుడుగానుండెను. యితనితండ్రియొక్క మరణాంతమున వేగిదేశమును విడచి చోళరాజ్యమును వహించుటకు బోయెనని యొక

శాసనమున్నది. ఇతడు 1112 సం॥ మొదలుకొని 1127 వరకు 15 సం॥ రాజ్యము చేసెను.

30 కులోత్తుంగ చోడదేవుడు:— యీ రెండవ కులోత్తుంగుడు విక్రమచోడుని కొడుకు యితను 1127 సం॥ రాజ్యమునకు వచ్చెను. ఇతడు చోళరాజ్యమును 1158 సంవ్స॥ వరకును రాజ్యముచేసెను. యితని కొడుకు రాజేంద్రచోడుడు పన్నెండవ శతాబ్దము వరకు రాజేంద్రచోడునికొడుకు రాజరాజచోడుడు 1232 సం॥ వరకును చోడరాజ్యము పాలించినట్టు కనుపడుచున్నది.. యీ రెండవ కులోత్తుంగ చోడదేవుని కాలములో వేగిదేశ మితరచాళుక్యులయధీనమయినట్టు స్పష్టముగా కనుబడుచున్నది. 1202 సం॥ మందు మల్ల విష్ణువర్ధనుడు వేగిదేశపు ప్రభువుగా నుండినట్లొక శాసనమున్నది. ఆశాసనమునందె యతనితండ్రి విజయాదిత్యుడు చిరకాలము వేగిదేశమును పాలించినట్లు చెప్పబడియున్నది. వీనినిబట్టి చూడగా రెండవకులోత్తుంగ చోడదేవుని కాలములోనే విజయాదిత్యుడు వేగిదేశ రాజ్యమువహించినట్టు తోచుచున్నది. యీవిజయాదిత్యుడు పైవివరింపబడిన 17 వ తూర్పుచాళుక్య రాజగు వేటవిజయాదిత్యునకారవ తరమువాడు వేటవిజయాదిత్యుని కొడుకు సత్యాశ్రయుడు సత్యాశ్రయునికొడుకు విజయాదిత్యుడు విజయాదిత్యునికొడుకు విష్ణువర్ధనుడు విష్ణువర్ధనునికొడుకు మల్లప్పదేవుడు మల్లప్పదేవునికొడుకు వేగిదేశపు ప్రభువైన విజయాదిత్యుడు 1228 సం॥ కృష్ణగోదావరి మధ్యమందున వేగిదేశమంతయు గణపతిరాజుల యధీనమైనది. కులోత్తుంగ చోడదేవుని కాలమునందుండియు చాళుక్యచోడులందరును తాము వేగిదేశమునువిడచి చోళుల బిరుదావళులు వహించి తాము చోళులుగానె పరిగణింపబడుచు వచ్చుటచేత వారినిగూర్చి యుందువివరించుట అనావశ్యకము. చాళుక్యులు చంద్రవంశపురాజులు, చోళులు సూర్యవంశపు రాజులు.

యీక్రింది వంశవృక్షము చాళుక్యులగు చంద్రవంశ క్షత్రియుల వృక్షము.

1 కుబ్జ విష్ణువర్ధనుడు (సం॥ 615--663)

2 జయసింహావల్లభ. (633--663) 3 యింద్రభట్టారకుడు. (663

4 విష్ణువర్ధనుడు (633--672)

5 మంగియువరాజు (672--696

6 జయసింహావ్వడు 8 విష్ణువర్ధనుడు [709-746] 7 కొక్కిలి [709]

9 విజయాదిత్యుడు (746--764)

10 విష్ణువర్ధనుడు 764--799)

11 విజయాదిత్యుడు. (799---843) నృపరుద్రుడు.

12 విష్ణువర్ధనుడు. (843---844)

13 గణక విజయాదిత్యుడు. (844--888) విక్రమాదిత్యుడు. యుద్ధమల్లుడు

14 చాళుక్యభీముడు (888–918)   తాళరాజు

21 యుద్ధమల్లుడు (927–934)

15 విజయాదిత్యుడు (918)   19 విక్రమాదిత్యుడు (925–926)

16 అమ్మరాజ విష్ణువర్ధనుడు (918–925)   22 చాళుక్యభీముడు (934–945)

17 బేటవిజయాదిత్యుడు (925)   20 భీముడు (926–927)   24 దానార్ణవుడు (970–973)   23 అమ్మవిజయాదిత్యుడు (945–970)

సత్యాశ్రయుడు

25 శక్తివర్మ (1003–1015)   26 విమలాదిత్యుడు (1015–1022)

విజయాదిత్యుడు

విష్ణువర్ధనుడు

27 రాజరాజు (1022–1063) విజయాదిత్యుడు

మల్లప్పదేవుడు   28 రాజేంద్రకులోత్తుంగచోడదేవుడు (1063–1112

విజయాదిత్యుడు

29 విక్రమచోడుడు   రాజరాజు   వీరచోడదేవుడు

మల్ల విష్ణువర్ధనుడు. (12౮2) (1112--1127)

30 కులోత్తుంగ చోడదేవుడు. (1127--1158)

31 రాజేంద్రచోడుడు. (1158--1200)

32 రాజచోడుడు. (1200--1235)

యీపైన చెప్పబడిన వంశము చంద్రవంశమై నందుకును పై వంశవృక్షము వారు పూరుని వంశజులైనందుకుదృష్టాంతము.

భారతము---ఆదిపర్వము.

కం॥ విమలాదిత్యతనూజుడు । విమలవిచారుడు కుమారవి ద్యాధరుడు । త్తమచాళుక్యుడు వివిధా । గమ విహితశ్రముడుతు హినకరుడురుకాంతిన్ ॥

చ॥ హిమకరుడొట్టిపూరు భరతేశకురుప్రభు పాండుభూప తుల్ । క్రమమున వంశకర్తలనగా మహిఁబొల్పిన యస్మదీయువం । శమున ప్రసిద్ధులయి విమలసద్గుణ శోభితులైన పాండవో । త్తముల చరిత్రనాకు సతతంబు వినంగ నభీష్టమెంతయున్ ॥

ఇట్లు భారతము కృతికోరి నన్నయభట్టునుగూర్చి రాజరాజనరేంద్రుడనగా పైవంశవృక్షమందు జూపిన (27) రు రాజరాజు పలికి నట్లు చెప్పియున్నది.

జైమినిభారతము కృతిగొన్న చంద్రవంశ క్షత్రియుడగు సాళువగుండ నృశింహ్వారాజు వంశవివరము.

గుండరాజు:---ఇతడు జై[illegible]తమును కృతిగొన్న నృశింహ్వరాజుయొక్క వంశమునకు మూలపురుషుడు. ఇతడు హూణా

శకము 1390 సం॥ మొదలుకొని 1397 సం॥ వరకు రాజ్యపరిపాలనముచేసినట్టు బళ్ళారి మండలచరిత్రమందు వ్రాయబడినట్టు ।ఆంధ్రీ॥ చ॥ ప్ర॥ 145 పేజీయందు కలదు.

వీరబొమ్మక రాజు, మాదయ్య, గుండబమ్మడు, సాళ్వమంగరాజు, సాళ్వతిమ్మంగరాజు:— యీయాఱుగురు గుండరాజుకుమాళ్లు వీరిలో సాళ్వమంగరాజు దక్షిణసురతానుని జయించి తెలుగురాయుని తండ్రియగు సాంపరాయునికిచ్చి సాంపరాయ స్థాపనాచార్య బిరుదువహించి శ్రీరంగనాధుని ప్రతిష్ఠించి 6000 మాడలాదేవునకు కృష్ణదిగానిచ్చి పరపక్షసాళువ బిరుదువహించెను.

జైమినిభారతము. శ్రీ దురములో దక్షిణ సురతానునోడించి కొనివచ్చి సాంపరాయునికినిచ్చె । సాంపరాజ్యమునునిల్పి సాంపరాయస్థాప నాచార్యబిరుదు విఖ్యాతిగాంచె । శ్రీరంగవిభు ప్రతిష్ఠించి యర్వదివేలమాడలర్థవృత్తి సమ్మతికొసగ । మధురాసురత్రాణు మడియించి పరపక్షి సాళువబిరుదంబు జగతినొప్పె । గబ్బితనమునదేజి మొగ్గలుగట్టి । శరిమినగరంపుగవనులు విరుగదోలి । తానువేసిన సారె సుద్ధవితెచ్చె । సాహసంబునసాళ్వంగు సాళ్వమంగు॥

సింగరాజు, గుండయారి, గౌతరాజు, సావడిరాజు, హనుమరాజు, చెల్లాపిల్లిరాజు:— వీరు ఆరుగురు సాళ్వమంగరాజు కుమాళ్లు

గుండరాజు, బొప్పరాజు, సాళ్వతిప్పరాజు, సాళ్వరాజు:— వీరు నలుగురు గౌతరాజుకొడుకులు వీరిలో గుండరాజు 1421 సం॥ మొదలుకొని 1428 సం॥ వరకు రాజ్యము చేసినట్టు అనగా బళ్ళారి మండలములోని యీ నాగొంది సంస్థానము పాలించుచుండినట్లు బళ్ళా

రివంశచరిత్ర సంగ్రహమువలన తెలుపబడి యున్నదనియు యిత
డు జైమినిభారతము కృతియందిన నారసింహ్వరాజు తండ్రియనియు
సు॥ అం॥ ప్ర॥ 145 పేజీ.

మరిన్ని హరిహరరాజు కడపటి దినములలో యితను మంత్రి
గాను దండనాధుడుగానుండి కొంతరాజ్యము సంపాదించెను. వీరి
లో మహాదవవాడగు సాళువతిప్పరాజు మీసరగండకటారి సాళ్వసం
చ ఘంటూని నాదాది బిరుదులుగలవాడు.

తిమ్మరాజు, నృసింహరాజు:— వీరిరువురు గుండరాజుకొడు
కులు. వీరిలో నృసింహరాజు దేవరాయలు సంతానములేక మృ
తుడౌటవలననో యేలాగో కర్నాటరాజ్యము నాక్రమించుకొనెను.
ను. మరిన్ని భోనగిరి దారాపురి పెనుగొండ మొదలయిన దుర్గ
ములుజయించి యేలినవాడు. యీయనతల్లి మల్లాంబ యీనృసిం
హరాజు అన్నయగు తిమ్మరాజు ఇతడు కృష్ణదేవరాయల తాతయగు
యీశ్వరరాజుతండ్రి ఇతడు పరమయోగి విలాసమును రచించినవా
డు. యీతిమ్మరాజు కుమారుడగు యీశ్వరరాజు పినతండ్రియగు
నరసింహ్వ నృపాలునివద్ద దండనాధుడుగా నుండెనని వరాహపురా
ణ పీఠికయందుకలదు. మరిన్ని యీనృసింహ్వరాజు అనంతరము
దాయాదిఅయినట్టియు సేనానాయకు డైనట్టియు ఈశ్వరరాజు యి
తని రాజ్యమును వహించె. యింమలో కొన్నిహంశములు ఆంధ్రి॥
చ॥ రెండవభాగం అనగా మధ్యకవుల భాగములో 7 పేజీ చూడు
కొనునది.

ఈ జైమినీభారతము కృతినందిన క్షత్రియులు చంద్రవంశజులును పాండవాదు సంతతివారైరెనందురు.

జైమినీ--భార- ఆశ్వ--ప్ర.

చ॥ ఉడుపతివంశకర్త మహిమోన్నతికెయ్యది మేరనాథుపా। లడఁజనించినప్పుడు దళంబుగనంట్టిన మేనిజిడ్డిబో। గడుగు కొనంగ నబ్బెనని కాశిపురాదల మేటపాదముల్। దడబడనోలలాడుచు హాళాహళిగావడి నీదులాడెడిన్ ॥

శా॥ ఆవంశంబున నుద్భవించె సమితత్క్ష్మాధీశ కోటీరకో। టీవిన్యస్త వినూత్నరత్నరుచి। నాటీసుస్ఫురత్పాద రా। జీవద్వందుడు గుండశౌరి జయలక్ష్మీ కంధరాబంధుర గ్రైవేయాంతర పద్మరాగసఖ దోఃఖడ్గ ప్రతాపాఢ్యుడై ॥

ఉ॥ భారతవంశమండనుడు పాండవుగాంచిన ముక్తిరాణసంభావరత ప్రభావనుతి। పారగుడంచిత గోవహీతులా। భారతదంగదాన పరిపాకసమగ్ర యశోవిలాసకో। భారతశౌల గుండనరపాల నృసింహుడు గర్వోన్నతిన్ ॥

స్వారోచిషమను చరిత్రకృతియందిన కృష్ణదేవరాయల వంశవివరణము.

తిమ్మరాజు:--- ఇతడు యయాతి మహారాజు కుమారుడగు తుర్వసుని వంశమునందు జనించిన వాడనియు ఇతనిదితులు వాస్తవమనియు మనుచరిత్ర ప్రథమాశ్వాసములో చెప్పియున్నది. ఇతని జైమినీభారతము కృతినందిన నృసింహరాజు అన్నయును యీనృ

సింహ్వారాజువద్ద మంత్రిగాను దండనాధుడుగా నుండిన యీశ్వరరాజతంత్రీ యితడే. పరవ యోగి విలాసమును రచించిన వాడు.

ఈశ్వరరాజు:— ఇతను తిమ్మరాజు కుమారుడు ఇతని భార్య బుక్కమ్మ. ఇతడు నృసింహరాజునొద్ద దండనాధుడుగా నుండి కొన్ని దేశములు జయించినట్లు వరాహపురాణమందు। సీ॥ ఉదయాద్రిభేదించె హుత్తనిర్జించె గండికోటపురంబు గదలద్రవ్వె। పెనుగొండ సాధించె బెంగులూరు హరించె గోవెలనెల్లూరు గుంటిపరచె। కుందాణి విదళించె గొడుగుచింత బాగోరుపంచము పాడు చేసె। నరుగొండ పెకలించె నాయూరు మర్దించె శ్రీరంగపురమును బారిసమరె। రాయచౌహత్తమల్ల ధరావరాహ। మోహనము రారి బర్బరబాహుసాళ్వ। నారసింహ ప్రతాపసన్నాహుడగుచు। విశ్వహితకారి తిమ్మయ యీశ్వరుండు॥ ఇట్లు వుదయగిరి మొదలయిన దుర్గములు సాధించినాడయు। ఆం॥ రెండ॥ బా॥ 1-2-3 పేజీలు చూచేది.

నృసింహదేవరాయలు, తిమ్మరాజు:— వీరిద్దరు యీశ్వరరాజుకొడుకులు వీరిలో నృసింహదేవరాయలు వరాహపురాణము గృతియందెను ఇతనినె సాళ్వనృసింహరాయలని కూడా చెప్పుదురు యితని రాజధాని బళ్లారి మండలములోని యానెగొందికి సమీపముననుతుంగభద్రాతీరమునందున్న విజయనగరము, విద్యానగరమనియును నామాంతరము కలదు. యితడు శాలివాహనశకము 1487 సం॥ మొదలు 1508 సం॥ వరకు రాజ్యమేలెను ఇందులో కొన్ని హంశములను॥ ఆం॥ రెం॥ బా॥ 5-6-7 పేజీలు చూచునదేది.

వీరనృసింహదేవరాయలు, కృష్ణదేవరాయలు:--- వీరిద్దరు నృసింహదేవరాయుల కుమాళ్లు వీరిలో వీరనృసింహదేవరాయలు 1487 సం॥ 1509 సం॥ వరకు విజయనగర సంస్థానాధిపతియై రాజ్యమేలె అనంతర మితనితమ్ముడగు కృష్ణదేవరాయలు 1509సం॥ మొదలుకొని 1530 సం॥ వరకు రాజ్యమేలె ఈకృష్ణదేవరాయలు వుదయగిరి దుర్గముకొండవీటిదుర్గముకొన దేశముకొట్టాములను దేశము కనకగిరి దుర్గము గోదావరి దేశము, పొట్నూరను పట్నము యీ మొదలయిన దుర్గములను జయించినట్లు చెప్పబడి యున్నది.

మను. ప్ర.

సీ॥ తొలుదొల్త నుదయాద్రి శిలదాకి తీండ్రించు నసిలోహ
మున వెచ్చనై జనించె । మరి కొండవీడెక్కి మార్కొని నలినైనయు
లక సవాపాత్రుఁ గంటిరాజె । నటసాగి జమ్మిలోయబడి వేగదహించె
గోనబిట్టేర్చె గొట్టాపదగిలె । కనకగిరి స్ఫూర్తిగరచె గౌతమిఁ గ్రాచె
నవుల నాపొట్నూరు రవులుకొనియె । మాడెములు వ్రేల్చెనుద్దా
డిమసి యొనర్చె గటకపురిగాల్చె గజరాజు గలగి పరవ । దోకచిచ్చు
ననాగయుధ్ధరత కృష్ణరాయ బాహుప్రతాప జాగ్రన్మహాగ్ని॥

పారిజాతపహరణము.

సీ॥ వుదయాద్రివేగ నత్యుద్ధతి సాధించె వినుకొండ మాట
మాత్రనపహరించె । కూటముల్ చెదరంగ కొండవీడెగలించె బెల్లము
కొండ యచ్చెల్లజరచె । వేలుపుకొండ నుద్వృత్తిభంగముజేసి జల్లి
పల్లెసమగ్ర శక్తిగూల్చె । గనుకమీరనంత గిరిక్రిందుబడజేసి కం
బంబుమెట్టు గ్రక్కునగదల్చె । బలిమిసియముకాలు మెట్టులనడంచు

కటకమును నింకననుచు నుత్కలమహీశు | డనుదినంమ్మును వెరచు నవ్వనికి నతఁడు రాజమాత్యుండె శ్రీకృష్ణరాయవిభుఁడు ॥

మనుచరి॥

చం॥ అభిరతి కృష్ణరాయుఁడు జయాంకములన్ లిఖయించి తాళస | న్నిభముగఁబొట్టు నూరికడనిల్పిన కంబముసింహాభూధర | ప్రభుతిరుసాళ్వకున్ దిగుసురప్రకరంబు కళింగ మేదినివిభు సపకీర్తి ఖజ్జలము లేమరుబెట్టు పతింత్రునిచ్చటన్ ॥ ఇతఁడు పొట్నూరివద్ద విజయ స్తంభము నిల్పినాఁడనియు గోల్కొండ ఓరగల్లు మొదలయిన సంస్థానములను జయించి దక్షిణహిందూస్థానమంతయు నేలెను. వడ్డెరాజులయిన గజపతులను తురుష్కరాజులయిన యాశ్వపతుల తెలుగు రాజులయిన నరపతులను జయించుటచేత మూరురాయర గండడని బిరుదుగలిగినది. మహారాజాధిరాజ పరమేశ్వర ఆదిరావిజయ భాషాగీత ప్రవర రాయరగండ యవనరాజ్య సంస్థాపనాచార్య వరప్రతాపాది బిరుదాంకములు గలవాఁడు. ఇతఁడు పారిజాతపహరణము స్వారోచిష మనుచరిత్రము మొదలయిన ప్రబంధములు కృతులందినవాఁడు. మదాలస చరిత్రము సత్యావధూప్రీణనము సకలకథాసారసంగ్రహము జ్ఞానచింతామణి రసమంజరి మొదయిన సంస్కృత గ్రంథములును యీకృష్ణదేవరాయలు రచియింపబడెను. ఆంధ్రమునందు ఆముక్తమాల్యదయును విష్ణుచిత్తీయమను నామాంతరముగల గ్రంథమొకటి రచియింపబడెను.

ఇతనిది తుళువవంశము ఇంటిపేరు సాళువవారు పూర్వులిది వరకు వచియించిన గ్రామనామములనుబట్టి సెంపెటవారనియు సాళు

గోలవారనియు గృహనామముగలదు. కళింగదేశాధిపతియైన ఓఢ్రదేశమును పాలింపుచున్న ప్రతాపరుద్రదేవుడు తనకుమార్తెయైన తిరుమలదేవిని రాజునకిచ్చి సంధిచేసుకొనెను. గనుక రాజమహేంద్రవరము వరకుగల కళింగదేశమును మరల ప్రతాప రుద్రదేవునకిచ్చె ఇతడు తుంగభద్రానదికి వంతెనగట్టించె. ఓడ్రగంటి ప్రతాపరుద్రుని సంతతివారిలో కడపటివాడైన వీరరుద్ర గజపతిని వింధ్యపర్వతప్రాంతములకు పాగదోలి అతనికుమార్తెయైన చిన్నాదేవిని గాంధర్వవివాహమాండె. కృష్ణదేవరాయల భార్యలు ఓబమ్మ, తిరుమలదేవి, చిన్నాదేవి.

అచ్యుత దేవరాయలు:— ఇతడు కృష్ణదేవరాయల అల్లుడు. కృష్ణదేవరాయల అనంతరము రాజ్యము పాలించెను.

యీకృష్ణదేవరాయలు దాసీపుత్రుడని కొందరు వాదుచుందురు. యీవాదుకకు కారణము ఇతను వైష్ణవమతమనం దత్యంతాభిమానియై శైవస్మార్తులను గౌరవింపక తాతాచార్యుల యిష్టముతో వర్తించి శైవస్మార్త మతములందు గంట్టినట్లుచేసిన కారణముచే మతద్వేషులు యీయనయందీ యపవాదమల్లి నిందించినట్లు తోచుచున్నది. అప్పయ్యదీక్షిత చారిత్రమె యిందుకు దృష్టాంతరము.

హరిహరరాయలు (1336--1350) బుక్కరాయలు (1350-1379) హరిహరరాయలు. (1379--1401) విజయబుక్కరాయలు. (1401--1418) పల్లబుక్కరాయలు. (1418--1434) గౌడదేవరాయలు. (1434--1454) రాజశేఖరరాయలు. (1454--1456) విజయభూపతి. (1455--1456) ప్రౌఢదేవరాయలు. (1456--1477)

వీరప్రతాపదేవరాయలు. (1477--1481) మల్లికార్జునరాయులు. (1481--1487) రామచంద్రరాయలు. (1487--1488) విరూపాక్ష రాయలు (1488--1490) నృసింహరాయలు. (1490--1495) నరస రాయలు. (1495--1504) వీరనృసింహరాయలు. (1504--1509) కృష్ణదేవరాయలు. (1509--1530)

యీపైన జెప్పబడు సంగతులను గురించి॥ ఆం॥ రెం॥ బా॥ 1 లగాయతు 29 పేజీ వరకు చూచునది. యీకృష్ణదేవరాయ ల వంశము చంద్రవంశ క్షత్రియులైనందుకు దృష్టాంతం మను ప్రథ మాశ్వాస॥

క॥ వానికి బుధూరవుడు బ । జ్ఞానిధి యుదయించె సింహాస దృశుడు తద్భా । జానికి నాయావు తనయుం । డైనెగడె నతండు గనె యయాతి నరేంద్రుజ్॥

క॥ అతనికి యదుదుర్వసులను సుతులుద్భవమొంది రహిత సూదనులు కళా । న్వితమతులు వారిలో ఎ । శ్రుతకీర్తి వహించె దుర్వసుడు గుణనిధియై॥

తే॥ గీ॥ వాని వంశంబు తుళువాన్వవాయమయ్యె । నందు దెకరాంద్రుడు నృపు లుదయంబునొంది । నిఖిల భువన ప్రపూర్ణని శీంద్రకీర్తి । నధికులైరి తదీయాన్వయమున బుట్టి॥

వసుచరిత్రము కృతిగొన్న చంద్రవంశ క్షత్రియుడగు తిరుమ లదేవరాయని వంశమును గురించి వసుచెరిత్ర ప్రకారము.

పిన్నరాజు, సోమదేవుడు, రాఘవరాజు, పిన్నశౌరి, బుక్క రాజు, రామరాజు:— పిన్నరాజు భరితవంశస్థుడు ఇతడు మొదలు

నరపతివిజయము.

గీ॥ సకలవిభు తిమ్మరాజు సేవలనుద్భవించి గుత్తి పెనుగొండ మరిగండికోట కంద। నూలుపురమాద వేనసలీలఁగెలచి। తొలుదొలుత రామనృపతి దోర్బలము మెరసి॥

చవ్వరాజు:---- ఇతడు కృష్ణదేవరాయని రెండవ యల్లుడు కృష్ణదేవరాయలు గాంధర్వ వివాహమందిన చిన్నాదేవి కుమార్తె పెనిమిటి.

కృష్ణరాజు, పెదతిమ్మరాజు:---- వీరిరువురు యీరామరాజు కొడుకులు నరపతివిజయమునం దిట్లు గలదు రామరాజు తదనంతరము కుమారుడైన కృష్ణరాజునకు రావలసిన విజయనగరపు సంస్థానపుహక్కు రామరాజు తమ్ములైన తిరుమలరాయుడు వెంకటపతిరాజును ఆక్రమించిరి యిందులో హంశములు కొన్ని ఆంధ్రకవుల చరిత్ర రెండవ భాగము 89 మొదలు 104 పేజీవరకు చూచుకునేది. యీపైన జెప్పిన వారు చంద్రవంశ క్షత్రియులనుటకు దృష్టాంతము.

వసు॥ ప్ర॥ ఆ॥

శా॥ ద్వీపపోగ్భవ సూక్తపంచమ మహావేదంబు దీపించెనే। పాలోత్తముపేర భారతియు నేవుణ్యాత్తు వంశస్థవం। బాపాదించి కృతార్థతాయ్యెనతడా। శాంతనుమాపాలన వ్యాపారాభి రతుండువొల్చు భరతుంపాత్రేయు గోత్రేయుడై॥

ఉ॥ ఆభరతాన్వయంబున రణాధ్వరియాపభుజుల్ మహాధరిత్రీభుజు లుద్భవించిరి యుధిష్ఠిర ముఖ్యులు విశ్రుతాఖ్యులు। ద్వీభ

రణ ప్రవీణులు వివేకధురీణులు దానదీక్షితాగ్రాహితులు సుధీయు లు దారదయాహృదయల్ శుభోదయుల్ ॥

కం॥ ఆసంతతి నై భవజిత । వాసవుడగు తాతపిన్న వసుధా దిపుడు । ద్భాసిల్లె గీర్తిమయము । త్రాసాధసువర్ణ కలశితవిభా వసుధై ॥

పంచతంత్రము రచియించిన చంద్రవంశ క్షత్రియుఁడగు వెంక టరాజ వంశవిషయము.

సాళువరాజు, బైచరాజు:— వీరిరువురు వెంకటరాజు మూ లపురుషులు. చంద్రవంశక్షత్రియులు.

తిరుమలరాజు:— ఇతడు బైచరాజు కుమారుడు.

వీరభద్రరాజు:— ఇతడు తిమ్మరాజు కుమార్తెయగు తిప్ప మ్మవలన తిరుమలరాజునకు జన్మించినవాడు. యీవీరభద్రరాజు తుంకుళ్ల శ్రీపతిరాజు పుత్రియగు లింగమక్కను పెండ్లియాడే.

లింగరాజు, పర్వతరాజు:— వీరిరువురు వీరభద్రరాజు కొడుకు లు. వీరిలో పర్వతరాజు పోలేపల్లి తిమ్మరాజు పుత్రికయగు అన్న మ్మను పరిణయమయ్యెను.

వేంకటనాధరాజు:—ఇతడు పర్వతరాజుకుమారుడు ఆంధ్రభా రతమువలెనె హరిహరనాధునిపేర పంచతంత్రమను గ్రంధమును కృతి యిచ్చినకవి. ఇతనిది చంద్రవంశ మందునందుకు నృత్తాంతము.

పంచతంత్రము--ప్రథ-ఆశ్వా.

ఉ॥ ధీరతరాజవంశ జలధిన్ ప్రభవించె మహావిరోధినం। హారవిహారి సాళ్వబిరుదాంకుడు బయిచ నృపాలుడద్ధరి। శ్రీరమణీ మనోహరుని తీవ్రయశశ్శ్రుతికిన్ హరాద్రినీ। హారవసుంధరాభరము లయ్యె సమగ్రవిహార శైలముల్ ॥

కలియుగమునందుగల యదువంశక్షత్రియుల వివరం.

వలరాజు:— యితను వజ్రినికొడుకు అనిచెప్పెదరుగాని ప్రమాణవిహీనము. అయితే అనంతతివాడైనది నిశ్చయము.

కవులావుల గంగరాజు:-- ఇతనిభార్య గంగమ్మ యితనుయల మంచి పట్టణ ప్రభువు వీరిరువురకును పుత్రసంతతిలేక శివునిపూజించి తద్వరముచే ఇందున కనుపరిచిన నలుగురుకుమాళ్ళు.

వలరాజు, హరిగోపాలుడు, నందగోపాలుడు, గోవర్ధనుడు:--- వీరునలుగురు గంగరాజుకొడుకులు. యీగంగురాజు పెద్దకుమారుడగు వలరాజునకు యలమంచిపట్టణము పట్టాభిషేకముజేశి ఇతనియదువంశజుడగు తిరుమందులజు ముత్తంరాజును మంత్రిగా నియమించెను.

యలమంచికి వుత్తరముగానున్న ఖండెమొండెముల పట్టణమునకు ప్రభువునైన యదువంశజుడగు కలభూత గంగరాజును వాని తండ్రి మరణించినప్పుడు గంగరాజు స్తొనర్రై యుండగా అయ్యాలరాజు శివరామరాజు, భాస్కరరాజు, దత్తరాజు, కన్నమరాజు, భీమరాజ అనుఅర్హుడని యోగిప్రధానులచే మైనదుతరపున మంత్రులుగానియ

మించి యీమంత్రులచే రాజ్యతంత్రమును గడుపుచుండగా భీమరా జుతప్ప తక్కిన అయిదుగురుమంత్రులు సర్కారుపైకము నాలుగుల క్షలు కుంపుచేసి హరించినసంగతి ఆరవమంత్రియైన భీమరాజుచే తె లుసుకొనబడి మైనరువెళ్ళినతరువాత తనిఖీచేశి శిక్షించగా పైకము ఆరుమాసములలో వప్పగించెదమని చెప్పిపోయి యలమంచిప్రభువగు వలరాజు చెంతజేరి యతనిచే నాదరింపబడి గంగురాజునకు వలరాజు నకు కలహము గలిగించినందున వలరాజుచే ఖండమొండెములకోట జయింపజేశి గంగురాజును గంగరాజు తమ్ములగు రంగధామరాజు, రఘురామరాజు చినగంగరాజు, అనుమురంగధామరాజు, సేనాధిప తిరామలింగన్న యనువాడు యితనున్ను వలరాజుసేనాధిపతి పులిమ ద్దలరామన్నయు కొంతయుద్ధము జరిపి పిమ్మట ముష్టియుద్ధములో యిద్దరు మరణించిరి. పిమ్మట వలరాజు సేనాధిపతి కొంతయుద్ధ ముచేశి రుగధామరాజు బావమరిదియగు రాజగోపాల రాజునిగలిసి బాకులనుకుమ్ముకొని కొంతయుద్ధముచేశి మరణించిరి. తర్వాత హరిపాలుని ఆజ్ఞపుచ్చుకొని భండారుమల్లుడనువాడు యుద్ధమున కుతరలి పాపన్నయను సర్దారుతోబోరి తుదకిద్దరు మరణించిరి. రంగధామరాజును హరిపాలుడు యిరువురుపోరి తుదకు మర ణించిరి. రఘురామరాజును నందగోపాలరాజును గవిసి తుద కు యిరువురు మరణించిరి. గోవర్ధనరాజును చినగంగరాజు దలప డి వారునుమరణించిరి. పిమ్మట కలభూత గంగరాజున్ను వలరా జున్ను కొంతయుద్ధముచేసి గంగురాజునుజంపి రాజ్యముచేకొని తిరిగి గంగరాజుభార్య శరణుజొచ్చుటచే యతనికుమారునకు రాజ్యమిచ్చి పూర్వపుకరణములను యథాప్రదేశముల నుండునట్లొడంబరచి పిమ్మ ట యుద్ధమందు తగిలిన ఘనగాయములతో వైకుంఠముచేరెను.

యీవలరాజునకు మంత్రియు బంధుగుడును నగు తిరుమందుల ము త్తంరాజుయీవలరాజు ఒకానొకసమయమున యరణ్యమున వేటాడు నప్పుడు ఒకచిన్నవాడు దొరికినందున తనకుమాతృయగు నాగమాం బకు సంతతిలేమిచే నామెకిచ్చిన పెంచిపెద్దవానిచేసిన పిమ్మట యత నిబుద్ధి నైశాల్యమునకు అద్భుతశక్తికిమెచ్చి మంత్రిగానియమించెను

యీపల్లికొండ యనువాడు శ్రీవిష్ణునియాజ్ఞచే యాదవులను నైకుంఠముజేర్చుటకయి పాలసముద్రమునగల కమలమందు జనించి చాలాకాలము తపముజేశి వలరాజునకై యరణ్యములో వేచియుం డుటచే నివలరాజునకు దొరికినట్లు చెప్పుదురు. అయితే యీయా దవులతనిని శ్రీవిష్ణ్వవతారముగా చూచుచు యితనియనుమతిమీాద సర్వదా నటింతురు.

గంగురాజు:-- యితను వలరాజుకొడుకు.

ఆవులవలరాజు:--- ఇతను గంగురాజు కొమారుడు యిలమం చిపట్టణపు ప్రభువనిచెప్పుదురు. ఇతనిభార్య ఆవులమల్లాంబ. ఇం టిపేరు ఆవులవారైయుండి పేరువలరాజు అవుటనుబట్టియె భార్యావ ల్లాంబకు ఆవులవారని చెప్పబడి నట్లున్నది.

సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోతురాజు, కొమరక్క:---- వీరుఅయిదుగురు ఆవులవలరాజు కొడు కులు. వీరిలో సింహాంద్రిరాజు శ్రీకూర్మపట్న మేలినవాడనియు సింధుదేశపురాజగు భళ్ళానిరాజుతో చంద్రగిరిదుర్గములో జరిగిన యుద్ధమందు ఇతనుమన్నించెను. రెండవవాడగు పెద్దిరాజు ఇతని

భార్య పెద్దమ్మ. ఇతనికి సంతతిలేనందున బస్వపూజచేసి పంపాదిం యను పట్టణము విడిచి తమ్ముడగు వేలు రాజును నభిషిక్తుని జేసి మేనల్లుడగు పల్లికొండరాజును మంత్రిగానియమించి కళ్యాణ పట్టణమార్గములోవున్న వోరగంటిపట్టణము విజయపట్టణముకు ప్రభువగు నాగకేతరాజువలనను నవరత్న పట్నరాజగు హయవాహనుడను రాజుచేతను వోరుగంటిపట్నమందుగల ఆంజనేయరాజుచేతను రేపల్లి భద్రాచలమందుగల నిమ్మరాజుచేతను సన్మానింపబడి అంతట మాహేశ్వర నగముమొదలైన పట్నములు దాటి కల్యాణపట్టణముచేరి ఇతను ఆర్లపెంటవద్ద జరిగినయుద్ధములో నాలకేతలిరాజుచే పెద్దిరాజు మరణించినాడు ఇతనికి దుష్టనక్షత్రమందు పుట్టి పాపనూకరాజను కన్యను దొనకొండ నామాంతరముగల ధనముకొండ ఆడిపిలో మేడకట్టించినాడు. ఇతనికి కాటంరాజను కొడుకుగలడు వీరిలో యరనూకరాజు, కనిగిరి, వేనుగనాధునికొండ అను నామాంతరములుగల కాళహస్తిప్రభువనియు, ఇతనికి బట్టావులరాజను నొకకొడుకుగలడు ఇతనిభార్య సీతమ్మ.

నలనూకరాజు:— ఇతనిభార్య శీతాంబ. చక్రవాడి యర్రం రాజు నొకపుత్రుడునున్న బెజవాడ పట్టణమేలువాడు.

పోలురాజు:— ఇతను శ్రీరంగపట్టణమువద్దనున్న చెనకూరు పట్టణమేలువాడు. ఇతనికిమంత్రి పంచనముల పాపయ్య. యితనికి నలుగురు కొడుకులు. ఇతనిభార్య సిరిదేవి. ఇతను చిలకమర్రికిరాప దేశాలంతోనుండగా పోడదేశమురాజు ఆదేశమందుగల శైవమతస్తులను జంగములను మతవైషమ్యమునను మొందుకో వెట్టచేయించు

చుండగా ఇతను శైవమతమునందు అభిమానము గలవాడవుటచే బాధపడలేక 500 కుటుంబముల జంగాలు ఈయనకు శరణుజొచ్చుటచేత వారినిరక్షించుటకై దేవగోవగు వంటికొమ్ము బొల్లిఆవును యేమసంఘలు అనగా యెద్దులను కొంతసైన్యమును యిచ్చి ఆజంగాలను శ్రీశైలము పంపినందున చోడునితరపున మురహరు డనువాడువచ్చి జంగాలను చేపట్టితివను కార్యమున చోడునకు పోలురాజునకు కలహముపెంచి చిత్రభానునామ సంవత్సరమందు యుద్ధముప్రారంభించి చోళరాజు బంధువులగు కాలయ్య, విట్టయ్యలు పెంచుకున్న బ్రాహ్మణచిన్నది పార్వతమ్మయను నామెకొమారుడగు ముక్కంటుడను బ్రాహ్మణునిచే చెరుకూరివద్ద చిలకలమర్రిక్రింద ఘోరయుద్ధముజరిగి యితనిచే పోలురాజు మరణించెను.

కరియావులరాజు, చిటినూక:— ఇతను నలనూకరాజు కొడుకు కూతురుచిటినూక యాపిల్లను కన్నంమల పోల్నేడుఅను పోలురాజు మంత్రికియిచ్చిరి. పోలురాజుకొడుకు అయితవరాజును ఇతడును యలమంచి పట్టణమేలుచుండి యొకప్పుడు (గొరికొండ) లేక గమిడికొండ యందుగల శంభుని పూజించుటకు పల్లెకొండరాజు మొదలయిన వారితో వచ్చేవరకు వ్రూకుగంటి పట్టణ ప్రభువగు ప్రతాపరుద్రుడు ఈఅయితవరాజు కలియావులరాజు మొదలైనవారియందు కలుషించి వీరివృత్తాంతమును తెలిసికొని వచ్చుటకై బట్టునొకని పంచుటయు నతడు వారిప్రభావమును కొనియాడి ప్రతాపరుద్రునితో చెప్పుటచేత విషాన్న ప్రయోగమొనర్చుటకు కపటమర్యాద లొనర్చుటయెరింగి దైవభక్త్యోపవాస కారణముచే నాయుపద్రవము తొలగించుకొని శివునిపూజించుటకు భేతాళుడనువాని తోట

యందు పూర్వకోయించి తెప్పించిన అదికారముగా ప్రతాపరుద్రుని సేనాధిపతియగు భేతాళనాయకుడు కరియావుల రాజునకును యుద్ధము జరిగి భేతాళాములనుజయించిరి అయితే వీరికి పెదమొగలిపట్టణము చిన్నమొగిలిపట్టణము, ద్వారవతి, యెలమంచిపట్టణము, అగ్గుకొండ, పంపాదిపట్టణము, కాణాచిగాయుండినట్లు తెలుపబడియున్నది.

కాటంరాజు, పాపనూక (స్త్రీ):— వీరియుప్పరు పెద్దిరాజునకు మారుడు కుమారై ఈకాటంరాజు వుంమనది తొలుత కల్యాణపట్టము అందుండి ఏకారణమువనో ఇతనికి ఆవులకాయించవలెనె పనిగానున్నది. పసులదోలించుకొని శ్రీశైల పర్వతమునకువచ్చి ఆచ్చటి పర్వతప్రాంతములయందు పశువ్వల మేపుచు 12 సంవత్సరములుండి ఆదేశమునకు క్షామము కలుగుటచే అచ్చటనిలుచుటకు వలను పడక పల్నాటి ప్రభువైన వెలమవంశజుడగు పద్మనాయనితో స్నేహము చేసి పసువుల మేతకు పుల్లరిబీడులడిగి నెల్లూరిప్రభువైన సూర్యవంశ క్షత్రియుడగు మనుమసిద్ధిరాజు దేశమునకువెళ్ళి బీడులవిషయములో కలహముజరిగి కాటంరాజుతొలూరను దొనకొండ, యెలమంచి, కల్యాణము మొదలైన పట్టణములలోనున్న అన్నదమ్ముల సహాయముపుచ్చుకొని పద్మనాయుడితో గలసి యెర్రగడ్డపాటిలో గొప్ప యుద్ధము జరగబడి యందు నందరు మరణించిరి. తొలుత ఈకాటమురాజు స్త్రీ దేవతల కొలువనని యొకపట్టుకలదట. ఈక్షామములో గంగాదేవి తనకుకొలువమని చెప్పిన కొలువననుమన నీరులేకుండా చేయుటచే పశుఘోషను సహింపలేక గంగనుగూర్చి యిప్పుడు పశువులకు కొన్నిన్నివుడకము ప్రవహింపజేసితివేని కొలిచెదన

ని ప్రార్థించిన పాలేరు యుప్పొంగి ప్రవహించెను. అందువలన అప్పటినుంచి యాదవులు గంగను యిలవేల్పుగా కొలుచుచునుండిరి.

మనుమసిద్ధిరాజు, యర్రసిద్ధిరాజు, పాపసిద్ధిరాజు, నలసిద్ధిరాజు, కుమారసిద్ధిరాజు, ఈసూర్యవంశ క్షత్రియులు అయిదుగురు అన్నదమ్ములు వీరికి సేనానాయకుడు కవి తిక్కనతమ్ముడు ఖడ్గతిక్కనయనియు 1300 క్రీస్తుశక మందు యుద్ధము జరుగబడినట్లు చెప్పబడియున్నది.

బత్తానులరాజు:— ఇతను యెరనూకరాజు కొడుకు.

చిట్టాహారి యర్రయ్య:— ఇతను నలనూకరాజు కొడుకు.

బత్తినిరాజు, అయితవరాజు, మున్మరాజు, అనుమంచిరాజు:— యీనలుగురు పోలురాజు కుమాళ్ళు వీరిలో బత్తినిరాజు అనువాడు శ్రీశైలమఠములోనున్నాడు. తక్కినవారందరు యర్రగడ్డపాటియుద్ధములో చనిపోయినారు. పిమ్మట వీరివంశమువారు కొండరు కలకాది ప్రాంతములయందు జనిరి.

పోలురాజు కుమారుడగు బత్తినిరాజు శివభక్తుడును ఎఱ్ఱగడ్డపాటిలో జరుగుయుద్ధకాలములో బత్తినిరాజు వారణాశియందు విశ్వేశ్వరు సేవలోయుండి అవధూతాశ్రమము గైకొని చాలాదినములకు తనశిష్యులగు కొందరి జంగమశిష్యుల గూడుకొని శ్రీశైలమువచ్చి అచ్చటనుంచి నందిగనమ మార్గమున దొనకొండకువచ్చి బాల్యమందు విడచిన యీయనతల్లియగు శిరిదేవియనునామెను వీక్షించిన ఆమెపెట్టిన బిక్షమునుటక కాటం రాజు చెల్లెలగుపాపనూక సమా

చిన నక్షత్రము పుట్టింటివారి వంశక్షయమగు దోషనక్షత్రమని చెప్పు
టచే పెండ్లిచేయక అడవిలో గృహమేర్పరచి యందుంచబడెనని చె
ప్పినందున, అంతట తనతల్లి తెచ్చిన అన్నము యెరగడ్డపాటి యుద్ధము
లో చచ్చినదాయలకు పిండప్రదానము చేసెదననియు తమగోగణమందు
గల దేవపశువగు బస్వదేవునిచే యుద్ధవర్తమానము చేసెదననియు
యుద్ధములో తనతమ్ములు మొదలగువారు మరణించినవార్త తెలి
సిన యెడల యీదోనకొండలో గల యాదవస్త్రీలందరు చిచ్చురికవలసి
నదిగా ఆజ్ఞయిచ్చి తానుయుద్ధప్రదేశమగు పాలేరను నదీతటమున
కు పోవుచుండగా మధ్యమునందు వాగువద్ద పైనచెప్పిన బస్వదేవు
డు యుద్ధమందుతగిలిన బాణాదియాయుధముల పోటులచేతను మొ
దురై యావర్తమానము సూచించిన యాబసవని దోనకొండకు పం
పించి, నెల్లూరివద్ద వున్నపులేరుకడ యఱ్ఱగడ్డపాటిలో జరిగినయుద్ధ
మందు పడినవీరులెవ్వరనగా, నలసిద్ధిరాజును నరికిన కాటమరాజును, య
ఱ్ఱసిద్ధిరాజును దునిమిన కరియావులరాజును, గండగోపాలుని యొత్త
రించిన అయితవరాజును, మనుమసిద్ధిరాజు బరిమార్చిన బట్టావులరాజు
ను, పాపసిద్ధిరాజును పెద్దనిదురబుచ్చిన పెయ్యాల యఱ్ఱన్నయును,
పుండ్రవల్లి వీరగోపాలునిఖండించిన ముమ్మరాజును, శ్రీకంఠము
రాజును జయించిన బత్తినరాజు మరిదియగు యుత్తమరాజును, తిరు
మాళతిప్పరాజును ద్రుంచిన వెలమవర్ణుమును, పల్నాటిప్రభువగు నా
చకూళనాయుడును, గుత్తిమరాజును బరిమార్చిన చట్టావారి యఱ్ఱ
య్యను పళ్ళమల తిమ్మరాజును గీటణంగించిన పచ్చందుల పోచరాజు
ను మరికొందరి వీరాగ్రేసరులను గోగణమును గుఱ్ఱములు ఏనుగులు
మొదలయిన సైన్యము రణమందు పడియుండుట జూచి చింతించి పె

ద్దిరాజు మంత్రియగు పందుముసల్లి కొండరాజుకడకువచ్చి యీసం
గతియావత్తు విశదపర్చుకొని అందుకు సమీపమునవున్న వంగవెల్లి
పాటికివచ్చి గోసంగుల సేనాధిపతులగు భీమన్నయనువానిని చెన్నప్ప
యనువానిని జూచి వారలుచేసిన యద్భుతరణమునకు మెచ్చి ప్రాణ
దశ్చమునగానున్న బీరన్నయనువాడు వీరాగ్రేసరునకు పల్లికొండయొక
మొదంటదికె యివ్వబడెను. యీలోకమందు వీరస్వర్గమందిన పురుషు
లపేరులను యొకవీరకత్తులుచేయించి జాతరయొకటచేయుట మర్యా
దకలదు గావున అట్టియుత్సవమందు యీగోసంగవీరుల తరితో వీర
స్వర్గమందినందున చిన్నచెన్నప్పలకును వీరస్వర్గమందిన జేవగో
వులగు బన్నదేవుని తంటికొమ్మ బొల్లియావులకును పైపీనతో పా
టు వీరకత్తులుచ్చుంచి కొల్పులుచేయించెదమని ఒప్పుకొనిరి. పిమ్మట
బత్తిన రాజు చెరసరుకు రణభూమిలో శేతాళాది భూతములకును యి
తరమృగములకును కంకగృధ్రాది పక్షులు ముట్టకుండా కాపాడిన కు
లదేవతయగు గంగకు బలులుబోనాలతో కొలచెదమనిచెప్పి దాయా
దులకు తల్లియిచ్చిన భిక్షచే పిండములువేశినపిమ్మట దొనకొండనందు
యావీరాగ్రేసరుల భార్యలు మొదలుగాగల స్త్రీలందరు చిచ్చురికి స్వ
గ౯ముచేరిరి యిప్పటికి దొనకొండలో గంగజాతరయును కాటము
రాజు యుద్ధశస్త్రములును వీరులపూజా మొదలయినవి జరుగుచూనే
యున్నవి.

(వెంకటగిరిరాజాగారి ప్రభుత్వములోనున్న కన్నేకువద్దదొన
కొండ.)



శ్రీకృష్ణగురుపరబ్రహ్మణేనమః.

# రాజవంశప్రదీపిక

## రెండవభాగము.

ప్రశ్న:— ఇప్పుడు మీరుచెప్పిన గొల్లలనువారు చంద్రవంశక్షత్రియులని స్పష్టముగా తెలిసినదికాని వీరిలికేయుగమం దాచరింపవలసిననిత్య నైమిత్తికాదివేదోక్త కర్మలు అనగా గర్భాధానాదిగాగల షోడశకర్మలును స్నానాదినిత్యకర్మలును ఆచరింపకుండుటకు కారణమేమి.

ఉ:— ఈచంద్రవంశక్షత్రియులకు నిత్యనైమిత్తికాది వేదోక్త కర్మభ్రష్టత్వము యీదిగువను కనుపరుచబడు 7 కారణములచే కలిగినది యీకారణము లెవ్వియనిన (1) పశుపాలనము (2) పురోహితవిహీనము (3) విద్యావిహీనము (4) దుష్టరాజన్యపరిపాలనము (5) దరిద్రము (6) దేశాచారము (7) యుగాచారము. యీయేడు కారణములచే యీచంద్రవంశక్షత్రియుల కిట్టిలోపము సంభవించినది.

### (1) పశుపాలన.

దుష్టరాజన్యభీతిచే భూపాలనకార్యాదులు విడచి పశుపాలనోద్యోగము జీవితవృత్తిగా నంగీకరించి గిరిగహనవనతటులయందు నివసించుచున్నా నావృష్టిదోషములయందును పశువులకు సంభవించెడు రోగమృగభయాదులందును, అపవృద్ధియందును, పశుక్షేమమునకై నా

నాదూర దేశాటనముజేయుచు నానాదేశాచార సాంకర్యత్వముగలి గస్థిరవాసత్వముసిద్ధింపక సాహారాతు)లు తమపుంమందలుగూర్చు కొనితమపుత్రమిత్రకళత్రబాంధవానీక మేకపోతులు పెండ్లలనేర్ప రచుకొనిస్నానసంధ్యానుష్ఠానాది నిత్యకర్మలకును గర్భాదానాది నైమిత్తికకర్మలకును లేశమాత్ర మవకాశముదొరుకక నాపశువులవలన సంభవించిన పాలు వెన్న మొదలగు పదార్థములచే జీవింపుచు గురుపురోహిత విహీనులై గోపరిపాలనమే ధర్మార్ధ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ దాయకమని యెంచి వర్తించుటయు.

(2) పురోహితవిహీనము.

పైనజెప్పిన పశుపాలన వృత్తి గలవారికి పురవాసత్వములేక నిరంతరా రణ్యాచలవాసులగుటచే పురోహితా సంభవులై యందున ధర్మాధర్మ నిర్ణయబోధవిహీనతకలిగి వేదోక్త కర్మాచరణ పరోక్షమగుటయును.

(3) విద్యావిహీనము.

పై 1-2 కారణములచే విద్యాభ్యాసులుగాక ధర్మశాస్త్ర శోధనచేయనేరక తమకుగల విధుల నెరుంగకుండుటయును.

(4) దుష్టరాజన్య పరిపాలనము.

మ్లేచ్ఛాది యన్యమతస్థులు భూపతులై యుండుటచే కులాచార ధర్మపరిపాలనము లేకపోవుటయును ధర్మశాసనులగు బ్రాహ్మణసహాయ రహితులై దుష్టభూపతుల యసహిష్ణత్వమువలన నాచా

రావి గౌరవములచే తలజూపరక నారాజాశ్రితులయిన పరమతకు
ల గౌరవాసూయాధికారులవంచనలకు లోబడి నానాటికి స్వధర్మ
ములు పట్టుపడుటయు.

(5) దరిద్రము.

క్షత్రియులకుగల షోడశకర్మలు అనగా (1) గర్భాధానము.
(2) పుంసవనము (3) శీమంతము (4) జాతకర్మము (5) నామకర్ణ
ము 6 నిష్క్రమణము (7) అన్నప్రాశనము (8) చూడాకరణము(9)
కర్ణవేధ (10) ఉపనయనము (11) వేదారంభ క్రియావిధి (12) కే
శాంతము (13) స్నాతకము (14) ఉద్వాహము (15) వివాహాగ్ని
పరిగ్రహణము (16) త్రేతాగ్ని సంగ్రహము ఇవియన్నియు ద్రవ్యవి
హీనముగ జరుగనవికానందున దరిద్రస్థితిలో కొన్ని సంక్షేపించుకొను
టయును.

(6) దేశాచారము.

(బోధాయనః)

పంచధా విప్రతిపత్తిః దక్షిణత అనుపనీతేన భార్యయాసహ
భోజనం పర్యుషితభోజనం మాతుల దుహితృపితృష్వస్రుదుహితృ
పరిణయమితి॥ తథోత్తర ఊర్ణవిక్రయ శ్శీధుపాన ముభయతో దద్భి
ర్వ్యవహారఆయుధీయకం సముద్రయానమితి॥ తాత్పర్యము॥ దక్షిణ
దేశీయులలో ఉపనయముకానివాని తోడనభుజించుటయు భార్యతో
డన భుజించుటయు చలిది గుడుచుటయు మేనమామ కూతురిని పెం
డ్లియాడుటయు మేనత్త కూతురిని పెండ్లియాడుటయు వుత్తర దే
శీయులలో బొచ్చునమ్ముటయు కల్లు త్రావుటయు కంచరగాడిదల
మలగలెత్తుటయు ఆయుధములధరించుటయు ఓడ లెక్కిపోవుటయు

ఇవి ధర్మ్యములుగా బోధాయనుల వారిచే చెప్పబడియున్నది. ప్రత్య క్షాను భవమునుకలదు. ఇదికర్మలోపమున కెట్లుసూచించుచున్నదని న ఇట్టి శాస్త్రవ్యతిరేకాచారము, లాయాదేశములయందు కెల్లుచు న్నందున ఆచారము కర్మప్రాప కత్వమగుటచే ఆచారలోపముకలిగి నప్పుడు కర్మలోపముకూడా కలదనియును నానాదేశవాసత్వముచే వీరలకు కొన్నికర్మలోపము లాగంతుకముగా సంభవించిన వనుట.

(7) యుగాచారము.

మత్స్యపురాణము 160 అధ్యాయం కలియుగే శ్లో॥ అహం కారగృహీతా శ్చ। ప్రక్షీణస్నేహబంధనాః॥విప్రాశ్శూద్రసమాచారాః స్సంతి సర్వేకలౌయుగే॥ తా॥ అహంకారముగలవారు స్నేహబంధము లేనివారు శూద్రాచారపరులగు బ్రాహ్మణులు కలియుగమందు కలు గుదురు.

శ్లో॥ ఆశ్రమాణాంవిపర్యాసః కలౌసంపరివర్తతే। వర్ణానాం చైవసందేహాః యుగాంతేరవినందనః॥

తా॥ ఓసూర్య పుత్రుడా కలియుగమందు వర్ణాశ్రమములు తారు మారగును.

విష్ణుపురాణము యుగధర్మము.

శ్లో॥ వర్ణాశ్రమాచార వతీప్రవృత్తిర్న కలౌనృణాంనసామయ జుఋగ్వగజ వినిష్పాదనహేతుకాః॥

తా॥ కలియుగమునందు నాయావర్ణములవారికి న్యాయాయాశ్ర మముల నియమములగు యాచారములతోకూడిన నడవడులు కలిగి యుండవు.

విష్ణుపురాణము.

శ్లో॥ నిస్సారాపృథివీ నిరౌషధిలతానీచామహత్వంగతా। రాజానోధర్మపరాయణాశ్చ సతతం। విప్రావికర్మస్థితాః భార్యాభర్తరివైరబుద్ధినిరతా పుత్రాపితృద్వేషిణః॥ ఇత్థంభూతమిదం జగత్కలియుగే ధర్మోవనాంతంగతః.

తా॥ కలియుగమందుభూమి నిస్సారమును ఓషధులకౌషధశక్తివిహీనమును నీచులు మహిమగలవారును రాజులు అప్రయోజకులును బ్రాహ్మణులు కర్మభ్రష్టులును భార్య మగనికి శత్రువును కొడుకులు తండ్రికి శత్రువులును ధర్మము అడవులబట్టుటయును గలుగును,

పరాశరస్మృతి.

శ్లో॥ సర్వేధర్మాః కృతేజాతాః సర్వేనష్టాఃకలౌయుగే॥ తా॥ సర్వధర్మములు కలియుగమందు నష్టమగుననియును.

భారతం॥ అరణ్యపర్వము.

శ్లో॥ బ్రాహ్మణా క్షత్రియా వైశ్యా। సంగిరంతః పరస్పరం శూద్రతుల్యా భవిష్యంతి తపస్సత్య వివర్జితాః॥

తా॥ కలియుగాంతమందు బ్రాహ్మణాది చాతుర్వర్ణములు నొకదానితోనొకటికలిసి శూద్రులతో సమానులుగ నుందురనియును

బృహత్పారాశరీయము ౧ అధ్యాయం శ్లో॥ జితోధర్మశ్చపాపేన అనృతేనతథా ఋతం శూద్రాశ్చ బ్రాహ్మణాచారాః శూద్రాచారా స్తుధాద్విజాః॥ తా॥ కలియుగమందు బ్రహ్మక్షత్రవైశ్యులు శూద్రాచారపరులగుదురనియు॥

పరాశరస్మృతి ఆచారకాండ ౩౦-౩౧ శ్లో॥ జితోధర్మోహ్యధర్మేణసత్యం చైవానృతేనచ జితాశ్చోరైస్తు రాజానస్త్రీభిశ్చపురుషాఃకలౌ॥ సీదంతిచాగ్నిహోత్రాణి గురుపూజా ప్రణశ్యతి కుమార్యశ్చ ప్రసూయంతే తస్మిన్కలియుగేసతే ॥ తా॥ కలియుగమందు రాజులు దొంగలచేతను ధర్మము లధర్మములచేతను జనులు స్త్రీలచేతను సత్యము ననత్యముచేతను చెడును. అగ్నిహోత్రము క్షీణించును తీర్థయాత్రలు పూజలునశించును కన్యలు కాన్పులును గనుదురు.

పైప్రమాణములనుబట్టి కలియుగమునందు ధర్మములన్నియు నష్టమై యుగాంతమున చాతుర్వర్ణములు నొకదానిలో నొకటికలసి ద్విజులు (బ్రహ్మ క్షత్ర వైశ్యులు) శూద్రప్రాయులై యుందురని సకలధర్మశాస్త్రము ఘోషించు చుండుటనుబట్టి యుగప్రయుక్త వేదోక్త కర్మలోపము బ్రాహ్మణాదిద్విజుల నాపాదించి యుండుటయును.

ఇప్పుడు నేను మీకు జెప్పిన యేడుకారణములలో యుగాచారముతప్ప తక్కిన ఆరుకారణములు పశుపాలనోద్యోగము వలన సంభవించినవని యెరుంగవలయును. ప్రత్యేకముపశువుల పాలించు వృత్తిగలవార లీవిధముగ గిరిగహన వాసులయి యుండక వీలులేదు అందువలన యీకారణములన్నియు సంభవింపక తప్పవు. యీయేడు కారణములవలననే నిత్యనైమిత్తిక కర్మవిహీనముకలిగినది. యుగప్రయుక్తాది కొన్నికారణములు సర్వవర్ణములయందును కలిగియున్నప్పటికి బ్రాహ్మణులు వైశ్యులు పశుపాలనవృత్తిమాని యుండుటచే పైకారణము లన్నియు వారలను ప్రతిపాదించనందున నిత్యనైమిత్తికాది కర్మలలో కొన్నియైనను కొద్దిగా నాచరించుటకు సంభవించినది.

ప్రశ్న:— పశుపాలనాది నేడు కారణములచే క్షత్రియ కులోచిత వేదోక్తకర్మ భ్రష్టత్వము కలిగినదని చెప్పితిరిగదా॥ శ్లో॥ జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః॥ అను ప్రమాణము ననుబట్టి యీకర్మహీనులగు క్షత్రియులను శూద్రులని యావిజ్ఞానేశ్వరీయమునను॥ శ్లో॥ అషోడశాద్బ్రాహ్మణస్య సావిత్రీనాతివర్తతే ఆద్వావింశక్షత్రబంధో రాచతుర్వింశతేర్విశః। బ్రాహ్మణులకు 16 సంవత్సరముల వరకును క్షత్రియులకు 22 సంవత్సరముల వరకును వైశ్యులకు 24 సంవత్సరముల వరకును ఉపనయనము చేయకున్న వ్రాత్యులనియు నేలచెప్పకూడదు.

అట్లు చెప్పరాదు. యేలయన॥ శ్లో॥ జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః వేదపాఠంతువిప్రాణాం। బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణాః। కర్మణాజాయతేద్విజః అనుటచే కర్మచే ద్విజత్వము గలిగెననియు (జన్మనాజాయతే శూద్రః) అనుటను బట్టి పుట్టినది మొదలుకొని 13 సంవత్సరములవరకు బ్రాహ్మణకులమందు జనించిన వారైనను శూద్రులనియే చెప్పనగును. అట్లే వ్యాకోనిన॥ విజ్ఞానేశ్వరీయము। వ్యవహారకాండయందు॥ శ్లో॥ అథాస్యవేదముపశ్రుణ్వతస్త్రపూరితం। శ్రోత్రతుభ్యాం ప్రతిపూర్ణం ఉదాహరణే జిహ్వాభేదః। ధారణే శరీరభేదః॥ శూద్రుడు వేదము విని చెవులలో సీసముకాచి వినవలసిన దనియు నోటితో నుచ్చరించినచో జిహ్వకోయ్య వలయుననియు స్మరించితే శరీరము ఖండించవలయునని యీరు చెప్పియున్నది. అట్లు జన్మతః శూద్రత్వమే కలిగిన యెడల వేదోక్తంబగు ఉపనయనానంతరమును “వేదపాఠంతు విప్రాణాం” అను విధిని వేదమును పఠించుటయును. బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మ

క్షా. అను చొప్పున బ్రహ్మజ్ఞానార్హతయును లేక పోవును కాబ ట్టి సల్లసరాదు। మరియెట్లనిన బ్రహ్మ, క్షత్ర, వైశ్యశూద్రత్వములు పుట్టుకతో కలిగి ఆయాజాతములకు అర్హతగల విధులు వేదము లందు నియమించి నందున బ్రహ్మ, క్షత్ర, వైశ్యులకు వేదోక్తోపన యనము కలదనియు శూద్రులకర్హత లేదనియు చెప్పబడియున్నది మరియు. (భగవద్గీత॥)

శ్లో॥ స్నానం సంధ్యాజపో హోమం స్వాధ్యాయం దేవ పూజనం అతిథ్యం వైశ్వదేవంచ సత్కర్మాణిదినేదినే।

తా॥ స్నానము, సంధ్య, జపము, హోమము, వేదపాఠము, దేవపూజ, అతిథిపూజ, వైశ్వదేవము యివి ప్రతిదినము చేయవల సిన సత్కర్మలని భగవంతుడగు శ్రీకృష్ణుడు అర్జునునకు బోధించి నట్లును॥

భగ॥ సాంఖ్య॥ తృ॥ శ్లో॥

నియతం కురుకర్మత్వం । కర్మజ్యాయోహ్యకర్మణః । శరీర యాత్రాపిచతే । నప్రసిద్ధ్యేదకర్మణః॥ తా॥ ఓయి అర్జునా నీవు ని త్యమును చేయవలసిన సంధ్యావందనాది కర్మము లాచరింపని యె డల సర్వకర్మరహితుడవైనటువంటి (అనగా) -లఘ్యాభ్యస్వరూపు డవైన నీకు ప్రశిద్ధి కలుగదని శ్రీకృష్ణభగవానులు అర్జునుని గురించి పలికి నట్లును.

మహాభారత—శాంతి॥ ౧౮౯—౭॥

శ్లో॥ తతఃసత్యంచ ధర్మంచ తపోబ్రహ్మచశాశ్వతం ఆచా రంచైవశౌచంచ స్వర్గాయవిదధే ప్రభుః॥ తా॥ సత్యశౌచ ఆచార

ములను బ్రహ్మ స్వర్గభోగముంకై సృజించెనని యు చెప్పి యున్నది గాని కులోత్పత్తి కారణము కాదు. అట్లాచరింపకున్న॥

విజ్ఞానేశ్వరీయము. ఆచారకాండ.

శ్లో॥ అతఊర్ధ్వం త్రయోప్యేతే। యధాకాలమసంస్కృతాః। సావిత్రిపతితా వ్రాత్యాభవంత్యార్య విగర్హితాః॥ ఈయర్హతగల వేదోక్త కర్మాచరణముచే లోకప్రశిద్ధియును పుణ్యవంతుడనియు నాచరింపకున్న పుణ్యవంతుడు కాని పతితుడనియు పతితునకు స్వర్గ భోగవిహీనమై నరకప్రాప్తి యని చెప్పియున్నది. జన్నిదము వేసుకున్నంత మాత్రమున జాత్యాధిక్యత కలుగుననిన నీలోకమందు సాలీలు విప్రవినోదులు కులాలాధిక అన్యజాతులు కూడా యజ్ఞోపవీతమును ధరించుచున్నారు. అట్టి వారలు బ్రహ్మ. క్షత్రియ, వైశ్య జాతులలో నేలచేరలేదు. హారికాధిక్యత కలిగినను కదా ధరించని వారికి నింద్యమగు తక్కువ ఘటించును. లోకములో యజనాదిషట్కర్మములు బ్రాహ్మణులు ఆచరించవలసినదే కదా యిప్పుడు క్రమముగా నాచరించు వారలు కోటికొకరుందురు. వారియందు త్రికరణశుద్ధిగా జేయువారొకానొకరుందురు తక్కిన వారిలో సంధ్యావందనమే చక్కగా నాచరింపక॥ భాగవతము. సప్త॥

క॥ దమమును శౌచము తపమును శమమును మార్ధవము కృపయును సత్యజ్ఞానక్షమములును హరిభక్తియు హర్షము నిజలక్షణము లగ్రజాతికి నధిపా॥

అనుస్యల్లి శౌచాదిక లక్షణము లేమియు లేని వారలయి వర్తించుచున్నను వారలను బ్రాహ్మణులని చెప్పకుండిరా అంత

మాత్రమునఁ బ్రాహ్మణజాతమునకు నింద్యము వాటిల్లెనా వారికు లాచార ధర్మకర్మములు చక్కగా నెరవేరుచు కొనుచున్నారనిన॥

భాగ--హరి॥ గీ॥ ఆ యధర్మయుతులై బ్రాహ్మణు లాత్మవిధుల విడిచి శూద్రుల గొల్చుచు విడువక శూద్రు లంచిత బ్రాహ్మణాచారులై చరింతు రిక బెరసువారు భువియందు రేకపంక్తి॥ తా॥ కలియుగమందు బ్రాహ్మణులు స్వకులాచారంబులు విడిచి యాయా కుధంబులతో శూద్రసేవ చేయుదు రనియు శూద్రులు బ్రాహ్మణాచారంబు గలవారై వర్తింతురనియు శూద్రులు బ్రాహ్మణులు యేకపంక్తి కాపురింతు రనియును॥ ఉ॥ నియమ సుయాజ్యయాజనము విప్రులొనర్తురు యజ్ఞములందు డంబున నభుజిష్టి యిత్తురు విమోఘతబాయమువదలి హోత్రము నొసగొని బ్రహ్మవాదులు కొందరు మద్యము గ్రోలి మాంసము దిని ధనవాంఛనై జనుల ద్రిప్పుదు రగ్రపుమంచనంబులన్॥ తా॥ నియమ విహీనులైన యజ్ఞములు చేయుటము చేయించుటయు కలుగుననియు అజ్ఞానులయి అగ్నిహోత్రముల విడచెదరనియు బ్రహ్మవేత్తలమని మాంసము, కల్లు, భక్షణపానంబులు చేయుదురనియు ద్రవ్యాభిలాషచే తీక్షణులైన యవమానములు జనులకు కలుగ జేయుచు ధనము సంపాదింతు రనియును.॥

జైమినీ భారతము అష్ట॥

సీ॥ ఆమ్నాయ పథవిహీనాచారములచేత ప్రబలునన్యోన్య వైరములచేత। నన్యాయవర్తనులైన జనులచేత సమకొన్న దుర్వ్యసనములచేత। ధర్మపత్నినిరాదర కృత్యములచేత ప్రభవించు వేశ్యాభిరతులచేత। పరధనపరదార హరణబుద్ధులచేత సలిపిన ఘోర

మోహాములచేత । జాలికాదులచేత దూషకులచేత । ప్రల్లదులచేత నిరీశనాపకులచేత । డాంబికులచేత పచ్చిబంతిగలచేత । గిల్లరులచేత దర్పించుగలియుగంబు ॥ (ఆమ్నాయ పదవిహీనాచారములచేత) అనగా నిప్పుడు వేదమార్గ విహీనాచారములు కలియుగమందు గలుగునని చెప్పియున్నది. యిందునుబట్టి బ్రాహ్మణాది వర్ణములు తమతమ వర్ణాచారములు తప్పకుండా నటించుచున్నారనరాదు. అట్లొప్పుచున్న కలియుగధర్మంబుదప్పు. దప్పితేమాయననిన నీలోకమందు ప్రత్యేకానుభవమగుచుండగా తర్కిల్లొప్ప కొనవచ్చును. కావున వర్ణధర్మలోపముకలిగి ననుకూలహాని సంభవింపదు.

మరియొకపక్షము విచారింతము.

శ్లో॥ జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతే ద్విజః॥ అనుటలెట్లన్న యీద్విజులు జన్మముచందర్ణాసముచే నుండిరిగనుక శూద్రప్రాయులనియు నుపనైనము కావడముతో కర్మకులయిరిగనుక ద్విజత్వము సార్థకమాయెను. ద్విజత్వము జన్మతో నెల్లకలిగినదనగా శూద్రులవలె వేదోక్తకర్మాధికారులుగాక తత్కర్మార్థ కారణావ్యత కలుగుటచే ద్విజులనబడిరి. అట్లుగాక వృషలియన కర్మచేతనే ద్విజత్వము కలిగినదనిన సర్వత్రా కలుగవలెను. అట్లు కలుగలేదు. గాక ఉపనయనాత్పూర్వము ప్రథమమూషజాతులు శూద్రులేకావలయును. అట్లయిన ద్విజులుయిప్పుడు శూద్రులను దేవార్చనపాకాదికర్మలయందు దరిశన స్పరిశనాదికములయందెట్లు నిషేధింపబడిరో అట్లే నిషేధింపబడవలయును. ద్విజస్త్రీలను సర్వదా పరిగ్రహింపకూడదుగదా. అట్లుచెప్పటను చెప్పియుండలేదు. జరుగనదిలేదు.

కాబట్టి [యాచంద్రసంశ తత్రిషులు] బ్రహ్మక్షత్రియ వైశ్యులను మూడువర్ణములవారికి ద్విజత్వము జన్మతః కలిగినది.

## యజ్ఞోపవీతము.

శ్లో॥ బ్రహ్మక్షత్రియ విట్ఛూద్రాః । వర్ణాస్త్వాద్యాస్త్రయో ద్విజాః । నిషేకాద్యాః శ్మశానాంతాః స్తేషాం వై మంత్రతః క్రియాః ॥

తా॥ బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులు, నాలుగువర్ణములలో మొదటి మూడువర్ణములవారు ద్విజులు. వారికి గర్భాధానము మొదలు శ్మశానపర్యంతము సమంత్రకముగా కర్మలాచరింపవలయును.

## ఆపస్తంభ సూత్రము, ౧-౧౧.

అశూద్రాణామదుష్టకర్మణాముపాయనం వేదాధ్యయనమగ్న్యాధేయం ఫలవంతి చ కర్మాణి ।

తా। శూద్రులను దుష్టకర్మ చేసినవారిని తప్ప మిగిలినవారికి వేదాధ్యయనము, అగ్నిహోత్రము విధింపబడినది.

## మనుస్మృతి: ౧౦. అధ్యాయం.

౪. శ్లో॥ బ్రాహ్మణక్షత్రియవైశ్యా స్త్రయోవర్ణా ద్విజాతయః । చతుర్థ ఏకజాతిస్తు । శూద్రానాస్తి తు పంచమః ॥

తా॥ బ్రహ్మక్షత్ర వైశ్యులు ద్విజాతులనియు శూద్రు డేకజాతియనియును.

## శాఙ్ఖధర్మశాస్త్రము ద్వితీయోధ్యాయః

వర్ణానామానుపూర్వ్యా బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాః । త్రయో వర్ణా ద్విజాతయః । బ్రాహ్మణక్షత్రియవైశ్యాః ॥

తా॥ బ్రహ్మక్షత్ర వైశ్యశూద్రులందు ద్విజులనగా బ్రహ్మక్షత్ర వైశ్యులు.

ఇట్లు స్మృతిః ద్విజులకుట కనేకప్రమాణములు కలవు.

అయితే. క్షత్రియునకు 22 సంవత్సరములలోగా ఉపనయనము కానియెడల వ్రాత్యదోషము చెప్పియున్నది. యీకలియుగమందు 30-40 సంవత్సరములవరకు ఉపనయనము కానివారును అయ్యిన వారిలో సంధ్యావందనమే చక్కగా చేయనివారును వేదముచదువనివారును సక్రమముగా వేదోక్త షోడశకర్మ లాచరింపనివారును కొందరు స్వధర్మములెట్టివో యెరుంగక లౌకిక కర్మలయందే అనురాగులై వర్తించు బ్రాహ్మణులు వైశ్యులు అనేకులు కలరనుట యందరికి అనుభవసిద్ధమే కదా. అట్టి వారికి వ్రాత్యాదిదోషములు ఘటించుచుండెనో వారికి వర్ణత్రయత్వము సిద్ధించి బ్రాహ్మణులనియు వైశ్యులనియు చెప్పుకుండిరో యింతయేగాక వ్రాత్యదోషము (ఉపపాతకమనబడును.) సురాపానము (బ్రాహ్మణ సువర్ణాపహరణం) గురుదారగమనం (వీనిని సంసర్గత్వము) (మహాపాతకము.) సగోత్రవధ. అవిజ్ఞాత గర్భఘాతనం మొదలయినవి (బ్రహ్మహత్యా సమములు) కూటసాక్ష్యము (సురాపాన సమపాతకము) బ్రాహ్మణ భూమిహరణం. యిది (సువర్ణస్తేయ పాతకసమానము) యీమొదలయిన దోషములు లోకమందు ద్విజులందరియందును జరుగుట

మాతృగమనం, దుహితృగమనం, స్నుషాగమన మిత్యతిపాతకాని.

యాగస్థక్షత్రియ వధః । వైశ్యచ రజస్వలాయాశ్చాంతర్వ త్న్యాశ్చసగోత్రయాశ్చ అవిజ్ఞాతస్య గర్భస్య శరణాగతస్య ఘాతకం ॥ బ్రహ్మహత్యా సమాని ।

కౌటసాక్ష్యం సుహృద్వధా । ఇత్యేతౌ సురాపానసమౌ ॥

బ్రాహ్మణభూమిహర్ణం । సువర్ణస్తేయసమం । పితృవ్యమాతులమాతామహ స్వపపత్న్యభిగమనం । గురుదార గమనసమం॥

పితృష్వ సుమాతృష్వ సుగమనం । శ్రోత్రియ ఋత్విగుపాధ్యాయ మిత్రపత్న్యభిగవచనం - స్వసుస్సఖ్యా సగోత్రాయా ఉత్తమవర్ణాయ రజస్వలాయా । శరణాగతాయాశ్చ గమనమిత్యేతాన్య నుపాతకాని ।

అనృతంచ సముత్కర్షే - రాజాగామి చ పైశునం । గురోశ్చాలీక నిర్బంధో వేదనిందా అధీతస్యత్యా గోగ్నిసుత మాతృదారాణాం చ । అజో జ్యాన్న భక్షణ పరస్వాపహారణ పరధరాపహారణ అయాజ్యానాంచ యాజనం । వ్రాత్యతా భృతకాద్యాపనం । భృతాదధ్యయనాదానం సర్వాకరేష్వధికారః । మహాయంత్ర ప్రవర్తనం గుగుల్మ లతౌషధీనాం హింసాజీవన మభిచార మూలకర్మ సుచప్రవృత్తిః। ఆత్మార్ధక్రియారంభః । అనాహితాగ్నితా । దేవర్షి పిత్రాంణాంస్నాపక్రియా । అసచ్ఛాస్త్రాధిగమనం నాస్తికతాకుశీలతా మద్యప స్త్రీ నిషేవా మిత్యనుపాతకాని ॥

అంతేతే ఉపనయనము మాత్రము చేసుకొనిసంధ్యా వందనము నిత్యమాచరించుటచే పాతకములన్ని నశించుననిన ఉపనయనకర్మ మొక్కటియే ద్విజులకు చాలుననిచెప్పి విధ్యుక్తముగా జరిగించని వారికిని ఉపనయనము చేసుకునినవానికిని వ్రాత్యాది పాతకముల కే ప్రాయశ్చిత్తము చెప్పక తక్కినపాతక ములకు వేరు వేర ప్రాయశ్చిత్తాదులేల చెప్పవలయును.

బ్రాహ్మణులలోను వైశ్యులలోను నిత్యము సంధ్యావందన మాచరించువారైరిగదా వారలు సర్వదోష పరిహారులనవచ్చునా ॥ అనవచ్చుననిన ॥ శ్లో॥ నిస్సారాపృథివీవిరా మఖిలతా నీచంమహత్వం గతాః । రాజానోర్థపరాయణాశ్చసతతం । విప్రోవికర్మస్థితాః । భార్యాభర్తరి నైరబుద్ధినిరతా । పుత్రాపితృద్వేషిణః । ఇత్థంభూతమిదం జగత్కలియుగే ధర్మోవనాంతంగతః ॥

తా॥ కలియుగమందు బ్రాహ్మణులు కర్మభ్రష్టులగుదురు.

బృహన్నారదీయము, ౩౮ అధ్యాయం.

బ్రాహ్మణా క్షత్రియో వైశ్యా । శ్శూద్రధర్మపరానరాః
ఘోరేకలియుగేప్రాప్తే ద్విజావేద పరాఙ్ముఖాః ॥

తా॥ భయంకరమైన కలియుగమురాగా బ్రాహ్మణక్షత్రియ వైశ్యులు వేదపరాఙ్ముఖులు శూద్రధర్మావలంబులగుదురు. బ్రాహ్మణవైశ్యులు నిర్దోషులయిన యెడల నీప్రమాణములే రీతియందు స్వీకరింపవలయును.

## మరియొకశోధము విచారింతము.

ధర్మార్థకామములు మూడును పురుషార్థములుకదా. ధర్మము, వర్ణము, నవలంబించుక వచ్చినదా. వర్ణము, ధర్మము నవలంబించుక వచ్చినదాయని విచారము ధర్మము నవలంబించుక యే వర్ణమువచ్చినయడల సర్వజాతులకు యజనాది పేచ్ఛధర్మము లెవరాచరింతురో వారికెల్ల ద్విజత్వమురావలెను. అట్లువచ్చి నఅహా తానాహాత విచారమునకులోపము వాటిల్లును. గనుక వర్ణము నవలంబించుకయెధర్మము వచ్చినదని చెప్పవలయును. యెట్లనగా ప్రథమమున జాతినిర్ణయమును పిమ్మట నేయేజాతుల కాయాతారతమ్యముల ప్రకారము నిత్యనైమిత్తిక జీవితకర్మ విధులు యేర్పడినవి. అవియెధర్మమనబడును. ఏ ఏ వర్ణములకు నేయెధర్మములు కలవో అట్లుతప్పకుండా అర్థము గూర్చుట అర్థమనబడును. యే యేవర్ణమునకేయెనియమభోగము లనుభవించనలయునో నాయా భోగము లనుభవింపగోరుట కామము. ధర్మము పరలోకసుఖదాయిని, కామము ఇహలోకసుఖదము. యీరెంటియొక్క సాధనమర్థమగుటచే స్వర్గాదిభోగ దాయియైన ఉపనయనాది ధర్మము యుగప్రయుక్త భ్రమప్రమాదముల వలన జరుగకున్నను స్వర్గభోగము కొరతపడును. గాని ఇహలోకమందు వర్ణహానికలుగదు. అట్లయిన స్వర్గభోగవిహీనము రావలయునుగాని ఉపనయనంగాని చో వ్రాత్యదోష మెందుకువిధింపవలెను. ప్రథమమున్న నేయేవర్ణముల కాయానియమములు వేదమందు బ్రహ్మచే నిర్ణయింపబడెనుగాన ఆయాకులధర్మములు తప్పినపాతకములని విధింపబడెను.

ఈచంద్రవంశక్షత్రియులు ఉపనయనాదులొక వేళ పదియారవ వత్సరమున జరుగకున్నను వ్రాత్యకోవ మాపాదింపదు. యెట్లనిన॥

బృహన్నారదీయము. ౧ అధ్యాయము.

శ్లో॥ జితోధర్మశ్చపాపేన । అనృతేన తథాఋతం । శూద్రాశ్చ బ్రాహ్మణాచారా । శూద్రాచార స్తథాద్విజాః ॥

కలియుగమందు శూద్రులు బ్రాహ్మణాచారులుగను ద్విజులగు బ్రహ్మక్షత్రియ వైశ్యులు శూద్రాచారులగుదురు.

బృహన్నారదీయము 3 అధ్యాయం.

బ్రాహ్మణా క్షత్రియా వైశ్యా సర్వేధర్మ పరాఙ్ముఖాః । శూద్రతుల్యా భవిష్యంతి । తపసత్య వివర్జితాః । ఉత్తమా (నీచశూద్రాణాంచ) శ్వరధనాగాశ్చ చరాచరభవిష్యంతి । కింకరాశ్చ భవిష్యంతి శూద్రాణాంచ సదాద్విజాః । బ్రాహ్మణా క్షత్రియా వైశ్యా శూద్రధర్మాపరాయణాః । ఘోరేకలియుగే ప్రాప్తే ద్విజా వేద పరాఙ్ముఖాః ॥

తా॥ భయంకరమైన కలియుగము వచ్చినతర్వాత బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు, తపస్సత్యములు మానుదురు. శూద్రతుల్యులగనుందురు. యెవ్వనికి యేనుగులు గుర్రములుసంపన్నుడో వాడె రాజగు. బ్రహ్మ క్షత్రియ వైశ్యులు శూద్రులకు సేవకులగుదురు.

దేవీభాగవతే- నవమస్కంధే-అష్టమోధ్యాయః.

శ్లో॥ బ్రహ్మక్షత్రవిశశ్శూద్రా । జాత్యాచార వివర్జితాః

సంధ్యావర్ణయజ్ఞసూత్రంత । భవేచ్ఛూద్రం నసంశయః ॥౨౭॥ మ్లేచ్ఛా చారా భవిష్యంతి । వర్ణాచతుర్వా రపనయ । మ్లేచ్ఛశాస్త్ర పఠిష్యంతి స్వశాస్త్రాణి విహాయచ ॥౨౮॥ బ్రహ్మక్షత్ర విశాంవంశా శూద్రా ణ్ణాంవాం సేవకాస్తథా । సూపకారా ధావకాశ్చ వృషవాహాశ్చ సర్వ పః ॥ తాత్పర్యము.

బ్రహ్మక్షత్రియ వైశ్యులు జాతిధర్మవిహీనులై సంధ్యయజ్ఞ సూత్రములు వదలి శూద్రతుల్యు లగుదురు. ॥౨౭॥ చాతుర్వర్ణుల మ్లేచ్ఛాచారులై తమశాస్త్రము వదలి మ్లేచ్ఛశాస్త్రములు చ దువుదురు. కలియుగమున బ్రహ్మక్షత్ర్య వైశ్యులు శూద్రసేవా రతులయివంటాచార్యులుగాను పరిచారకులుగాను పుస్త్యాదికర్మలను కూలికి చేయువారలగుదురు.

దేవీభాగవతము నవమస్కందే అష్టమోధ్యాయః ॥

బ్రహ్మక్షత్ర్య విశాంవంశాః । భవిష్యంతి సపాపినః ॥ ౨౯॥ అన్నానాంని యమోనాస్తి । యోనీనాంచ విశేషతః । ఆశ్రమాణాం జనానాంచ సర్వేమ్లేచ్ఛా కలౌయుగే ॥

తా॥ బ్రహ్మక్షత్ర్య వైశ్యవంశములు పాపములు గలవిగ న గుచున్నవి ॥ ౨౯॥ ఇంకసర్వజనులు కలియుగమందు విశేషముగ అ న్న నియమము యోని నియమము ఆశ్రమ నియమము లేక మ్లేచ్ఛు లగుచున్నారు.

ద్విజులగు బ్రహ్మక్షత్ర్య వైశ్యులందరికి యిట్లుచెప్పియుండ గా, యీచంద్రవంశక్షత్రియులనే వ్రాత్యాదిదోషములు కించన్మా

త్రుల జేయుటెట్లు (యిది యుగధర్మము) యుగప్రయుక్తమున వేద విహితకర్మలయందును స్వకుల వృత్తులయందును నియమము తప్పి భ్రష్టులయ్యెదరని చెప్పియున్నారు. ఇదియుగాక వర్ణాశ్ర మాచారాదిక ధర్మము తప్పకుండా పరిపాలనముచేయు యుత్తమక్షత్రియుల పాలనకుదొలగి దేశమంతయు మ్లేచ్ఛాదిక యితర వర్ణాధీనమగుటచే వేదోక్తమయిన సకలధర్మములు నానాటి కడుగంటి ప్రమాదవశమున ద్విజులు కర్మభ్రష్టులయిరి. గాక యీచంద్రవంశ క్షత్రియులకు పశుపాలనము సంభవించిన విద్యావిహీనముచే స్వకులోచితధర్మములు దెలియక భ్రమనొందిరి.

పరాశరస్మృతి, ఆచారకాండ॥

యుగే యుగేచ యేధర్మ స్తత్రతత్రచ యేద్విజాః। తేషాం నిందా నకర్తవ్యా యుగరూపాహి తేద్విజాః॥

తా॥ యుగప్రయుక్తమయిన ధర్మమును నవలింపనలవికాదు కావున ధర్మలోపమునుగురించి ద్విజులను నిందింపరాదు.

ఇట్టియుగప్రయుక్తమగునట్టియు యుగప్రయుక్తాంతర్భూతమయిన భ్రమప్రమాదులవలన సంభవించినట్టి యీక్షత్రియులకుగల కర్మలోపమునుగురించి నిందార్హులుకారు. ఇదియును గాక గోపరిపాలనముచే సంభవించిన ఉపనయన విహీనవ్రాత్యదోషము వీరియందెంత మాత్రమునుపయోగమెట్లన్న. యదువంశసంభవులగు క్షత్రియులకు గోపాలనవృత్తి పరమధర్మమనియును తన్మహిమాతిశేషమును పరిశ్నరూపముగా మీకెరిగించెదె యున్నాను. అయితే

ఉపనయన సంధ్యావందనములు సకలపాపములను హరించి స్వర్గభోగములననుభవింపజేయుటకే గదా॥

విజ్ఞానేశ్వరీయం, ప్రాయశ్చిత్తకాండ.

కం॥ దేవసమూహంబెల్లను । గోవుశరీరంబునందు గొనకొని యుండున్ । గావున గోవుమహాత్మ్యము । భావింపగరాదు నిజము బ్రహ్మకునైనన్ ॥

సర్వదోషహరమై స్వర్గాదిభోగములు గోపరిపాలనవలన నిరభ్యంతరముగా కలుగునని చెప్పుచున్నది. వేదస్వరూపమైన గోవును పాలించడము, వేదధర్మ పరిపాలనముకాదా? ఉపనయనాది వేదోక్త కర్మములాచరింపనివారినిగా నీచంద్రవంశక్షత్రియుల నెంచవచ్చును. ఇది యెటులంగాక.

మనుస్మృతి. ౪ అధ్యాయము,

శ్లో॥ ఏనాస్యపితరోయాతాః । యేనయాతాః పితామహాః । తేనయాయాత్సతాంమార్గం । తేనగచ్ఛన్నరిష్యతే ॥

తా॥ పెద్దలేధర్మమునననుసరించిరో యాధర్మమార్గము ననుసరించవలసినది.

విష్ణుస్మృతి.

శ్లో॥ శాఖాంపుండ్రంచ సూత్రంచ । సముదాచారమేవచ । పూర్వైరాచరితం కుర్యాదన్యథాపతితోభవేత్ ॥

తా॥ శాఖాపుండ్రము సూత్రము సముదాచారము పూర్వ

లచే నాచరింపబడినదే యాచరింపదగును.

ఎల్లాజీయము.

పారంపర్యాగతాధర్మం । యోనరస్త్యక్తుమర్హతి ॥

పరంపరాధర్మము నంగీకరింపదగినది.

యాదవవంశ క్షత్రియులయందు కొందరు చాలాకాలము నంచి పరంపరా ఉపనయన విహీనులై యుండుటనుబట్టి యిప్పటివారికి పూర్వాచారమయియున్నందున పై ప్రమాణములచే పూర్వాచారము విహితమైనదగును.

మత్స్యపురాణము ౧౪౩ అధ్యాయం.

శ్లో॥ తథాకలియుగస్యాంతే । శూద్రభూతాః ప్రజాస్తథా । బ్రహ్మ క్షత్ర విశశ్శూద్రాః బీజార్థే యేఇహస్మృతాః ॥

తా॥ కలియుగాంతమందు ప్రజలు శూద్రతుల్యులగుదురు బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్రులు కలియుగమునందు బీజభూతులగ నుండి మరల కృతయుగమున వారలసమానులగుదురు.

ధర్మలోపమునసే వర్ణలోపము కలిగినయడల కలియుగాంతమందు సర్వకర్మభ్రష్టులైన శూద్రతుల్యులగు ద్విజులు మరల కృతయుగమునందెట్లు ద్విజులగుదురు. కావున వ్రాత్యదోషమున కాకరులు కారు. శూద్రులనరాదు.

ప్రశ్న:— అట్లయిన యాదవవంశక్షత్రియులకు గతించిన వేదోక్తోపనయనాదులు పునరుద్ధారణ చేయవచ్చునా?

ఉః—చేయనచ్చును, ప్రమాదవశంబున లోపించిన కర్మలను పునరోద్ధారణ చేయుటకై గదా? ధర్మశాస్త్రములయందు ప్రాయశ్చిత్తకాండ నిర్ణయింపబడెను. యీకలియుగమందు బహుదినములనాటినుండియు వైశ్యులు వేదోక్తకర్మలను కొన్నికారణములచే పురాణోక్తముగా నాచరించుచున్న మధ్యకాలములో కొందరుత్తమపురుషుల శిద్ధాంత ప్రకటనచే తిరిగి సంస్థాపింపబడి యిప్పుడు వైశ్యులు వేదోక్తముగా నడువ నారంభించుచున్నారు. యిప్పటికి కొందరు పూర్వాచారమైన పురాణోక్తమును విడువజాలకయే యున్నారు. ఇందుకు వైశ్యప్రకాశికయును వైశ్యకుల దీపికయును చూచుకొనునది.

చంద్రవంశ క్షత్రియులలోకూడా యదువంశ క్షత్రియుడగు శివాజియును మహారాష్ట్ర దేశీయుడు తురుష్క ప్రభువులచే యడుగంటిపోయిన హిందూమత ధర్మమును పునరుద్ధారణ చేయుటకై దక్షిణమహారాష్ట్రము మొదలయిన దేశములు జయించి వీరాపూరు రాజ్యములోని రాయనగరదుర్గము రాజధానిగా నియమించి హిందూధర్మశాస్త్ర ప్రకారము పట్టాభిషేక మొందదలంచిన ఉపనయనాదులులేని హేతువచే అచ్చటిపెద్దలు క్షత్రియుడో కాడోయని సంశయించిన నతడు క్షత్రియుడైననంగతి స్వగ్రామమైన వుదయపురమునకున్న వంశవృక్షము దెప్పించి క్షత్రియవంశమును సిద్ధాంతీకరించిరి. శాస్త్రోక్తముగా ఉపనయన విహీనమునకు వ్రాత్యస్తోమ యజ్ఞమును చేయించి పిమ్మట ఉపనయనముచేసి క్రీస్తుశకము 1674 సం॥ జూన్ది 6 తారీఖునకు సరియగు నందననామ సం॥ జ్యేష్ఠ శు ౧౩ గురువారము శివాజీకి పట్టాభిషేక మొనర్చిరి. ఇదియంతయు

శివాజీచరిత్ర చూచిన తెలియగలదు. కావున ధర్మలోపము కొన్ని నాళ్ళకైనను సవరణకాగలదు.

ప్రశ్న:— యిప్పుడుకొందరు గొల్లలను వృత్తినామముగల క్షత్రియులు మేకలనుపాలించుటయే వృత్తిగాగలిగియున్నారు. అది కులాచారధర్మ విరుద్ధము మున నీచవృత్తిగా నేలభావింపకూడదు.

ఉ:— మేకలను పాలించువృత్తి నీచమనిచెప్పుటకు మేక ములు నీచజంతువులు ఆయిననుగదా? తత్పాలితవృత్తి నీచముగావలె ను. యీలోకమందు సర్వజన భక్షణీయమును సర్వజనోపయుక్త మును స్వర్గాపవర్గఫలంబు లిచ్చునవియునై యజ్ఞపశువులనఁ బ రగిన యీపశువులను నీచజంతువులుగా నూహింపరాదు. యజ్ఞార్హతకలిగిన చతుష్పాత్ జంతువులలో ముఖ్యత్వ ప్రమాణములు కలవు.

యజుర్వేదం॥ జ్యోతిష్టోమాదిక్రతునాం దేవతాహవిరర్థం పశ్వాలంబనంముఖ్యం । కుతః । ఇమంపశుంపశుపతేతే అద్యబధ్నామి యిత్యార్ష్యాముమకతిః । నానొప్రాణో యజమానస్యపశునేతి । ఇత్యా దిబహుశ్రుతి పర్యాలోచన యూపశోః । వపావింపి దేవానామత్యం త ప్రియతమాని కించపశుశబ్దశ్య సర్వేషాం చతుష్పాజ్జంతూనాంఛా గస్య ముఖ్యత్వంకథం । ఛాగస్య వపాయా మేధసానూబ్రూహి। ఛా గోసి మమభోగాయ భవమేషోసి మమభాగాయభవ । అజేనాగ్నిష్టో మంద్యోనేతి ॥ ఇత్యాదిస్మృతి శృతిరీత్యా పశూనాంఛాగస్య ముఖ్య త్వాత్ జ్యోతిష్టోమాదిషు సామాన్యేన ఛాగపశుకేవ॥ ఇతి సంక్షేప ణంలిఖ్యం ॥

ఇట్లు జ్యోతిష్టోమాది యజ్ఞములకు మేషపశువుయె ముఖ్యమ నియును దేవప్రీతికరమగునని యనేకప్రమాణములు వేదమునందు ప్రసిద్ధమైయున్నది.

సీతారామాంజనేయం॥ మ॥ ఉరురాగాది గుణాజసంఘమున నాద్యోంకార మంత్రంబుచేత రయంబార వధించి యాత్మవిష యేధ్మశ్రేణితోఁగూడిచె। చ్చెరనానా విధవాసనాజ్యములతోఁ చిదగ్నిమధ్యంబునన్ । వరుసంద్రేలిచి సౌఖ్యసోమరస పానంబింత గావింపుమా॥

తా॥ రాగాదులను మేకలను ఓంకారమంత్రముచేత విశసించి విషయ సమిధలచే వాసనలనేయితో చిదగ్నియందు వ్రేల్చి బ్రహ్మానంద సోమపాన మొనరింపవలసినదిగా బాహ్యయజ్ఞవిధిని ఆత్మయజ్ఞముగా నిరూపించి చెప్పియున్నది.

వేమనశతకం॥ గీ॥ పేరుసోమయాజి పెనుహింసాబలుడయ్యా। మేకపోతుబట్టి మెడను విరచు। గాక గ్రతువువంక గలుగునా మోక్షంబు। విశ్వదాభిరామ వినురవేమ॥

ఇట్లు మేక పశువులు గోవులవలెనె యజ్ఞార్హతగలవిగా యనేకప్రమాణంబులు వేదాదులయందు చెప్పియుండుటయును యాగ క్రియాంగమున చేయుయజ్ఞంబులన్నియు మేకపశువులను బట్టిచేయుటయును జగత్ప్రసిద్ధమైయుండగా నైచ్యజంతువు లెట్లగును. ఇందువలన బట్టి తత్పాలితవృత్తి నైచ్యము గాదు. గాక మేకలపాలించుట అన్నివర్ణములకు పరమధర్మమని చెప్పియున్నది.

పరాశరస్మృతి ౧౨ అధ్యాయము, ౪౧ శ్లో॥

అరణింకృష్ణమార్జాలం । చందనం సుమణింఘృతం । తిలాం కృష్ణాజినంఛాగం గృహేచేతా నిరక్షయేత్ ॥

తా॥ అగ్ని నల్లపిల్లి శ్రీగంధం మణి నేయి నూవ్వులు జింకచర్మము మేక ప్రతిగృహామునందు రక్షింపబడ వలయుననియు చెప్పియున్నది మత్స్యపురాణం. ౧౫ అ 38 పుట.

శ్లో॥ అగ్నిష్వాంతు యమాభ్యాంతు కార్య మాప్యాయనం బుధైః । అగ్న్యభావేపివిప్రశ్య పాణావధజలేపివా ॥3౨॥ అజాకర్ణే శ్వాకర్ణేవా గోష్ఠేవాధ శివాంతికే । పిత్రాణాముత్తమంస్థానం దక్షిణాదిక్ప్రశస్యతే ॥33॥

తా॥ హోమము చేయుటకు అగ్ని లేమిని బ్రాహ్మణహస్తమునందేని జలమునందేని అజాకర్ణమునందేని (మేకచెవియందు) అశ్వకర్ణమునందేని ఆవులదొడ్డియందునేని శివసన్నిధినేని హోమము చేయుదగును.

మత్స్య ౧౬ అ.

శ్లో॥ యదిష్టసంక్షయేతద్వ ద్వన్యత్రాపినిగద్యతే పిండాస్తుగోజవిప్రేభ్యో దద్యాదగ్నౌ జలేపివా ॥

తా॥ శ్రాద్ధమునందుంచబడిన పిండములను బ్రాహ్మణులకుగాని, గోవులకుగాని, అజములకు, [మేకలకు] గాని యివ్వవలయును. లేక అగ్నియందుగాని, ఉదకమునందుగాని ఉంచవలయును. ఇట్లుచేయుటవలన విశేషశ్రేయము కలుగునని.

ఇట్లీగొల్లలనాక ముఖాలో కమందు అష్టాదశ వర్ణాధులకును మే కలను పాలించుట వృత్తిచే జీవించుట మనకెల్లర కనుభవసిద్ధమై యున్నదిగదా! నీచవృత్తి, అయినయడల బ్రాహ్మణాదులకు నీచ మునావలెను. కావున అజాపాలనవృత్తి కులాచారధర్మ విరుద్ధమై నీచవృత్తియని చెప్పరాదు.

ప్రశ్న:—— ఇప్పుడు గొల్లలన వృత్తినామముగల క్షత్రియుల కు మాంసభక్షణము దూషితమేలకాదు.

ఉ:—— మాంసభక్షణము క్షత్రియులకు విహితమైనట్లు అనే క ప్రమాణములుకలవు.

మనువచనం.

శ్లో॥ తిలైర్వ్రీహియవైర్మాషై రద్భిర్మూల ఫలేనవా। ద త్తేనమా సంప్రీయంతే విధివత్ పిత్రాతరోన్నృణాం। ద్వౌమాసౌమ త్స్య మాంసేన। త్రీన్మాసాన్ హారిణేనతు। ఔరభ్రేణాధ చతురశ్శా కు నేనే హపంచవై। షణ్మాసాన్ ఛాగమాంసేన పార్షతేనా థసప్తవై అష్టావైణే యమాంసేన రౌరవేణ నవైవతు। దశమాసాస్తు తృప్యం తివరాహా మహిషామిషైః। శశకూర్మయోస్తు మాంసేన మాసానే కా దశైవతు। సంవత్సరంతుగవ్యేన పయసా పాయసేనవా। వార్ధ్రీణ సస్య మాంసేన తృప్తిర్ద్వాదశవార్షకీ। కాలశాకం మహాశల్కం లోహామిషంమధు। అనంత్యాయైవ కల్పంతే। మున్యంన్నానిశసర్వ శ వార్ధ్రాణసోరక్తవర్ణచ్ఛాగః॥ తేషుక్తంవిష్ణు ధర్మోత్తరే త్రీణిస త్వింత్రియాణాం। యూధస్యాగ్రసరస్తథా। రక్తవర్ణంతు రాజేంద్ర, ఛాగంవార్ధ్రాణసంవిదుః॥ పక్షివిశేషోవా॥ కృష్ణగ్రీవా రక్తశిరశ్వ

తపస్థో విహంగమః । సపక్షైవా శ్రాద్ధానమః ప్రోక్తా । ఇత్యేషా వైదికీశ్రుతి రీతి నిగమవచనాత్ । కాలశాక ముత్తరదేశే ప్రశిద్ధం ॥ మహాశల్కో-మత్స్యవిశేషః ॥ ఖడ్గః । ఖడ్గమృగః । లోహిత-లోహిత వర్ణచ్ఛాగః । మున్యన్నానీ వారాద్యన్నాని ॥

ఇట్లు శ్రాద్ధాదులయందు మాంసాదు లుపయోగించవచ్చునని యేయున్నది.

మనుః.

శ్లో॥ రాజీవసింహతుండాశ్చ సశల్కాశ్చైవసర్వశః ॥

తా॥ పద్మవర్ణముగలిగిట్టియు సింహముఖము గలిగినట్టియు ముత్తెపుచిప్పవంటియు ఇట్టిమత్స్యములను శ్రాద్ధకాలమ లయందును ఇతరకాలములయందును భుజింపవచ్చునని యు॥

ఇట్లు శ్రాద్ధాదులయందును ఇతరకాలములయందును విహితమనియే చెప్పియున్నారు. ఒకవేళ్ళ మరియొకచోట నిషేధమని చెప్పినను అది ద్విజులనగాచో బ్రాహ్మణులకును వైశ్యులకును చెప్పియుండునుగాని క్షత్రియులకు చెప్పబడదు. యెందువల్లననగా క్షత్రియులు క్షాత్రవంతము గలవారుగనుక హింసాకర మాంసభక్షణాదోషము విధింపబడదు.

భారతం. అరణ్యపర్వం. వచనములోకొంత.

బుభుక్షాపీడ సహింపనోపక హిరణ్యపక్షంబులతోడను ముందరదిరుగుచున్న పక్షులంగని యవిభక్ష్యంబులగునని పక్షులంబట్టుకొన

పమకట్టి క్షత్రియుఁడగు నలచక్రవర్తి పక్షిమాంసము దిన ప్రయత్నిం చినటులను ॥

మనుచరిత్ర చతుర్థాశ్వాసం వచ-కొంత.

నిలింపాంగనాసుతుండు దుస్సహసమాగత చతురులవలన కృతపల లఫల మూలాది శుచమధుర మృగయోచ తాహారంబుల తృప్తి వహించ ॥

అని స్వారోచియను మనువు మాంసము భుజించినట్లును.

భాస్కరరామాయణము అరణ్యకాండ.

చ॥ బహుమృగ మాంసఖండములు పండులు దేనియ లిర్ఘ రఘురా। ద్వహునతి గోరు భూరుహాలతాను సువగాదులు దెచ్చియిచ్చుచుఁ । మిహిర సమాన తేజుడు సుమిత్రతనూజుడు గొల్వగాముదా । వహములయ్యెర్యొ దత్సమయ వాసరముల్ రఘువంశభర్తకుఁ ॥

క్షత్రియుఁడగు రాముఁడు తమ్మునిచే మాంసఖండములు దెప్పించుకొని భుజించెననియును.

భాస్కర రామాయణము ఆరణ్యమాంధకర్త్రి కథాభాగమ్ములో వచనములో కొంత ॥ కొన్నిప్వగల మృగమాంసంబు నిత్యంబు నాహారకృత్యంబులు దీర్చుచు అనిదాముఁడు నిత్యము మాంసము భుజించుచున్నటులను.

జైమినిభారతము తృతీయాశ్వాసం.

సీ॥ ధరియు భూచరఖేచర జలచరములు । వేరుగల్గమాంసఁ

ములునంజి ప్రియములోడ । రుక్మిణీసత్యభామ లిరువురునుగదిసి ।
తాళవృంతంబువిసరి త్రస్తరుచులుసేయ ॥

తా॥ క్షత్రియుడగు శ్రీకృష్ణుడు భూచరములగు మృగములును ఖేచరములగు పక్షులను జలచరములగు మత్స్యములను భక్షించిన టులను.

ఇందువలన క్షత్రియులు నిస్సంశయముగా మాంసము భుజించినటుల దృఢపడుచున్నది.

మఱియును భార- అను- చతు అ।

కం॥ పితృకార్య యజ్ఞముఖముల। శ్రుతచోదితహింసకీడు సారనేరదు విశ్రుతగుణ మాంసముచవిగో । రితినప్రాణి దెగటార్చుకిరియ బాపమగుఁ ॥

తా॥ పితృకార్యముల యందును యజ్ఞములయందును వేద హితములగు హింస కీడు కలుగజేయదనియును మాంసము రుచిగోరి తినిన ప్రాణహతియునెడ నెంతపాపమో యంతపాపము సంభవించుచున్నదని చెప్పబడియున్నది.

భార అను పం.

క॥ శ్రుతివిహింస హింసా । గతిదలపగ రాదుముని నికాయంబిది దు। ష్కృతతతిబాపెడు పరమసుకృతమని గొనియాడుగాన గీర్వాణనుతా ॥

తా॥ వేదములయందు జెప్పబడినహింస హింసకాదనియును

సర్వఋషులును వేదోక్తమైన జీవహింస సమస్తదోషములను బాప
గల ముఖ్యకార్యమని కొనియాడినట్లు పార్వతికి శివుడు చెప్పినటులను

భార అర ౯ ఆ.

సీ॥ అనఘయూశీనరుండగు శిబి నిజగాత్రహింస నింద్రాగ్ను
లకిడడెమాంస । మతనికి లేదయ్యె నయ్యుయుత్తమగతి రంతిదేవుండ
ను రాజుతొల్లి । యను దినంబును గోసహస్రద్వయంబును వధియిం
పడేవేయువత్సరములు । దురితమమ్మహితాత్ము దొడరెనే వేదార్థ
నిరతులై యత్యంతనియతులైన । ధారుణీసురముఖ్యుల ధ్వరముసంను
పశువువధియింపరేశిగ పరమపుణ్యా । గతు ల గలుగ వెవారికి గడగి
యగ్ను లధికమాంసార్థులని శ్రుతులందువినమే ॥

తా॥ శిబిచక్రవర్తి ఇంద్రాగ్నులకు తనశరీరంబోశి మాంస
ము పెట్టినంనున నతినికి యుత్తమగతి గలుగకుండెనాయనియు రంతీ
దేవుండను రాజు ప్రతిదినము రెండువేల గోవులప్రాప్తిని వేయుసం
వత్సరము లనేకగోవుల వధయించి యజ్ఞములుచేశి తత్శేషము భుజిం
చిన నారాజునకు దోషము సంభవించెనాయనియు వేదవిదులగుబ్రా
హ్మణులు మొదలగు ఘనులు యజ్ఞములయందు పశువులవధించిన
పుణ్యగతులు వారికి గలుగలేదాయనియు మృగవ్యాధుడు కౌశికున
కు వేదవిహితమగు హింస దోషాస్పదము కాదనిచెప్పినట్లు చెప్పె
యున్నది.

కం॥ పితృదైవత కార్యములం । దతిభక్తిని మాంసమిడుట
యుహార్హమనియుతి । తృప్తిపైదైవత శేషము స । న్మతిభోజ్యమ్మనియు
మునులమతముగాదే ॥

తా॥ పితృకార్యములను దైవకార్యము విశేష భక్తిచేత మాంసము పెట్టుటయును తత్పితృదైవత శేషములను భుజించుట యును మనుమతమనియు తత్పరమైన హింసకాదాయనిన ॥

మ॥ హలికుండెంతయు నూజ దున్ననెడ శీరాగ్రంబునం బొంది ప్రా । ణులనేకంబులు జచ్చుహింసయది యానూకాదో వే యేల మ । ర్త్యులు నేలంజరించుచో పదములంద్రొక్కంబడు స్వేచ్ఛా జం । తులదాహింసయు గాదసంగ వశమేదోషజ్ఞ యూహింపుమా ॥

చ॥ సలిలము లుర్వియాకసము సర్వము జంతుమయంబు గావునన్ । గలుగనవశ్యమున్ సకలకర్మములందును హింస హింస కున్ । దొలగినదేహయాత్రకును దుర్ఘటమైనటులుండు నంతయున్। దలపకు హింసజేయమని తాపచరింతురు కొందరిమ్మహిన్॥

గీ॥ హింసజేయనివాడు లేడీజ్జగమున । నొక్కడైనను దమ తమ యోపినట్లు । హింస తెరవున కెడగల్గయేగవలయు । నదియొ జూవె యహింసనాయతిశయిల్లు ॥

ఇచ్చట మూడుపద్యములకు ఒకటేతాత్పర్యం.

భూమిదున్ననెడ హలాగ్రమునను ప్రజలునడుచునెడ పాద ములక్రిందబడియును సకలకర్మముల యందంతటను వ్యాపించియు న్న జంతువులకు హింసకలుగుననియును యీజగంబున హింసజేయ నివాడు లేడనియును వీలైనంతమట్టుకుతొలగినటించుటయు హింసయ నియును ధర్మవ్యాధుడు చెప్పబడియున్నాడు.

క॥ ఫలములు నోషధిశాకం । బులు పశుమృగతతులు భ క్ష్యములుగా భూతం । బులకజుడు జేసెననియ । స్ఖలితంబుగ వేద్ యుసుతులు గాదనవశమే ॥

తా॥ ఫలములును, ఓషధులును, పశువులును, మృగములు ను భూతములకు దినుపదార్థములుగా బ్రహ్మనిర్మించినట్లు వేద ములు జెప్పుచున్నవని మృగవ్యాధుడు కౌశికునకు జెప్పుటనుబట్టియు ను క్షత్రియులకు యవి భక్ష్యనీయంబులగుటచే నింద్యంబులుగావు; పరభంజనులగుటచే హింసయునులేదు. యిదిగాక పరంపరా యీయా దువంశ్యులగు కృష్ణాదులు యంగీకరించిన ధర్మమంగీకరింపవలసినదే గదా. ఇందుకుప్రమాణం.

యఙ్ఞాజీయము.

శ్లో॥ పారంపర్యాగతం ధర్మం యోనరస్త్యక్తు మర్హతి॥

తా॥ పరంపరావచ్చుధర్మము నంగీకరింపతగినది.

యదువంశ మండనుండగు శ్రీకృష్ణుడాచరించిన ధర్మనవలం బించుట సిష్టాచారముకాదు.

స్మృతిరత్నాకరము-ర పేజి.

శ్లో॥ శ్రుతిస్మృతి విహితోధర్మః తదలాభేశిష్టాచార ప్ర మాణమితి ॥ వసిష్టస్మరణాత్ ॥

తా॥ ధర్మము శ్రుతివిహితమైనది. అట్టిధర్మములభించని సమయమందు శిష్టాచారము ప్రమాణముఅని వశిష్టులవారు చెప్పిరి.

ఆపస్తంభ సూత్రమందు.

యదావై షాంకులంధర్మస్స్యాత్ ॥

తా॥ కులధర్మమును విడువరాదు.

ఇదిగాక యీలోకమందు క్షత్రియులందరు మాంసము సాధారణము భుజించుటయును కల్గియుండుటచే లోకాచారముకూడా ఒప్పుకొనతగినదే యెట్లనగా.

విజ్ఞానేశ్వరీయము. ఆచారకాండ.

కం॥ కులదేశాచారంబులు । తనకొనిజేయంగవలయు తమకులదేశం । బులు నెందుజెల్లుగావున । నలయకయది విహితకర్మమని రాచార్యుల్ ॥

భారతం. ఆర- ౫ ఆశ్వా.

కం॥ ఒప్పెడునదియైననుగడు । నొప్పనియదియైన నిజకులోచితపథముల్ । దప్పదగదండ్రధార్మికు । లప్పని నిజభాగ్యవిహితమని యెంచదగన్ ॥

తా॥ ఒప్పెడినదియైనను ఒప్పనిదైనను స్వకులాచారమార్గము అనగా పరంపరావచ్చు విధిని దప్పింపరాదనియు అప్పని స్వభాగ్యానుకూలమని చెప్పియుండుటచే తత్ప్రకారమే పూర్వము శ్రీకృష్ణాదులు మాంసభక్షణము నిషేధింపకుండుటచేతను లోకమందుసాధారణముగా క్షత్రియులు భుజించుచుండుటచేతను యిప్పుడును భుజించిన దూష్యముకాదు.

పరీక్ష. భారత-ఆది-3 ఆ॥ గీ॥ మొదలిపెక్కుజన్నముల పుణ్యకర్మములు। పరగపెక్కు జేసి పడయు బడినయట్టి జనులకెల్లన తుణ మాత్రిన జెరుచు మద్యసేవజేయునగునే ॥

క॥ భూసురులాదిగగలజను। లీసురసేవించిరేని యిది మొదలు గబా। పానక్తి పతితులగుదురు చేసితిమర్యాద దీనిజేకొనుడుజనుల్,

వృద్ధహారీతసంహిత-౬ అధ్యాయం.

సురావై మలమన్నానాం। పాపాన్మమలముచ్యతే। తస్మాద్బ్రాహ్మణరాజన్యౌ। వైశ్యస్య నసురాంపిబేత్ ॥

ఇట్లు క్షత్రియాదులకు సురాపాన నిషేధము చెప్పియుండగా యీలోకమందు కొందరు యనువంశక్షత్రియులలో మధుపానమంగీకరింతురే వారేలదూషితులుకారు.

ఉ॥ హరివంశము-పూర్వ ॥ 5 ఆశ్వాసము.

సీ॥ నాదేహముతోతుల్యమైనదేనునవమేఘ కాంతినొప్పారసంకర్షణునకు। నెనయైన వదనపూర్ణేందువు శోభిల్లనెనిమిది బాహువు లెసగశార్ఙ్గ। చక్రగదాఖడ్గ జలరుహామధుపాత్రి ముసలశూలముల నల్లసితములుగ। నుజ్జ్వలహారకేయూరాది దివ్యభూషణగంధ మాల్యవిస్ఫారలీల। నీలకౌశేయ వసనయై నిఖిల సిద్ధగణముపూజింప దివికేగగలవునిన్ను। నెమురువచ్చి దోడ్కొనిపోయియుంద్రుడెలమి। నాదిశక్తి గనభిషేక మాచరించు ॥

తా॥ నాశరీరముతో సమానమైన సల్లనిశరీరమును చంద్రా

ననమును యెనిమిదిహస్తములును శార్ఙ్గము, చక్రము, గదా, ఖడ్గము, కమలము, మధుపాత్ర, ముసలము, శూలము, యీయెన్మిదిచేతుల ధరించి దివ్యభూషణ గంధమాల్యాదులతో నీలివస్త్రమును దాల్చి దివికేగిన యిందుశ్రీమద్దేవీ యోగమాయాదిశక్తి వనిపూజించుననియు నారాయణుండగు తాను యదువంశంబున నుద్భవించెదనని చెప్పినట్లును యశోదగర్భమందు నాయమజన్మించి పూర్వపరికాగంబున దివికేగినట్లును అప్పుడు తనవంశంబులచే తన తోబుట్టువగు యాదిశక్తిని గొల్చునట్లుజేయుదునని చెప్పినట్లు భాగవతాదిగ్రంధములయందు జెప్పియున్నది గనుక మధుపాత్రతో వచ్చినదవుటచే తచ్ఛక్తినిగొల్చువారందరు తత్ప్రీతికరంబగు మధువునర్పించి పానంబుజేయుట నింద్యంబుగాదు. మరియు మధుపాత్రయనునప్పుడు అమృతకలశమనగూడదాయనిన యీలోకమున శక్తి గొలుచువారందరు కల్లు సారాయి యుపయోగించుట ప్రశస్తమైయుండగా నట్లర్ధము చేయుటలెట్లు ॥

భాగ, ఏకా, వచనము.

అనిన రాజునకు శుకుండిట్లనియే । నట్లు వాసుదేవుడన్యాయప్రవర్తనులగు దుష్టులనంహరించి న్యాయప్రవర్తనులగు శిష్టజనపాలనంబొనర్చి బలరామసమేతంబుగా ద్వారకానగరంబు వెడలినంగని యాదవులు తమలోదాము మదిరాపానమత్తులై మాత్సర్యంబుల నన్యోన్యాకలహంబులకుం గమకించి కలితురగరథాది బలములతో ననగ్రహా...ధసన్నద్ధులై ॥ అని నును.

భాగ- తృతీ

ఉ॥ మానినవసుతేగడేగ యదుగు ఖ్యాలు మూకలుగూడి ము

ట్టబు । ల్కొన గనలొందివారు తమకించి శపించిన కొన్నిమానవుల్। జనునెడ దైవయోగమున జాతర బోసమకట్టివేడుకన్ । మునమును ద్రొంగలింప గరిమన్నిజయానము లెక్కి యాదవుల్ ॥

అనిచెప్పియుండుటచేత యదువంశక్షత్రియులందు శక్తినిగొలుచుటకు నదీతీరమునకునేగి కల్లుద్రావి మత్సరంబు గలిగించుకొని తమలోదాము యుద్ధముచేసినట్లు చెప్పియున్నది.

భాగ- ద- పూర్వ.

క॥ నానావిధసంపదలకు । దానకమైనసర్వకామ దాయినివగునిన్ । మానవులు భక్తిగొలుతురు । కానుకలును బలులునిచ్చి కల్యాణముగా ॥

వచనం॥ మరియు నిన్నుమానవులు దుర్గా, భద్రకాళి, విజయా, వైష్ణవీ, కుముదా, చండికా, కృష్ణా, మాధవీ, కన్యకా, మాయా, నారాయణీ, యీశానా, అంబికా, శారదా, అను పదునాలుగు నామంబుల నాయాస్థానంబులయందు గొల్తురని యెరిగించి సర్వేశ్వరుండగుహరి పొమ్మని యానతిచ్చిన మహాప్రసాదంబని యయోగనిద్రాయియ్యకొని క్రమ్మెకి చయ్యన నియ్యాల బాసివచ్చిన ॥

కం॥ మహనీయ గుణాస్పదమై । మహిలోనాదేవి జనులు మన్నింపగా । బహునామ నివాసంబుల । బహునామంబుల జరించె భద్రాత్మికమై ॥

ఈయదువంశ్యులగు రాజులు యీశక్తి తమవంశంబున జనియించుటచేతను శ్రీకృష్ణుని తోబుట్టువనియును శ్రీకృష్ణాజ్ఞోల్లంఘనం

ఖాపాదింపకుండునటుల తప్పక యిప్పటివరకు తద్దేవతా ప్రీతికరంబగు మధుమాంసంబుల నర్పించుచు తాము నంగీకరించుచుండిరి. గాక.

భార- విరాట.

క॥ ఒదవెడు తృష వెల్లిదమున । వదనము వరువట్టు వట్ట వాసితరాజక । మదిరారసమానగనా । హృదయంబున వేడ్క మెనగ మెసగెడు తరుణీ ॥

అధిక దాహవ్యధచే వదనము వాడుచూచెవదని యు మదిరారసము అనగా కల్లును తెమ్మనుమని తనదాసిగానుండు సైరంధ్రియను ద్రౌపతినిగూర్చి విరాట్రాజు మహిషియగు సుధేష్ణబల్కినట్లును.

ఆంధ్రనామసంగ్రహము.

గీ॥ నల్లవలువదాల్పు నల్లని మైదంట వెన్నదొంగయన్న వెట్టినీళ్ళ । మేలువాడు దుక్కి వాలుదాలుపు తాటి । పడగవాడనంగ బలభద్రా ॥

వెట్టినీళ్ళమేలు వాడని బలరామునకు నామము గలదు గనుక చంద్రవంశజులయిన విరాట్రాజు బలరాముడు మొదలన్న క్షత్రియులు మధుపానము నింద్యముగాదలంపక నంగీకరించిరని తెలియవలెను.

శుక్రశాపమును గురించి మీరుకనుపర్చిన పద్యములతాత్పర్యము. అనేకయజ్ఞములాచరించి పొందబడిన సుకృతమెట్టువంటివారికైన క్షణములో చెరచదగిన యీకల్లుద్రావు టుచితము కాదని యు యికనుంచి బ్రాహ్మణులాదిగాగల జనులు మదిరాపానము చేసిన పతితులయ్యెదరని యు నేచేసిననియమము సకలజనులు చేకొనుడని యు

శుక్రాచార్యుడిట్లు దోషనిరూపణచేశినట్లు చెప్పియున్నది. (అందు నబట్టి విచారింపగా మద్యపానని సేధము వేదములయందు చెప్పి యున్నదా లేదాయని విచారము. వేదములయందు నిషేధింపబడినయెడల భూసురశ్రేష్ఠుడైన శుక్రాచారు డెట్లుదానినంగీకరించె. అప్పటికాయన ధర్మముతప్పినాడనిన వేదభాహ్యుడుకావలెను వేదబాహ్యుడనిన అట్టివారివలన నీయబడినశాపము వేదోక్తాచరులెట్లువిశ్వశింపవచ్చును అనేకజన్మములయందు నార్జించిన పుణ్యముననశింపజేయగల యీమధ్యపాన సేవజేయనగునేయని తనకుతానిందించుకొనినట్లు తెలియవచ్చుచున్నది. అందునబట్టి బహుయజ్ఞఫలము ఒకబ్రాహ్మణహింసచే నశించునుగనుక యీమద్యపానమునునుగదా కచునను బ్రాహ్మణహింస నావల్ల వాటిల్లెననిశకించుకొనియెను. కావున వేదములయందు సురాపానము నిషేధింపబడనట్లుతోచుచున్నది. అయితే శుక్రశాపమునాటినుండియు మద్యము దోషాకారమైనదనిన శాపానంతర ముద్భవించినట్టియు వేదోక్తప్రవర్తకులయిన బలరామాదియదువులు విరాటాదిజు మొదలయిన చంద్రవంశ క్షత్రియులెట్లంగీకరించిరి ॥ గాన యీశ్లోకమందు.

తదోత్తర ఊర్ణవిక్రయ సీధుపాన ముభయతో తద్వ్యర్వ్యవహార ఆయుధీయ కంసముద్రయానమితి ॥ ఉత్తరదేశీయులలో మధ్యపానము సర్వత్రాకలుగుచున్నట్లు బోధాయనులవారుచెప్పుచున్నారు. ఇప్పుడు సర్వదేశీయములలోను సర్వులు బ్రాంది గంజాయి నల్లమందు మధువు మొదలయిన మత్తువస్తువులంగీకరించుచునే యున్నారు శాక్తేయ వైష్ణవాది మతములుగల వారందరునిరభ్యంతరముగా నంగీకరించుచున్నారు సురాపానము బ్రహ్మహత్యాది మహాపా

తకమలలోచేరిన గదాయనిన మాంసముగురించిచెప్పిన క్రిందటిప్రశ్నజవాబులో వ్రాసినప్రకారము లోకాచారము దేశాచారము కులాచారముకు పూర్వాచార శిష్టాచారములచే యిప్పటి క్షత్రియులు కొందరట్లాచరించినను నిర్దోషులనబడుచున్నారు.

వృద్ధపారాశరస్మృతి, ౨౧ శ్లో॥

బ్రాహ్మణాదిషు సూద్రస్య । పచనాదిపరిక్రియః । భృగ్వగ్ని మరణశ్చైవప్రాయశ్చిత్త విధానకం॥

ప్రశ్న:— గొల్లలను వృత్తినామముగల చంద్రవంశక్షత్రియులు శూద్రపాకము భుజించుటనుబట్టి వీరినిశూద్రులని యేల చెప్పకూడదు.

ఉ:— శూద్రపాకము చంద్రవంశక్షత్రియులు పూర్వము భుజించియున్నారు.

విరాట్పర్వము, ప్రథమ ఆ॥

శా॥ దేవా నాలవ జాతివాడ నిను సర్థిన్ గొల్వగావచ్చితి। న్నే వాదక్షత యొంతుమైె యెఱుగ నీచిత్తంబునన్ మెచ్చు న। ట్లే వండన్గడు నేతురన్ బానసము నం దిచ్చోటనే కాదు న। న్నేవీటన్ మిగులంగనెవ్వరును లేరేభంగులన్ జూచినన్॥

టీ॥ దేవానాలవజాతివాడ అనగా శూద్రుడను నిన్నుకొలుచుటకై యేతెంచినాడ సితరసేవలు యేమియు నెఱుగను నీమనస్సుకనుకూలముగునట్లు వంటకములు చేయుగలను యిక్కడనేగాక నెక్కడనేని

నాకంటెయెక్కువగా వంటకము చేయువారులేరు అని భీముడువిరా
టారాజుతో ఆడినట్లును ఇందునుబట్టి విరాట్రాజు చంద్రవంశక్షత్రియుడ
య్యును శూద్రాన్నంబుభుజియించుటవలన నింద్యముకాదు. భీముడు
రాజేకదా యనిన ఆసంగతివిరాట్రాజునకు తెలియదుకదా నాలవజాతి
వానిపాకము భుజించుట కర్తవ్యమగుటచేత ఒప్పుకొనియెను.

భార, ఆర, ద్వి, వ ॥

మరియు బాహుకుండను నామంబుతో సూతవృత్తినుండుమ
ని కర్కోటకుం డదృశ్యుండైన

కర్మవశముచే ఋతుపర్ణుడను రాజగృహమున నలచక్రవర్తి
ప్రచ్ఛన్నశరీరత్వము వహించి సుబాహునామంబున వంటలవాడా
యెననియును.

భార, ఆర. ద్వి.

సీ॥ వినవమ్మ తృణముష్టి గొనివాడు వైచిన సందగ్ని యుదయిం
చి యుండువంట । లమరిన నంతకు నింధనము లపేక్షింపక యుడుగక
మండుచు నుండుమరియు। గడకతో సంజుళ్ళ గడుగంగసమకట్టి జల
మపేక్షించుడు సంభవిల్లి । కుంభముల్ నిండి దివ్యాంభప్రవాహ మ
క్షయమగుచుండ నాక్షణముచూడ। నతనికరతలప్వ్రయో వర్తితములై
కందియును మహా సుగంధకుసుమ । తతులు తొంటియట్ల తమకంబువి
డవక । యుండు నీతని తేజమున్నతంబు ॥

వ॥ అనవిని దమయంతి వెండియు కేశినిబిలిచి బాహుకువం
డిన నంజుళ్ళుదెప్పించి యాస్వాదించి బాహుకునందు నలుని లక్షణం
బులుండుటెరింగి ॥

ఇట్లు భారతమందు చెప్పియుండుటచే క్షత్రియుడగు నలచక్రవర్తి భీమ నివలె ప్రచ్ఛన్న వేషములో వంటకములుచేయుటయు ఋతుపర్ణుడు మొదలయినరాజులు భుజించుటయు కలిగియున్నది.

నిర్ణయసింధౌ 3 అధ్యా॥ శ్రాద్ధనిర్ణయ పేజి. పరాశరః।
శ్లో॥ తావద్భవతి శూద్రాన్నం। యావన్నస్పృశతిద్విజః। ద్విజాతికర సంస్పృష్టంసర్వంతదన్నం విరుధ్యతే ॥

విష్ణుపురాణే.

శ్లో॥ సంప్రోక్షితత్వా గృహీత్వాయా శూద్రాన్నం గృహమాగతం ॥

అంగిరాః ॥

శ్లో॥ పాత్రాంతరగతం గ్రాహ్యం।దుగ్ధంస్వగృహమాగతం

తా॥ శూద్రాన్న మెంతవరకు అంతవరకు శూద్రాన్నమగుచున్నది. ద్విజునిహస్తముచేత స్పృశింపబడినదంతయు గ్రాహ్యము. తనగృహమునకువచ్చిన శూద్రాన్నము ద్విజుడుప్రోక్షించి భుజింపవచ్చును. తనయింటికి దెచ్చిన శూద్రసంబంధమైన దేదియును మరియొకపాత్రయందుంచుటచే గ్రాహ్యనీయంబు అనగా శూద్రపాత్రతో గ్రహింపగూడదనుట.

ఇట్లు శూద్రాన్నము స్పృశివగాత్రన ప్రోక్షణమాత్రమున పాత్రాంతరమున భుజింపవచ్చునని చెప్పియున్నాడుగాన యేతత్క్రియావిహీనము భుజించుటయే వలనుపడదు. కావున శూద్రాన్న భుక్తినలనః ద్విజులగు చంద్రవంశ క్షత్రియుల కేయాక్షేపణయు లేదు.

సంధ్యాచయజ్ఞసూత్రంచ । భవేల్లుప్తం ససంశయః ॥౨౩॥ మ్లేచ్ఛా చార భవిష్యంతి । వర్ణాచత్వా రపవచ । మ్లేచ్ఛశాస్త్ర పఠిష్యంతి స్వశాస్త్రాణి విహాయచ ॥౨౪॥ బ్రహ్మక్షత్ర విశాంవంశా శూద్రా ణానాం శేవకాకళా । సూపకారా ధావకాశ్చ వృషవాహాశ్చ సర్వ సః ॥ తాత్పర్యము.

బ్రహ్మక్షత్రియ వైశ్యులు జాతిధర్మవిహీనులై సంధ్యయ సూత్రములు వదలి శూద్రతుల్యు లగుదురు. ॥౨౩॥ చాతుర్వర్ణ్యము లు మ్లేచ్ఛాచారులై తమశాస్త్రములు వదలి మ్లేచ్ఛశాస్త్రములు చ దువుదురు. కలియుగమున బ్రహ్మ క్షత్ర్య వైశ్యులు శూద్రసేవా రతులయివంటవాండ్లుగాను పరిచారకులుగాను వృషాద్యాదికర్మలను కూలికి చేయువారలగుదురు.

దేవీభాగవతము నవమస్కందే అష్టమోధ్యాయః ॥

బ్రహ్మక్షత్ర్య విశాంవంశాః । భవిష్యంతి సపాపినః॥ ౪౫॥ అన్నానాంని యమోనాస్తి । యోనీనాంచ విశేషతః । ఆశ్రమాణాం జనానాంచ సర్వేమ్లేచ్ఛా కలాయుగే ॥

తా॥ బ్రహ్మ క్షత్ర్య వైశ్యవంశములు పాపములు గలవిగ న గుచున్నవి ॥ ౪౫॥ ఇంకసర్వజనులు కలియుగమందు విశేషముగ అ న్న నియమము యోని నియమము ఆశ్రమ నియమము లేక మ్లేచ్ఛు లగుచున్నారు.

ద్విజులగు బ్రహ్మక్షత్ర్య వైశ్యులందరికి యిట్లుచెప్పియుండ గా యీచంద్రవంశ క్షత్రియులనే వ్రాత్యాదిదోషములు కించన్మా

త్రుల జేయుటెట్లు (యిదియుగధర్మము) యుగప్రయుక్తమున వేద విహితకర్మలయందును స్వకుల వృత్తులయందును నియమములు తప్పి భ్రష్టులయ్యెదరని చెప్పియున్నారు. ఇదియుగాక వర్ణాశ్రమాచారాదిక ధర్మములు తప్పకుండా పరిపాలనము చేయు యుత్తమక్షత్రియు ల పాలనకుదొలగి దేశమంతయు మ్లేచ్ఛాదిక యితర వర్ణాధీనమగుట చే వేదోక్తమయిన సకలధర్మములు నానాటి కడుగంటి ప్రమాదవశమున ద్విజులు కర్మభ్రష్టులయిరి. గాక యీచంద్రవంశ క్షత్రియు లకు పశుపాలనము సంభవించిన విద్యావిహీనముచే స్వకులోచితధర్మ ములు దెలియక భ్రమనొందిరి.

పరాశరస్మృతి, ఆచారకాండ॥

యుగే యుగేచ యేధర్మా స్తత్రతత్రచ యేద్విజాః । తేషాం నిందా నకర్తవ్యా యుగరూపాహి తేద్విజాః ॥

తా॥ యుగప్రయుక్తమయిన ధర్మమును నవరింపనలవికాదు కావున ధర్మలోపమునుగురించి ద్విజులను నిందింపరాదు.

ఇట్టియుగప్రయుక్తమగునట్టియు యుగప్రయుక్తాంతర్భూతమ యిన భ్రమప్రమాదులవలన సంభవించినట్టి యీక్షత్రియులకుగల కర్మలోపమునుగురించి నిందార్హులుకారు. ఇదియునుగాక గో పరిపాలనముచే సంభవించిన ఉపనయన విహీనవ్రాత్యదోషము వీరి యందెంత మాత్రమనుపయోగమెట్లన్న. యదువంశసంభవులగు క్షత్రియులకు గోపాలనవృత్తి పరమధర్మమని యును తన్మహిమాతిశే షమును ప్రశ్నరూపముగా మీకెరిగించియె యున్నాను అయితే

ఉపనయన సంధ్యావందనములు సకలపాపములను హరించి స్వర్గభోగము లనుభవింపజేయుటకై గదా ॥

విజ్ఞానేశ్వరీయం, ప్రాయశ్చిత్తకాండ.

క॥ దేవసమూహంబెల్లను । గోవృశరీరంబునందు గొనకొని యుండుట । గావున గోవుమహాత్మ్యము । భావింపగరాదు నిజము బ్రహ్మకునైనన్ ॥

సర్వదోషహరమై స్వర్గాదిభోగములు గోపరిపాలనవలన నిరభ్యంతరముగా కలుగునని చెప్పబడున్నది. వేదస్వరూపమైన గోవును పాలించడము, వేదధర్మ పరిపాలనముకాదా? ఉపనయనాది వేదోక్త కర్మములనాచరింపనివారిసిగా నీచండ్రనంకత్రియుల నెన్నించవచ్చును. ఇది యటుండగాక.

మనుస్మృతి. ౪ అధ్యాయము,

శ్లో॥ ఏనాస్యపితరోయాతాః । యేనయాతాః పితామహాః । తేనయాయాత్సతాంమార్గం । తేనగచ్ఛన్నరిష్యతే ॥

తా॥ పెద్దలేధర్మమునవడిచిరో యాధర్మమార్గమును ననువదగినది.

విష్ణుస్మృతి.

శ్లో॥ శాఖాంపుండ్రంచ సూత్రంచ । సమయాచారమేవచ । పూర్వైరాచరితం కుర్యాదన్యథాపతితోభవేత్ ॥

తా॥ శాఖాపుండ్రము సూత్రము సమయాచారము పూర్వ

లచే నాచరింపబడినదే యాచరింపదగును.

ఎల్లాజీయము.

పారంపర్యాగతంధర్మం । యోనరస్త్యక్తుమర్హతి ॥

పరంపరా ధర్మము నంగీకరింపదగినది.

యీయదువంశ క్షత్రియులయందు కొందరు చాలాకాలము నుంచి పరంపరా ఉపనయన విహీనులై యుండుటనుబట్టి యిప్పటివారికి పూర్వాచార మయియున్నందునను పైప్రమాణములచే పూర్వాచారము విహితమైనందును.

మత్స్యపురాణము ౧౪౩ అధ్యాయం.

శ్లో॥ తధాకలియుగస్యాంతే। శూద్రభూతాః ప్రజాస్తధా। బ్రహ్మ క్షత్ర విశశ్శూద్రాః బీజార్థేయ ఇహస్మృతాః ॥

తా॥ కలియుగాంతమందు ప్రజలు శూద్రతుల్యులగుదురు బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్రులు కలియుగమునందు భీజభూతులగ నుండి మరల కృతయుగమున వార లసమానులగుదురు.

ధర్మలోపముననే వర్ణలోపము కలిగినయడల కలియుగాంతమందు సర్వకర్మభ్రష్టులైన శూద్రతుల్యులగు ద్విజులు మరలకృతయుగమునందెల్ల ద్విజులగుదురు. కావున వ్రాత్యదోషమున కాకరులు కారు. శూద్రులనరాదు.

ప్రశ్న:— అట్లయిన యీయదువంశక్షత్రియులకు గతించిన వేదోక్తోపనయనాదులు పునస్థాపన చేయవచ్చునా.

ఉ:—చేయనచ్చును, ప్రమాదవశంబున లోపించిన కర్మలను పునరోద్ధారణ చేయుటకై గదా? ధర్మశాస్త్రములయందు ప్రాయశ్చిత్తకాండ నిర్ణయింపబడెను. యీకలియుగమందు బహుదినములనాటినుండియు వైశ్యులు వేదోక్తకర్మలను కొన్నికారణములచే పురాణోక్తముగా నాచరించుచున్న మధ్యకాలములో కొందరుత్తమపురుషుల శిద్ధాంత ప్రకటనచే తిరిగి సంస్థాపింపబడి యిప్పుడు వైశ్యులు వేదోక్తముగా నడున నారంభించుచున్నారు. యిప్పటికి కొందరు పూర్వాచారమైన పురాణోక్తమును విడువజాలక యున్నారు. ఇందుకు వైశ్యప్రకాశికయును వైశ్యకుల దీపికయును చూచుకొనునది.

చంద్రవంశ క్షత్రియులలోకూడా యదువంశ క్షత్రియుడగు శివాజియును మహారాష్ట్ర దేశీయుడు తురుష్క ప్రభువులచే యడుగంటిపోయిన హిందూమత ధర్మముచు పునరుద్ధారణ చేయుటకై దక్షిణమహారాష్ట్రము మొదలయిన దేశములు జయించి వీరాపూరురాజ్యములోని రాయనగరదుర్గము రాజధానిగా నియమించి హిందూధర్మశాస్త్ర ప్రకారము పట్టాభిషేక మొందదలంచిన ఉపనయనాదులులేని హేతువచే అచ్చటిపెద్దలు క్షత్రియుడో కాడోయని సంశయించిన నతడు క్షత్రియుడైనసంగతి స్వగ్రామమైన వుదయపురమునసున్న వంశవృక్షముదెప్పించి క్షత్రియవంశమును సిద్ధాంతీకరించిరి. శాస్త్రోక్తముగా ఉపనయన విహీనమునకు వ్రాత్యస్తోమ యజ్ఞమును చేయించి పిమ్మట ఉపనయనముచేసి క్రీస్తుశకము 1674 సం॥ జూన్ ది 6 తారీఖునకు సరియగు నందననామ సం॥ జ్యేష్ట శు ౧౩ గురువారము శివాజికి పట్టాభిషేక మొనర్చిరి. ఇదియంతయు

శివాజీచరిత్ర చూచిన తెలియగలదు. కావున ధర్మలోపమున కెన్ని నాళ్ళకైనను సవరణకలదు.

ప్రశ్న:--- యిప్పుడుకొందరు గొల్లలను వృత్తినామముగల క్షత్రియులు మేకలనుపాలించుటయే వృత్తిగాగలిగియున్నారు. అది కులాచారధర్మ విరుద్ధమగుటను నీచవృత్తిగా నేలభావింపకూడదు.

ఉ:--- మేషములను పాలించువృత్తి నీచమనిచెప్పుటకు మేషములు నీచజంతువులు ఆయిననుగదా? తత్పాలితవృత్తి నీచముగావలెను. యీలోకమందు సర్వజన భక్షణీయమును సర్వజనోపయుక్తమును స్వర్గాపవర్గఫలంబు లిచ్చునవియునై యజ్ఞపశువులనఁ బరగిన యీపశువులను నీచజంతువులుగా నూహింపరాదు. యజ్ఞార్హతకలిగిన చతుష్పాత్ జంతువులలో ముఖ్యత్వ ప్రమాణములు కలవు.

యజుర్వేదం॥ జ్యోతిష్టోమాదిక్రతునాం దేవతాహవిరర్థం పశ్వాలంబనంముఖ్యం । కుతః । ఇమంపశుంపశుపతేతే అద్యబధ్నామి యుత్సర్గాయమకతిః । నానాప్రాణో యజమానస్యపశునేతి । ఇత్యాదిబహుశ్రుతి పర్యాలోచన యూపశోః । వపాపీంపి దేవానామత్యంత ప్రియతమాని కించపశుశ్బద్భశ్య సర్వేషాం చతుష్పాద్జంతూనాంఛాగస్య ముఖ్యత్వంకథం । ఛాగస్య వపాయా మేధసానూబ్రూహి। ఛాగోసి మమభోగాయ భవమేషోసి మమభాగాయభవ ॥ అజేనాగ్నిష్టోమఃయ్యేనేతి ॥ ఇత్యాదిస్మృతి శ్రుతిరీత్యా పశూనాంఛాగస్య ముఖ్యత్వాత్ జ్యోతిష్టోమాదిషు సామాన్యేన ఛాగపశురేవ॥ ఇతి సంక్షేపణంలిఖ్యం ॥

ఇట్లు జ్యోతిష్టోమాది యజ్ఞములకు మేషపశువుయె ముఖ్యమనియు దేవప్రీతికరమగునని యనేకప్రమాణములు వేదమునందు ప్రసిద్ధమైయున్నది.

సీతారామాంజనేయం॥ మ॥ ఉరురాగాది గుణాజసంఘమును నాద్యోంకార మంత్రంబుచేత రయంబార వధించి యాత్మవిష యేచ్ఛ శ్రేణితోగూడిచె। చ్చెరనానా విధవాసనాజ్యములతో చిద్వహ్నిమధ్యంబునన్। వరుసంవ్రేలిచి సౌఖ్యసోమరస పానంబింత గావింపుమా॥

తా॥ రాగాదులను మేకలను ఓంకారమంత్రముచేత విశసించి విషయ సమిధలచే వాసనలనేంయితో చిదగ్నియందు వ్రేల్చి బ్రహ్మానంద సోమపాన మొనరవలసినదిగా బాహ్యాయజ్ఞవిధిని ఆత్మయజ్ఞముగా నిరూపించి చెప్పియున్నది.

వేమనశతకం॥ గీ॥ పేరుసోమయాజి పెనుహింసాబలుడయా। మేకపోతుబట్టి మెడలువిరచు। గాకగ్రతువువంక గలుగునామోక్షంబు। విశ్వదాభిరామ వినురవేమ॥

ఇట్లు మేక పశువులు గోవులవలెనె యజ్ఞార్హతగలవిగా యనేకప్రమాణంబులు వేదాదులయందు జెప్పిబోయుంచుటయును యీకలియుగమున చేయుయజ్ఞంబులన్నియు మేకపశువులను బట్టిచేయుటలును జగత్ప్రసిద్ధమైయుండగా నైచ్యజంతువు లెట్లగును. ఇందునబట్టి తత్పాలితవృత్తి నైచ్యముగాదు. గాక మేకలపాలించుట అన్నివర్ణములకు పరమధర్మమని చెప్పియున్నది.

పరాశరస్మృతి ౧౨ అధ్యాయం, ౪౧ శ్లో॥

అరణింకృష్ణమార్జాలం । చందనం సుమణింఘృతం । తిలాం కృష్ణాజినంఛాగం గృహేచేతా నిరక్షయేత్ ॥

తా॥ అగ్ని నల్లపిల్లి శ్రీగంధం మణి నేయి నూవ్వులు జింకచర్మము మేక ప్రతిగృహామునందు రక్షింపబడ వలయుననియు చెప్పియున్నది

మత్స్యపురాణం. ౧౫ అ 38 పుట.

శ్లో॥ అగ్నిష్వాంతు యమాభ్యాంతు కార్య మాప్యాయనం బుధైః । అగ్న్యభావేపివిప్రశ్య పాణావధజలేపివా ॥3౨॥ అజాకర్ణే శ్వకర్ణేవా గోష్టేవాధ శివాంతికే । పిత్ర్యాణాముత్తమంస్థానం దక్షిణాదిక్ప్రశస్యతె ॥33॥

తా॥ హోమము చేయుటకు అగ్ని లేమిని బ్రాహ్మణహస్తమునందేని జలమునందేని అజాకర్ణమునందేని (మేకచెవియందు) అశ్వకర్ణమునందేని ఆవులదొడ్డియందునేని శివసన్నిధినేని హోమము చేయదగును.

మత్స్య ౧౬ అ.

శ్లో॥ యదేష్టసంక్షయేతద్వ దన్యత్రాపినిగద్యతే పిండాస్తుగోజ విప్రేభ్యో దద్యాదగ్నౌ జలేపివా ॥

తా॥ శ్రార్ధమునయందుంచబడిన పిండములను బ్రాహ్మణులకుగాని, గోవులకుగాని, అజములకు, [మేకలకు] గాని యివ్వవలయును. లేక అగ్నియందుగాని, ఉదకమునందుగాని ఉంచవలయును. ఇట్లుచేయుటవలన విశేషత్వము కలుగుటవలయును.

ఇదియునుగాక యీలోకమందు అష్టాదశ వర్ణాదులును మేకలను పాలించుట వృత్తిచే జీవించుట మనకెల్లర కనుభవనీయమై యుండెనుగదా? నీచవృత్తి అయినయడల బ్రాహ్మణాదులకు నీచముగావలెను. కావున అజాపాలనవృత్తి కులాచారధర్మ విరుద్ధమై నీచవృత్తియని చెప్పరాదు.

ప్రశ్న:---- ఇప్పుడు గొల్లలన వృత్తినామముగల క్షత్రియులకు మాంసభక్షణము దూషితమేలకాదు.

ఉ:---- మాంసభక్షణము క్షత్రియులకు విహితమైనట్లు అనేకప్రమాణములుకలవు.

మనువచనం.

శ్లో॥ తిలై ర్వ్రీహియవై ర్మాషై రద్భిర్మూలఫలేనవా। దత్తేనమా సంప్రీయంతే విధివత్ పితరోన్నృణాం। ద్వౌమాసౌ మత్స్య మాంసేన। త్రీన్మాసా హారిణేనతు। ఔరభ్రేణాథ చతరశ్శాకునేనే హాపంచవై। షణ్మాసా ఛాగమాంసేన పార్షతేనా థసప్తవై అష్టావైణే యమాంసేన రౌరవేణ నవైవతు। దశమాసాస్తు తృప్యంతివరాహా మహిషామిషైః। శశకూర్మయేస్తు మాంసేన మాసానే కాదశైవతు। సంవత్సరంతుగవ్యేన పయసా పాయసేనవా। వార్ధ్రాణసస్య మాంసేన తృప్తిర్ద్వాదశవార్షకి। కాలశాకం మహాశల్కం లోహామిషంమధు। అనంత్యాయైవ కల్ప్యంత్తే। మున్యంన్నానిశసర్వశ వార్ధ్రాణసోరక్తవర్ణఛ్ఛాగః॥ తమక్త్వంబిష్ణు ధర్మోత్తరే ప్రీతీసత్వింద్రియాక్షీణం। యూథస్యాగ్రసరతథా। రక్తవర్ణంతు రాజేంద్రఛ్ఛాగంవార్ధ్రాణసంవిదుః॥ పక్షివిశేషోవా॥ కృష్ణగ్రీవో రక్తశిరస్వే

తపశ్లో విహంగమః । సపన్నైవా శ్రాద్ధార్హణనః ప్రోక్తా । ఇత్యేషా నైదికీ శ్రుతి రీతి నిగమవచనాత్ । కాలశాక ముత్తరదేశే ప్రసిద్ధం ॥ మహాశల్కో-మత్స్యవిశేషః ॥ ఖడ్గః । ఖడ్గమృగః । లోహిత-లోహిత వర్ణచ్ఛాగః । మునృన్నానీ వారాద్యన్నాని ॥

ఇట్లు శ్రాద్ధాదులయందు మాంసాదు లుపయోగించవచ్చు ననియేయున్నది.

మనుః.

శ్లో॥ రాజీవసింహతుండాశ్చ సశల్కాశ్చైవసర్వశః ॥

తా॥ పద్మవర్ణముగలిగినట్టియు సింహముఖము గలిగినట్టియు ముత్తెపుచిప్పవంటియు ఇట్టిమత్స్యములను శ్రాద్ధకాలములయందును ఇతరకాలములయందును భుజింపవచ్చునని యర్థము॥

ఇట్లు శ్రాద్ధాదులయందును ఇతరకాలములయందును విహితమనియే చెప్పియున్నారు. ఒకవేళ్ళ మరియొకచోట నిషేధమనిచెప్పినను అది ద్విజులనెడిచో బ్రాహ్మణులకును వైశ్యులకును చెప్పియుండునుగాని క్షత్రియులకు చెప్పబడదు. యెందువల్లననగా క్షత్రియులు క్షాత్రవంతము గలవారుగనుక హింసాకర మాంసభక్షణదోషము విధింపబడదు.

భారతం. అరణ్యపర్వం. వచనములోకొంత.

బుభుక్షాపీడ సహింపనోపక హిరణ్యపక్షంబులతోడను ముందర దిరుగుచున్న పక్షులంగని యవిభక్ష్యంబులగునని పక్షులంబట్టుకొన

పమునట్టి క్షత్రియుఁడగు నలచక్రవర్తి పక్షిమాంసము దిన ప్రయత్నించినటులను ॥

మనుచరిత్ర చతుర్థాశ్వాసం వచ-కొంత.

నిలింపాంగనాసుతుంషు దుస్సహాసమాగత చతుసులవలన కృతపల లఫల మూలాది శుచమధుర మృగయోచ తాహారంబుల తృప్తి వహించ ॥

అని స్వారోచియను మనువు మాంసము భుజించినట్లును.

భాస్కరరామాయణము అరణ్యకాండ.

చ॥ బహుమృగ మాంసఖండములు పండులు దేనియలుంగ
రఘూ। ద్విహుసతిగోరు భూరుహలతాసు సువాసుమలు దెచ్చియిచ్చు
చుం । మిహిర సమానతేజుడు సుమిత్రాతనూజుడు గొల్వగాముదా ।
వహములయ్యెదత్సమయ వాసరముల్ రఘువంశభర్తకుం ॥

క్షత్రియుఁడగు రాముఁడు తమ్మునిచే మాంసఖండములు దెప్పించుకొని భుజించెననియును.

భాస్కర రామాయణము ఆరణ్యకాండకర్త కథాభాగములో వచనములోకొంత ॥ కోరివ్వగల మృగమాంసంబు నిత్యంబు నాహారకృత్యంబులు దీర్చుచు అనిదాముఁడు నిత్యము మాంసము భుజించుచున్నటులను.

జైమినిభారతము తృతీయాశ్వాసం.

గీ॥ మరియు భూచరఖేచర జలచరములు । వేరుగలమాంస

ములునంజి ప్రియములోడ । రుక్మిణీసత్యభామ లిరువురునుగదిసి ।
తాళవృంతంబువిసరి త్రస్తరూ॥సేయ ॥

తా॥ క్షత్రియుడగు శ్రీకృష్ణుడు భూచరములగు మృగములును ఖేచరములగు పక్షులును జలచరములగు మత్స్యములును భక్షించిన టులను.

ఇందువలన క్షత్రియులు నిస్సంశయముగా మాంసము భుజించినటుల దృఢపడుచున్నది.

మఱియును భార- అను- చతు ఆ॥

కం॥ పితృకార్య యజ్ఞముఖముల। శ్రుతచోదితహింసకీడు సొరనేరదు విశ్రుతగుణ మాంసముచవిగో । రితినప్రాణి దెగటార్చుకి యపాపమగుణ ॥

తా॥ పితృకార్యముల యందును యజ్ఞములయందును వేదహితమగు హింస కీడు కలుగజేయదనియును మాంసము రుచిగోరి తినిన ప్రాణముతీయునెడ నెంతపాపమో యంతపాపము సంభవించుచున్నదని చెప్పియున్నది.

భార అను పం.

క॥ శ్రుతివిహింస హింసా । గతిదలపగ రాదుముని నికాయంబిది దు। స్మృతతతిబాపెడు పరమసుకృతమని గొనియాడుగా న గీర్వాణనుతా ॥

తా॥ వేదములయందు జెప్పబడినహింస హింసకాదనియును

స్వర్వఋషులును వేదోక్తమైన జీవహింస సమస్తదోషములను బాప
గల ముఖ్యకార్యమని కొనియాడినట్లు పార్వతికి శివుడు చెప్పినటులను

భార అర 5 ఆ.

సీ॥ అనఘయూసీనరుండగు శిబి నిజగాత్రహింస నింద్రాగ్ను
లకిడడెమాంస । మతనికి లేదయ్యె సయ్యయుత్తమగతి రంతిదేవుండ
ను రాజుతొల్లి । యను దినంబును గోసహస్రద్వయంబును వధియిం
పడేవేయువత్సరములు । దురితమమ్మహితాత్ము దొడరెనే వేదార్థ
నిరతులై యత్యంతనియతులైన । ధారుణీసురముఖ్యుల ధ్వరమునందు
పశువువధియింప రేకగ పరమపుణ్య । గతులు గలుగవెవారికి గడని
యగ్ను లధికమాంసార్థులని శ్రుతులందువినమే ॥

తా॥ శిబిచక్రవర్తి ఇంద్రాగ్నులకు తనశరీరంబోశి మాంస
ము పెట్టినందున నతనికి యుత్తమగతి గలుగకుండెనాయనియు రంతి
దేవుండను రాజు ప్రతిదినము రెండువేల గోవులప్రాప్తిని వేయుసం
వత్సరము లనేకగోవుల నధయించి యజ్ఞములుచేశి తత్శేషము భుజిం
చిన నారాజునకు దోషము సంభవించెనాయనియు వేదవిదులగుబ్రా
హ్మణులు మొదలగు ఘనులు యజ్ఞములయందు పశువులవధించిన
పుణ్యగతులు వారికి గలుగలేదాయనియు మృగవ్యాధుడు కౌశికున
కు వేదవిహితమగు హింస దోషాస్పదము కాదని చెప్పినట్లు చెప్పి
యున్నది.

కం॥ పితృదైవత కార్యములం । దతిభక్తిని మాంసమిడుట
యహ్ణమనియుత । త్పితృదైవత శేషము స । న్మతిభోజ్యమ్మనియు
మునులమతములుగావే ॥

ఆ॥ పితృకార్యములను దైవకార్యము విశేష భక్తిచేత మాంసము పెట్టుటయును తత్పితృదైవత శేషములను భుజించుట యును మనులమతమనియు తత్పరమైన హింసకాదాయనిన ॥

మ॥ హలికుండెంతయు నూజ దున్నునెడ శీర్షాగ్రంబునం బొంది ప్రా । ణులనేకంబులు జచ్చుహింసయది యానూకాదో వే యేల మ । ర్త్యులునేలంజరించుచో పదములంద్రొక్కంబడు న్వి క్కజం । తులదాహింసయు గాదసంగ వశమేదోషజ్ఞ యూహిం పుమా ॥

చ॥ సలిలము ఉర్వియాకసము సర్వముజంతు మయంబు గావునన్ । గలుగనవశ్యమున్ సకలకర్మములందును హింస హింస కున్ । దొలగినదేహయాత్రకును దుర్ఘటమైనటులుండు నంతయున్ । దలపకు హింసజేయమని తాపచరింతురు కొందరిమ్మహిన్ ॥

గీ॥ హింసజేయనివాడు లేడీజ్జగమున । నొక్కడైనను దమ తమ రోపిన్నట్లు । హింస తెరవున కెడగల్గయేగవలయు । నదియొలాపె యహింసనాయతిశయిల్లు ॥

ఇచ్చట మూడుపద్యములకు ఒకటేతాత్పర్యం.

భూమిదున్నునెడ హలాగ్రమునను ప్రజలునడుచునెడ పాద ములక్రిందబడియును సకలకర్మముల యందంతటను వ్యాపించియు న్న జంతువులకు హింసకలుగుననియును యీజగంబున హింసజేయ నివాడులేడనియును వీలైనంతవట్టుకుతొలగినటించుటయు హింసయ నియును ధర్మవ్యాధుడు చెప్పబడియున్నాడు.

క॥ ఫలమూలు నోషధీశాకం । బులు పశుమృగతతులు భక్ష్యములుగా భూతం । బులకజుడు జేసెననియు । స్థలితంబుగ మోక్షయసుతులు గాదనవశమే ॥

తా॥ ఫలములును, ఓషధులును, పశువులును, మృగములును భూతములకు దినుపదార్థములుగా బ్రహ్మనిర్మించినట్లు వేదములు జెప్పుచున్నవని మృగవ్యాధుడు కౌశికునకు జెప్పుటనుబట్టియును క్షత్రియులకు యవి భక్ష్యనీయంబులగుటచే నింద్యంబులుగావు: పరభంజనులగుటచే హింసయునులేదు. యిదిగాక పరంపరా యీయదువంశ్యులగు కృష్ణాదులు యంగీకరించిన ధర్మమంగీకరింపవలసినదె గదా. ఇందుకుప్రమాణం.

యజ్ఞాజీయము.

శ్లో॥ పారంపర్యాగతం ధర్మం యోనరస్త్యక్తు మర్హతి॥

తా॥ పరంపరావచ్చుధర్మము నంగీకరింపతగినది.

యదువంశ మండనుండగు శ్రీకృష్ణుడాచరించిన ధర్మనవలంబించుట సిష్టాచారముకాదు.

స్మృతిరత్నాకరం- ర పేజి.

శ్లో॥ శ్రుతిస్మృతి విహితోధర్మః తదలాభేశిష్టాచార ప్రమాణమితి ॥ వసిష్టస్మరణాత్ ॥

తా॥ ధర్మము శ్రుతివిహితమైనది. అట్టిధర్మములభించని సమయమందు శిష్టాచారము ప్రమాణముఅని వశిష్టులవారు చెప్పిరి.

ఆపస్తంభ సూత్రమందు.

యదావైషాంకులంధర్మస్స్యాత్ ॥

తా॥ కులధర్మమును విడువరాదు.

ఇదిగాక యీలోకమందు క్షత్రియులందరు మాంసము సాధారణము భుజించుటయును కల్గియుండుటచే లోకాచారముకూడా ఒప్పుకొనతగినదే యెట్లనగా.

విజ్ఞానేశ్వరీయము. ఆచారకాండ.

కం॥ కులదేశాచారంబులు । తనకొనిజేయంగవలయు తమకులదేశం । బులు నెందుజెల్లుగావున । నలయకయది విహితకర్మమనిరాచార్యుల్ ॥

భారతం. అర- 5 ఆశ్వా.

కం॥ ఒప్పెడునదియైనను గడు । నొప్పనియదియైన నిజకులోచితపథముల్ । దప్పదగదండ్రుధార్మికు । లప్పని నిజభాగ్యవిహితమని యెంచదగున్ ॥

తా॥ ఒప్పెడినదియైనను ఒప్పనిదైనను స్వకులాచారమార్గము అనగా పరంపరావచ్చు విధిని దప్పింపరాదనియు అప్పని స్వభాగ్యానుకూలమని చెప్పియుండుటచే తత్ప్రకారమే పూర్వము శ్రీకృష్ణాదులు మాంసభక్షణము నిషేధింపకుండుటచేతను లోకమందుసాధారణముగా క్షత్రియులు భుజించుచుండుటచేతను యిప్పుడును భుజించిన దూష్యముకాదు.

పరిశ్న. భారత-ఆది-3 ఆ॥ గీ॥ మొదలిపెక్కు-జన్నముల పుణ్యకర్మములు। పరగపెక్కు-జేసి పడయబడినసట్టి జనులకెల్లన తణ వగాలినజెరుచు మద్యసేవజేయునగునే॥

క॥ భూసురులాదిగగలజను। లీసురసేవించిరేని యిదిమొదలు గబా। పానక్తిసతితులగుదురు చేసితిమర్యాద దీనిజేకొనుడుజనుల్॥

వృద్ధహారీతసంహిత-౬ ఆధ్యాయం.

సురావైమలమన్నానాం। పాప్మావై మలముచ్యతే। తస్మాద్బ్రాహ్మణరాజన్యౌ। వైశ్యస్య నసురాంపిబేత్॥

ఇట్లు క్షత్రియాదులకు సురాపాన నిషేధము చెప్పియుండగా యీలోకమందు కొందరు యదువంశక్షత్రియులలో మధుపానమంగీకరింతురే వారేలదూషితులుకాగు.

ఉ॥ హరివంశము-పూర్వ॥ 5 ఆశ్వాసము.

సీ॥ నాదేహమతోతుల్యమైమేనునవమేఘ కాంతినొప్పారసంకర్షణునకు। నెనమైన వదనపూర్ణేందుడు శోభిల్లనెనిమిది బాహువులెసగశార్ఙ్గ। చక్రగదాఖడ్గ జలరుహమధుపాత్రి ముసలశూలముల నల్లసితములుగ। నుజ్వలహారకే యూరాది దివ్యభూషణగంధ మాల్యవిస్ఫారలీల। నీలకౌసేయ వసనలై నిఖిల సిద్ధగణముపూజింప దివికేగగలవునిన్ను। నెదురువచ్చి దోడ్కొనిపోయియింద్రుడెలమి। నాదిశక్తిగనభిషేక మాచరించు॥

తా॥ నాశరీరముతో సమానమైన నల్లనిశరీరమును చందాని

ననమును యెనిమిదిహస్తములును శార్ఙ్గము, చక్రము, గదా, ఖడ్గము, కమలము, మధుపాత్ర, ముసలము, శూలము, యీయెన్మిదిచేతుల ధరించి దివ్యభూషణ గంధమాల్యాదులతో నీవివస్త్రమును దాల్చి దివికేగిన యింద్రియుదోడ్కొనిపోయియాదిశక్తి వనిపూజించుననియు నారాయణుండగు తాను యదువంశంబున నుద్భవించెదనని చెప్పినట్లు ను యశోదగర్భమందు నాయమజన్మించి పూర్వప్రకారంబున దివికేగినట్లును అప్పుడు తనవంశంబులచే తన తోబుట్టువగు యాదిశక్తిని గొల్చునట్లుజేయుదునని చెప్పినట్లు భాగవతాతిగ్రంధములయందు జెప్పియున్నది గనుక మధుపాత్రతో వచ్చినదవుటచే తచ్ఛక్తినిగొల్చువారందరు తత్ప్రీతికరంబగు మధువునర్పించి పానంబుజేయుట నింద్యంబుగాదు. మరియు మధుపాత్రయననప్పుడు అమృతకలశమనగూడదాయనిన యీలోకమున శక్తి గొలుచువారందరు కల్లు సారాయి యుపయోగించుట ప్రశస్థమైయుండగా నట్లర్థముచేయుటలెట్లు ॥

భాగ, ఏకా, వచనము.

అనిన రాజునకు శుకుండిట్లనియే । యట్లు వాసుదేవుడన్యాయప్రవర్తనులగు దుష్టులసంహారించి న్యాయప్రవర్తనులగు శిష్టజనపాలనంబొనర్చి బలరామసమేతంబుగా ద్వారకానగరంబు వెడలినంగని యాదవులు తమలోదాము మదిరాపానమత్తులయి మాత్సరంబుల నుత్సాహకలహంబులకుం గమకించి కలితురగరథాది బలములతో ననగరశాసనధనన్నద్ధులై ॥ అని యును.

భాగ॥ తృతీ

ఉ॥ మునివరులేగుదేర యదువీర కుమారులు మూకలుగూడి ము

ట్టుబ । ఓక్కునఁ గనలొందివారు శమకించి శపించిన కొన్ని మానములన్ । జనువెడ దైవయోగమున జాతర బోగముకట్టివేడుకన్ । మునమ్మును దొంగలింప గరిమన్ నిజయానము లెక్కి యాదవుల్ ॥

అని చెప్పియుండుటచేత యదువంశక్షత్రియులందు శక్తినిగొలుచుటకు నదీతీరమునకు నేగి కల్లుద్రావి మత్సరంబు గలిగించుకొని తమలో దాము యుద్ధము చేసినట్టు చెప్పియున్నది.

భాగ- ద- పూర్వ.

క॥ నానావిధసంపదలకు । దానకమైసర్వకామ్య దాయినివగు
నిన్ । మానవులు భక్తిఁ గొలుతురు । కానుకలును బలులునిచ్చి క
ల్యాణముగా ॥

వచనం॥ మరియు నిన్నుమానవులు దుర్గా, భద్రకాళి, విజయా, వైష్ణవీ, కుముదా, చండికా, కృష్ణా, మాధవీ, కన్యకా, మాయా, నారాయణీ, యీశానా, అంబికా, శారదా, అను పదునాలుగు నామంబుల నాయాస్థానంబులయందఁ గొల్తురని యెరిగించి సర్వేశ్వరుండగుహరి పొమ్మని యానతిచ్చిన మహాప్రసాదంబని యయ్యోగనిద్రాయయ్యకొని క్రమ్మఱఁ జయ్యన నియ్యెల బాసివచ్చిన ॥

కం॥ మహనీయ గుణాస్పదమై । మహిలోనాదేశ జనులు మన్నింపగా । బహునామ నివాసంబుల । బహునామంబుల జరించె భద్రాత్మికమై ॥

ఈయదువంశ్యులగు రాజులు యాశక్తి తమవంశంబున జనియించుటచేతను శ్రీకృష్ణుని తోబుట్టువని యును శ్రీకృష్ణాజ్ఞోల్లంఘనం

బాపాదింపబడుచుండుటుల తప్పక యిప్పటివరకు తద్దేవతా ప్రీతికరంబగు మధుమాంసంబుల నర్పించుచు తాము నంగీకరించుచుండిరి. గాక.

భార- విరాట.

క॥ ఒదవెడు తృషవెల్లిదమున । వదనము వరువట్టు వట్టి వాసితరాజా । మదిరారసమానగనా । హృదయంబున వేడ్క యెసగ మెసగెదుతరుణీ ॥

అధిక దాహవ్యథచే వదనము వాడుబారెనదనియు మదిరారసము అనగా కల్లును దెమ్మనుమని తనదాసిగానుండు సైరంధ్రియను ద్రౌపదినిగూర్చి విరాటరాజు మహిషియగు సుధేష్ణబల్కినట్లును.

ఆంధ్రనామసంగ్రహము.

గీ॥ నల్లవలువదాల్పు ఱెల్లనిమైదంట వెన్నదొంగయన్న వెట్టి నీళ్ళ । మేలువాడుదుక్కివాలుదాలుపుతాటి । పడగవాడనంగ బలుదురుద్రా ॥

వెట్టినీళ్ళమేలువాడని బలరామునకు నామముగలదు గనుక చంద్రవంశజులయిన విరాటరాజు బలరాముడుమొదలయిన క్షత్రియులు మధుపానము నింద్యముగాదలంపక నంగీకరించిరని తెలియవలెను.

శుక్రశాపమును గురించి మీరుకనపర్చిన పద్యములతాత్పర్యము. అనేకయజ్ఞములాచరించి పొందబడిన సుకృతమెటువంటివారికైన క్షణములో చెరచదగిన యీకల్లుద్రావు టుచితము కాదనియు యికనుంచి బ్రాహ్మణులాదిగాగల జనులు మదిరాపానము చేశిన పతితులయ్యెదరనియు నేచేసిననియమమును సకలజనులు చేకొనుడనియు

శుక్రాచార్యుడిట్లు దోషనిరూపణచేశినట్లు చెప్పియున్నది. అందు
నబట్టి విచారింపగా మద్యపాననిషేధము వేదములయందు చెప్పి యు
న్నదా లేదాయని విచారము. వేదములయందు నిషేధింపబడినయెడ
ల భూసురశ్రేష్ఠుడైన. శుక్రాచారుడెట్లుదానినంగీకరించె. అప్పటికా
యన ధర్మముతప్పినాడనిన వేదభాహ్యుడుకావలెను వేదబాహ్యుడని
న అట్టివారివలన నీయబడినశాపము వేదోక్తాచరులెట్లువిశ్వశింపవ
చ్చును అనేకజన్మములయందు నార్జించి పుణ్యమునునశింపజేయగ
ల యీమధ్యపాన సేవజేయనగునేయని తనకుతానిందించుకొనినట్లు
తెలియవచ్చుచున్నది. అందునబట్టి బహుయజ్ఞఫలము ఒకబ్రా
హ్మణహింసచే నశించునుగనుక యీమద్యపానమునునుగదా కచుడు
ను బ్రాహ్మణహింస నావల్ల వాటిల్లెననిశకించుకొనియెను. కావున
వేదములయందు సురాపానము నిషేధింపబడనట్టుతోచుచున్నది. అ
యితే శుక్రశాపమునాటినుండియు మద్యము దోషాకారమైనదనిన
శాపానంతర మద్యభవించినట్టియు వేదోక్త ప్రవర్తకులయిన బలరా
మాదియదువులు విరాటరాజుమొదలయిన చంద్రవంశ క్షత్రియులె
ట్లంగీకరించిరి ॥ గానయీశ్లోకమందు.

తదోత్తర ఊర్ణవిక్రయ సీధుపాన ముభయతో తద్భిర్వ్యవ
హార అయోధీయ కంసముద్రయానమితి ॥ ఉత్తరదేశీయులలో మ
ధ్యపానము సర్వత్రాకలుగుచున్నట్లు బోధాయనులవారుచెప్పుచున్నా
రు. ఇప్పుడు సర్వదేశీయములలోను సర్వులు బ్రాంది గంజాయి న
ల్లమందు మధువు మొదలయిన మత్తువస్తువులంగీకరించుచునె యు
న్నారు. శాక్తేయ వైష్ణవాది మతములుగల వారందరునిరభ్యంతరము
గా నంగీకరించుచున్నారు సురాపానము బ్రహ్మహత్యాది మహాపా

తకములలో చేరిన గదాయనిన మాంసముగురించిచెప్పిన క్రిందటిప్ర శ్నజవాబులో వ్రాసినప్రకారము లోకాచారము దేశాచారము కులాచారముకు పూర్వాచార శిష్టాచారములచే యిప్పటి క్షత్రియులు కొందరట్లాచరించినను నిర్దోషులనబడుచున్నారు.

వృద్ధపారాశరస్మృతి, ౨౧ శ్లో॥

బ్రాహ్మణాదిషు సూద్రస్య । పచనాదిపరిక్రియ । భ్యాగ్ని మరణాశ్చైవప్రాయశ్చిత్త విధానకం॥

ప్రశ్న:— గొల్లలను వృత్తినామముగల చంద్రవంశక్షత్రియులు శూద్రపాకము భుజించుటనుబట్టి వీరినిశూద్రులని యేల చెప్పకూడదు.

ఉ:— శూద్రపాకము చంద్రవంశక్షత్రియులు పూర్వము భుజించియున్నారు.

విరాట్పర్వము, ప్రథమ ఆ॥

శా॥ దేవా నాలవ జాతివాడ నిను సర్థిన్ గొల్వగావచ్చితి। న్నే వాదక్షత యొంటుమై యెఱుగ నీచిత్తంబునన్ మెచ్చు న। ట్లే వండన్గడునేర్తున్ బానసముసం దిచ్చోటనే కాదు న। న్నేవీటన్ మిగులంగనె వ్వడును లేడేభంగులన్ జూచినన్ ॥

తా॥ దేవా నాలవజాతివాడ అనగా శూద్రుడను నిన్నుకొలుచుటకై యే తెంచినాడ నితరసేవలు యేమియు నెఱగను నీమనస్సుకను కూలమగునట్లు వంటకములు చేయుగలను యిక్కడనేగాక నెక్కడనేని

నాకంటెయెక్కుడగా వంటకమ్ముచేయువారులేరు అని భీముడువిరాటరాజుతో ఆడినట్లును ఇందునబట్టి విరాట్రాజు చంద్రవంశక్షత్రియుడయ్యును శూద్రాన్నంబుభుజియించుటవలన నింద్యముకాదు. భీముడు రాజేకదా యనిన అసంగతివిరాట్రాజునకు తెలియదుకదా నాలవజాతి వానిపాకము భుజించుట కర్తవ్యమగుటచేత ఒప్పుకొనియెను.

భార, ఆర, ద్వి. న॥

మరియు బాహుకుండను నామంబుతో సూతవృత్తి నంచుమని కర్కోటకుం డద్యశ్యుండైన॥

కర్మవశముచే ఋతుపర్ణుడను రాజగృహమున నలచక్రవర్తి ప్రచ్ఛన్నశూద్రత్వము వహించి సుబాహునామంబున వంటలవాడాయెననియును.

భార, ఆర, ద్వి.

సీ॥ వినవమ్మ తృణముష్టి గొనివాడువైచిన నందగ్ని యుదయించి యుండువంట। లమనంతకు సంధ నము లపేక్షింపక యుడుగక మండుచు నుండుమరియు। గడకతోనంజుళ్ళు గడుగంగసమకట్టి జలమపేక్షించుడు సంభవిల్లి। కుంభముల్నిండి దివ్యాంభప్రవాహ మక్షయమగుచుండ నాక్షణముచూడ। నతనికరతలద్వయా వర్తితములైకంది యును మహా సుగంధకుసుమ। తతులు తొంటియట్ల తమకంబువిడవక। యుండ నీతని తేజమున్నతంబు॥

వ॥ అనిన విని దమయంతి వెండియు కేశినిబిలచి బాహుకువండిన నంజుళ్ళు దెప్పించి యాస్వాదించి బాహుకనందు నలుని లక్షణంబులుండ నెరింగి॥

ఇట్లు భారతమందు చెప్పియుండుటచే క్షత్రియుడగు నలచక్రవర్తి భీమ నివలె ప్రచ్ఛన్న వేషములో వంటకములుచేయుటయు ఋతుపర్ణుడు మొదలయినరాజులు భుజించుటయు కలిగియున్నది.

నిర్ణయసింధౌ 3 అధ్యా॥ శ్రాద్ధనిర్ణయపేజి. పరాశరః।

శ్లో॥ తావద్భవతి శూద్రాన్నం । యావన్నస్పృశతిద్విజః । ద్విజాతికర స్పంస్పృష్టంసర్వంతన్న విరుధ్యతే ॥

విష్ణుపురాణే.

శ్లో॥ సంప్రోక్షితత్వా గృహీత్వాయా శూద్రాన్నం గృహామాగతం ॥

అంగిరాః ॥

శ్లో॥ పాత్రాంతరగతం గ్రాంహ్యం ।దుగ్ధంస్వగృహామాగతం

తా॥ శూద్రాన్న మెంతవరకు అంతవరకు శూద్రాన్నమగుచున్నది. ద్విజునిహస్తముచేత స్పృశింపబడినదంతయు గ్రాహ్యము. తనగృహామునకువచ్చిన శూద్రాన్నము ద్విజుడుప్రోక్షించి భుజింపవచ్చును. తనయింటికిదెచ్చిన శూద్రసంబంధమైన దేదియును మరియొకపాత్రయందుంచుటచే గ్రాహ్యనీయంబు అనగా శూద్రపాత్రితో గ్రహింపగూడదనుట.

ఇట్లు శూద్రాన్నము స్పృశవగాత్రిన ప్రోక్షణమాత్రమున పాత్రాంతరమున భుజింపవచ్చునని చెప్పియున్నాడుగాన యేతత్క్రియావిహీనము భుజించుటయే వలనుపడదు. కావున శూద్రాన్న భుక్తివలన ద్విజులగు చంద్రవంశ క్షత్రియుల కేమియు క్షేసణయులేదు.

అట్లయిన శూద్రాన్న నిషేధమేల చెప్పిరనిన చండాల పరియంతము శూద్రత్వము కలదుగనుక సంకరజాతుల పాకము భుజింపగూడదనుట

ప్రశ్న:— యీలోకమందుగల జాతులలో శూద్రులెవరు? మిశ్రజాతియేది?

ఉ:— సచ్ఛూద్రులు.

దాసుడు:— కాపుస్త్రీయందు బ్రాహ్మణునకు బుట్టినవాడు.

నాపితుడు:— సంస్కారణము కానివాడు.

గొల్ల:— క్షత్రియునకు కాపుస్త్రీయందు జనించినవాడు.

అర్ధికుడు లేక సిరి:— వైశ్యస్త్రీకిని బ్రాహ్మణునకు జనించినవాడు. కుంభకారకుడు.

పరాశరస్మృతి. ౧౧ అధ్యాయం.

౨౨, ౨౩, ౨౪, శ్లో॥ శూద్రకన్యా సముత్పన్నో బ్రాహ్మణే నతుసంస్కృతః। సంస్కారాద్భవేద్దాస_ అసంస్కారాత్తు నాపితః॥

క్షత్రియాచ్ఛూద్రకన్యాయాం సుతోజాయేతనామతః। సగోపాల ఇతిజ్ఞేయో భోజ్యోవిప్రయిర్నసంశయః॥

వైశ్యకన్యా సముద్భూతో బ్రాహ్మణే నతసంస్కృత। సంహ్యర్ధిక ఇతిజ్ఞేయో భోజ్యోవిప్రయిర్నసంశయః॥

యాజ్ఞవల్క్యస్మృతి.

శ్లో॥ శూద్రేషుదాస గోపాలా కులమిత్రార్ధ శీలినః। భోజ్యాన్నా నాపితశ్చైవ యశ్చాత్మానం నివేదయేత్ ॥

చతుర్వింశతిమతేపి.

శ్లో॥ అర్ధికః కులమిత్రశ్చ గోపాలో దాసనాపితౌ । ఏతే శూద్రేషు భోజ్యాన్నా యశ్చాత్మానం నివేదయేత్ ॥

దేవలస్మృతి.

శ్లో॥ సదాసోనాపి తో గోపః కుంభకారః కృషీవలః । బ్రాహ్మణైరపి భోక్తవ్యాః । పంచైతే శూద్రయోనయః ॥

స్మృత్యంతరేపి.

గోపాలనాపితం కుంభ కారకులమిత్రార్ధ సీరిక నివేదితాత్మనో భోజ్యాన్నాని.

పైనచెప్పబడిన యేడుజాతులు సత్శూద్రులనబడుదురు గాన బ్రాహ్మణాదిద్విజులు వారలఅన్నము దినవచ్చును.

క్షత్త:— క్షత్రియస్త్రీకిని శూద్రునకుబుట్టినవాడు.

క్షత్త్రార్యా శూద్రయోస్సుతః. అమరము.

విజ్ఞానేశ్వరీయము.

కం॥ కోమటికిని శూద్రుండును । భూమీశ్వరపుత్రియందు బుట్టెదరోలిం । దామాధుండుగ నాతని గ్రామాధ్యక్షుండు నైన క్షత్తయనసగణ ॥

సూతుడు:— క్షత్రియునివలన బ్రాహ్మణస్త్రీకిబుట్టినవాడు.

బ్రాహ్మణ్యాంక్షత్రియా త్సూత-అమరం.

విజ్ఞానేశ్వరీయము.

క॥ రాజతపిప్రాంగసతను రాజునకంబుట్టునతడు రథసూ

తు వి। బ్రాహ్మణవిప్రాంగనకును వైశ్యజాతికిబుట్టినతను వ్యావహారియగుః॥

వ్యావహారి:---- బ్రాహ్మణస్త్రీయందు వైశ్యునకుబుట్టినవాడు.

వైదేహకుడు:---- (బ్రాహ్మణ్యాం క్షత్రియ త్సూత స్తస్యాం వైదేహకోవిశః ॥ అమరం.

వైశ్యస్త్రీకి శూద్రునకు బుట్టినవాడు.

కరణుడు:---- శూద్రస్త్రీ కిని వైశ్యునకుబుట్టినవాడు.

(శూద్రా విశోస్తు కరణం) అమరం.

విజ్ఞానేశ్వరీయము.

కం। కోమటికి శూద్రభామిని కామిని యై కన్నసుతుడు కర ణుండను పేరాము నబరగు నని మను ధీమంతులు తేటపడగ దెల్పిరి జగతిః ॥

అంబష్టుడు:---- వైశ్యస్త్రీకిని బ్రాహ్మణునకు బుట్టినవాడు

(అంబష్టో వైశ్యా ద్విజన్మనో, అమరం

విజ్ఞానేశ్వరీయము.

కం॥ మునవిప్రునకును క్షత్రియవనితకు జన్మించువాడు వైశ్యుడు వైశ్యాంగనకును విప్రోత్తమునకు ననుకూలతబుట్టువాడు నంబష్టుడగుః ॥

ఉగ్రుడు:---- శూద్రస్త్రీ కిని క్షత్రియునకు బుట్టినవాడు.

(శూద్ర క్షత్రియయోరుగ్రో) అమరం.

విజ్ఞానేశ్వరీయము.

కం॥ రాజన్యువలన వైశ్యస్త్రీజుడు మాహిష్యుడనగ జెల్లును

శూద్ర। స్త్రీజాతు డుగ్రుడనజను। ధీజనుత కీర్తిపూర ధీరవిచారా॥

మాగధుడు:—— క్షత్రియస్త్రీకి వైశ్యునకు బుట్టినవాడు.

మాగధక్షత్రయోవిశోః॥   అమరం॥

క॥ కోమటికిని శూద్రునకును। భూమీశ్వర పుత్రియందు బుట్టుదురోలిం। దావమాగధుండు నాద్య గాయోగవాద్యక్షుండునైన క్షత్తయు ననగుణ్॥

మాహిష్యుడు:—— వైశ్యస్త్రీకిని క్షత్రియునకు బుట్టినవాడు.

(మాహిష్యోర్యా క్షత్రియయోః)   అమరం.

విజ్ఞానేశ్వరీయము.

క॥ రాజన్యవలన వైశ్యస్త్రీజుడు మాహిష్యు డనగజెల్లును శూద్రస్త్రీజాతు డుగ్రుడనజను। ధీజననుత కీర్తిపూర ధీరవిచారా॥

వైశ్యుడు:—— బ్రాహ్మణునకు క్షత్రియస్త్రీయందు బుట్టినవాడు.

విజ్ఞానేశ్వరీయము.

క॥ మునువిప్రునకును క్షత్రియవనితకు జన్మించునతడు వైశ్యుడువైశ్యాం। గనకును విప్రోత్తమునకు ననుకూలతబుట్టునాత డంబష్టుడగుణ్॥

నిషాదుడు:—— బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందు కలిగినవాడు

విజ్ఞానేశ్వరీయము.

క॥ భూదేవుడు శూద్రస్త్రీ। నాదరమునబెండ్లియాడి యాస

టియందు । త్పాదించినవిప్రుండు నిషాదు డనబరగుచుండు సమ్మద
లీలన్ ॥

రథకారుడు:— కరణస్త్రీకిని మాహిష్యునకు బుట్టినవాడు

[రథకారస్తు మాహిష్యాత్కరణ్యాం యస్యసంభవః] అమరం.

చండాలు:— శూద్రునిచే బ్రాహ్మణస్త్రీయందు జనించి నవాడు.

[చండాలస్తు జనితో బ్రాహ్మణ్యా వృషలేనయః] అమరం.

విజ్ఞానేశ్వరీయం.

క॥ గోరక్తై బ్రాహ్మణకన్యక । దోరసినశూద్రుండు ప్రీతి తోనెక్కటిదై వెరవకబుట్టించినయా । జరభికిబుట్టినయతండు చండాలుడగున్ ॥

ఇట్లు శూద్రజాతి మొదలుకొని చండాలపరియంతము గల జాతులు మిశ్రజాతులుగా నెఱుంగవలయును.

ప్రశ్న:— ఇప్పుడు మీరుజెప్పిన సచ్ఛూద్రులును మిశ్రజాతులుగానే కనపించుచున్నారు. నాలవజాతి శూద్రులెవరు.

ఉ:— నాలవజాతిశూద్రులు పలానావారని నిర్ణయించుటకు తగినంత శాస్త్రప్రమాణములు ప్రస్తుతమందు కనిపించలేదుగాని శ్రీనాధునిచే రచియింపబడిన భీమేశ్వర పురాణమందు వేమభూపాలుని వంశవర్ణనయందు, పంటరెడ్లు, వెలమలు, కమ్మలు, వంటరులు, సరిసఱ, అనువారు నారాయణుని పాదకమలముల యందుద్భవించినవారినిగా వ్రాసినాడు.

## భీమేశ్వరపురాణము

ఉ॥ కైటభదైత్యవైరి పదకంజమునం దుదయంబునొంది మి। న్నేటికి భూతధాత్రికిని నెంతయునచ్చిన తోడబుట్టువై। హాటక గర్భముఖ్య నిఖిలా మరమాళి మణిప్రభా। పాటలవర్ణమైన నొకపావ నవర్ణము దీర్ణసంపదన్ ॥

వ॥ అప్పుణ్యవంశంబు కంసాసురధ్వంసి చరణపల్లవంబు తన కు బుట్టినిల్లుగావున గారణ గుణసంక్రమంబునన్ బోలె జామర తో మరచ్ఛత్రధనుఃఖడ్గాదిచిహ్నా పశోభితంబై చదలేటి సీటివనలనిసోదరీయ స్నేహాలబ్ధంబులుంబోని పావనత్వ శుచిత్వ గాంభీర్య మాధుర్యంబులు చరిచమున స్వభావవచనంబుల ధరియించి పైదోడుంబొదివి విశ్వవి శ్వంభరా క్రీడనంబున దనకువిదిర్చిన పరమతూంతి యంతరంగంబు న సంతరించి నిఖిలప్రపంచంబున కాధారంబై ప్రవర్తిల్లె. అందు పద్మనాయకులను వెలమలనగ, కమ్మలనగ, సరిసల్లన, వంటల్లన,బ హుప్రకారశాఖోపశాఖా భిన్నంబులై గంగాప్రవాహంబునుంబోలెగో త్రంబులెన్నియేనియు జగత్పవిత్రంబై ప్రవహింపుచుండ కల్పంబు ల తిక్రమించి మన్వంతరంబులు జరిగి యుగంబులు సరికడచి వత్సరంబు లుచని కాలచక్రంబు లతిక్రమించుచుండ చతుర్థకులమాళి మండ నంబై కీర్తివిహార ఘంటాపథంబైన పంటమహాన్వయంబు పాకనాటి దేశంబున భద్రపీఠంబున నివసించి॥ యింకను వచనముకలదు. కా నివలయునంతకు ముగించితి.

ఇట్లుచెప్పియుండుటచే పైసకనుపర్చిన జాతములు శూద్రుల ని తోచుచున్నది.

ప్రశ్న:---- గోపాలకాది వృత్తి నామములచే నున్నవారు చంద్రవంశక్షత్రియులని విస్పష్టముగా లక్ష్యలక్షణములచే దృఢపరచితిరి గాని పరాశరస్మృతియందు॥ శ్లో॥ క్షత్రియచ్ఛూద్రకన్యాయాం సుతోజాయేత నామతః । సగోపాల ఇతిజ్ఞేయో । భోజ్యోవిప్రైర్న సంశయః ॥ అనిచెప్పియున్న ప్రకారం యీగోపాలకజాతి యీలోకమందుగల గొల్లలనువారిని సచ్ఛూద్రులగు యీజాతివారందరు నల్లేల భావింపకూడదు.

ఉ:---- మీరిపుడు చెప్పబడిన సచ్ఛూద్రులగు గోపాలకులనువాండ్రు యిదివరకుదెల్పిన గొల్లలను వృత్తినామముగల యదువంశక్షత్రియులుకారు వృత్తినామము లాగంతకములుగాని స్వాభావికములుగావు. యీయదువంశ క్షత్రియులకు గోపాలకవృత్తిచే గొల్లలనినంతమాత్రమున మిశ్రజాతిగా యెంచేయకల ॥

గురుబాల ప్రబోధిని. ౫౭౬ శ్లోకం.

స్త్రీయాంకృషిః పాశుపాల్యంవాణిజ్యం చేతివృత్తయః ॥ కర్షణం- కృషిః- కృషివిలేఖనే- మన్నుటకృషి- ఇ-సి- పశూం- గోమహ్యాదీన్పాలయతీతి- పశుపాలః॥ తస్యకర్మ పాశుపాల్యం ॥ గోమహిష్యాది పశువుల పాలించువాడు పశుపాలుడు వైశ్యునకిట్లు గోపాలకవృత్తి చెప్పియున్నందున వైశ్యుడను సంకరజాతి గోపాలుడనే చెప్పవలసివచ్చును. గాక.

శ్లో॥ వైదేహకస్సార్థవాహో। నైగమోవాణిజోవణిక్॥ ఇత్యమరః ॥

వైదేహుకుడనగా వైశ్యునకు వృత్తినామమయి వున్నది.

నామ్నమాల.

శ్లో॥ వైదేహకంతు శూద్రాజ్జాతం । వైశ్యాసుతంబ్రువతే॥

తా॥ వైశ్యస్త్రీకిని శూద్రునకుబుట్టినవాడు వైదేహుకుడు.

వైశ్యునకు వైదేహుకుడని వృత్తినామము చెల్లినంతమాత్ర మున వైశ్యులనుకూడా సంకరజాతులని చెప్పవచ్చునా?

విజ్ఞానేశ్వరీయము.

క॥ మునువిప్రునకును క్షత్రియవనితకు జన్మించినతడు వైశ్యుడు । వైశ్యాంగనకును విప్రోత్తమునకు ననుకూలతబుట్టునాత డంబష్టుకగుణా ॥

తా॥ బ్రాహ్మణునకు క్షత్రియస్త్రీకిని జన్మించినవాడు వైశ్యుడని చెప్పియున్నదిగదా. ఇప్పుడు లోకమందుగల వైశ్యులను వారిని మిశ్రజాతులనిన నొప్పుకొనియెదరా ? మరిన్ని.

శ్లో॥ శూద్రా విశోస్తు కరణం ॥ అమరం.

తా॥ శూద్రస్త్రీకిని వైశ్యునకు బుట్టినవాడు కరణుడు. "కరోతి లేఖనకర్మేతి కరణః డుకృఞ్ కరణే। లేఖనకర్మ చేయువాడు."

ఇప్పుడు లోకమునందు లేఖనకర్మగలిగి కరణాలను పేరువహించిన బ్రాహ్మణులను మిశ్రజాతియగు కరణజాతియనవచ్చునా.

విజ్ఞానేశ్వరీయము.

క॥ రాజితవిప్రాంగనకును । రాజునకు బుట్టినతడు రధసూ

తుడు వి । బ్రాహ్మిత విప్రాంగనకున్ను వైౖజాతికిబుట్టునతడు వ్యవహారి యగును ॥

తా॥ బ్రాహ్మణస్త్రీయందు వైశ్యునకుబుట్టినవాడు వ్యవహారి ॥

వ్యవహారనామాంతరము వ్యాపారమగుటచే తదావలంబనము గా రాబడినవ్యాపారులను లోకమందుగల బ్రాహ్మణులను మిశ్రజాతిగా నెంచ్చవచ్చునా. వృత్తినామములాగంతుకములుగాన యేజాతివారేవృత్తి యాచిరించెదరో నావృత్తినామంబులచే పిలువబడుదురు అంతమాత్రమున స్వతస్సిద్ధమయ్యున్న స్వాభావికకుల నామంబులంతరింపవు గావున యిట్లు వ్యతిరేకార్థంబు లంగీకరింపరాదు. కావున గోపాలకాది వృత్తినామములుగల చంద్రవంశక్షత్రియుల మిశ్రజాతి గోపాలనుటకు వలనుపడదు. శబ్దమాత్రంబున నట్లారోపించిన మూఢుల భావంబెట్టిదనిన ॥ బ్రాహ్మణులనుగూర్చి ద్విజులనెడిచో సర్పములని భ్రమపడినట్లును శ్రీవిష్ణునిగూర్చి హరియనినచో కోతియని నగినట్లును, అశ్వమునుగోరి సైంధవమును దెమ్మనినచో లవణమును దెచ్చు భంగి ఒక శబ్దమునకనేకార్థములు కలిగి నప్పుడెప్పుడెచ్చటే యర్థముపయోగించునది తెలియక భ్రమనొందెడి మూర్ఖుల వాక్యంబు లార్యాంగీకర్ణంబులు కావు. కొందరు సంకరజాతులు తమసాంకర్యనింద్యమున కోర్వజాలక నుత్తమజాతులకొక వక్రత్వముండుట లెస్సయని కొన్ని కూహకోక్తులుబన్ని ఇట్లుబలికినను నవి పండితులయెడ పాటింపక పలుకువారలసిగ్గు జెరచునవిగాయుండును.

ఇదిన్నిగాక వీరు యదువంశక్షత్రియులనుటకు శ్రీకృష్ణునితోడబుట్టునగు ఆదిశక్తి బహునామంబులచే ప్రపంచమందు వెల

యుటవలన ఇప్పటికి తద్వంశజాతులగు వీరలు నానారూపంబులచే వెలయు ఆదిశక్తిని కులదేవతగా కొలుచువారలు గాను తద్దేవతలకు పూజాహర్హులుగానుండి తరతరములనుంచి తమ్మటకాహళములు మొదలగు వాద్యములతో జాతరచేయుటయు (యాచకులు యాత్రికులు నడుగుకొను వారలు) అను జనులవలన తమకుగల బిరుదములును పూర్వ రాజచరిత్రములు మొదలగునవి కధలుగా జెప్పించుచుండుటయు లోకమందు సర్వజనులు వినిన సంగతియైయుండగా నెట్లుకాదనజాలుదురు.

ప్రశ్న:--- గొల్లయను వృత్తినామముగల చంద్రవంశక్షత్రియులు, పూరిగొల్లలనియు, పూజగొల్లలనియు, ఎర్రగొల్లలనియు పూనాటిగొల్లలనియు, వృష్టిగొల్లలనియు, కర్ణగొల్లలనియు, మందగొల్లలనియు, కురుపగొల్లలనియు యీమొదలయిన భేదములచే వాడుటకు కారణమేమి.

ఉ:--- ఈకలియుగమునందు బ్రాహ్మణాది సకలవర్ణముల యందనేక భేదములు కలవు. శాఖాంతర, మతాంతర, దేశాంతర, కర్మాంతర, జీవితాంతరాదిక భేదములచే యనేక నామాంతరములు కలిగి అనేక తెగలుగా నుందురు.

బ్రాహ్మణులలో వెలినాడు, తెలుగునాడు, మురికినాడు, కోసలనాడు, వేగినాడు, ఇట్లయిదు భేదములు. వీరిలో ఋగ్వేదశాఖ, యజుర్వేదశాఖ, సామవేదశాఖ, యని మూడుశాఖలు. వీరిలో ద్రావిడులనియు, సత్యాషాఢులనియు, ఆర్వేలనియు, నందవరీకులనియు, దమిళివారనియు, పాకనాటీలనియు, ఇట్లుస్మార్తులలోకలరు.

ఇందులో వైష్ణవులనియు, వ్యాపారులనియు, మధ్వులనియు, ఆరాధ్యులనియు అనేక భేదములుకలవు.

వైశ్యులలో.

వేగినవారనియు, వేగనివారనియు, లేక బేరులనియు.

శూద్రులలో.

రెడ్లలనియు, వెలమలనియు, సరిసలనియు, వంటలనియు, కమ్మలనియు, బలిజలనియు ఇట్లనేక భేదములుండుటయేగాక ప్రతివకజాతికి అనేక భేదములు కలవు.

యీచంద్రవంశ క్షత్రియులకు నట్లనే యనేక శాఖోపశాఖలుగా భేదములును, నామాంతరములును, కలిగినవి.

ఇందుకు ప్రమాణము.

భాగ- దశ- ఉ.

క॥ హరితద్వధార్థమైని । జరిలును యదుకులమునందు జనియింపింపఁ । ధరనూటొక్కకులంబై బరగిరి వారినిగణింప బ్రహ్మకు వశమే ॥

ఇట్లు యదువంశము ద్వాపరాంతమందే నూటొక్క కులములుగా నేర్పడినదని చెప్పియున్నది. ఇట్లు యే యేవర్ణమునకె న్నెన్ని భేదములు కలిగినను నామాంతరము లెన్నివిధములుగా వాడుచున్నను ప్రధానవర్ణమునకు భంగమురానేరదు.

ప్రశ్న:— సుమతిశతకం॥ అల్లునిమంచితనంబును । గొల్లని

సాహిత్యవిద్య కోమటినిబమ్మ । బొల్లుసదంచినబియ్యము । తెల్లని కాకులునులేవు తెలియగసుమతీ ॥

వేణుగోపాల శతకములో॥ సీ॥ దూదేకుపూసేను దొమ్మరిగోపాళు పట్టమంగడు గాండ్లబావిగాడు । బైసేనినాగడు పటుసాతెనారాయ । డగముడిలచ్చిగా డాముకుంచు । చాకలమల్లడు సాతాని తిరుమల గొల్లకాటడు బెస్తగురివిగాడు । కోమటిశంభుడు కుమ్మరచెంగడు । మంగలెల్లడు బోయ సింగడొకడు । కన్నరాలంజకొడుకులు కవులుగాగ । వేదశాస్త్రంబులేడను విప్రులేడ । మదరిభువిపాల మునిజనహృదయలోల । వేణుగోపాలభక్తసంత్రాణశీల ॥

చంద్రశేఖరశతకము. చ॥ ఇరిదిగచూస్తి తీరతములెన్నెనుయాదొనకొండ గంగజాతర సరికావు పంబలును తప్పెటలు కోముకాండ్ల సిళ్ళసం । బరమదినిన్ను మింకొకపుభావము రంకులాటమెక్కినే । తిరిగినసాటిరాదని నుతించును మూర్ఖుడు చంద్రశేఖరా ॥

ఉ॥ అద్దమరేయి గొల్లరసినట్లు యెసంగముపట్టయేదమే మిద్దొపురండమోయనగ యీకులసుద్దులో [illegible]దమో । పొద్దున బాపశాండ్లనెలి పొమ్మనివ్వారెల గొ[illegible] । [illegible]డొద్దమో సమని పల్కునుమూర్ఖుడు చంద్రశేఖరా ॥

[illegible]సుమతిశతకము, వేణుగోపాలశతకం, చంద్రశేఖర శతకాదులలో [illegible]ల్లిపర్ణముసు నిందార్హములుగా చెప్పియుండుటకు కారణముయేమి.

ఉ:—— ఇప్పుడు మీరుకనపరచిన శతకములు ప్రమాణార్హ

గ్రంధముఃకావు. గొల్లని సాహిత్యవిద్య లేదనుట లీవెనుక జెప్ప బడిన గొల్లయను వృత్తినామముగల చందవంశక్షత్రియుల యందా రోపింపరాదు. యేలయనగా ధర్మాది చతుర్విధ ఫలప్రదాయిని యగు గీతాశాస్త్రము కల్పించిన మహాపండితుండైన శ్రీకృష్ణుడును, స్త్రీశూద్ర దాశిజన సంస్కారంబై స్మరణమాత్రంబున ముక్తిసంభ వించునట్టి సాత్వత తంత్రంబను వైష్ణవస్మృతి కల్పించిన శ్రీకృష్ణుని కుమారుడగు ఉపశ్లోకుడును సర్వధర్మశాస్త్ర పరిజ్ఞానుండగు భీష్మా చార్యులును, ధర్మరాజును మొదలయిన మహామహులు పండితులము యుండగాను మరిన్ని కలియుగమందు పంచమ వేదంబునాబరగు భారతం బాంధ్రంబున కృతియందిన పండితుండును రసికుండగు రాజ నరేంద్రుండును అనేక పండిత రక్షణజేసి మనుచరిత్ర మాదిగాగల యనేక గ్రంధంబులు గృతునందియును మదాలస చరిత్రము, సత్యా వధూప్రీణనము, సకల కధాసారసంగ్రహము, జ్ఞానచింతామణియు, రసమంజరియు, మొదలయిన సంస్కృత గ్రంధములును, విష్ణుచిత్తీ యమను నామాంతరముగల ఆముక్తమాల్యద, మాంధ్రమునను రచి యించిన మహాపండితుండైన (కృష్ణదేవరాయలు) పరమయోగివి లాసము రచియించిన వసుచరిత్ర కృతియందిన తిరుమలదేవరాయల మేనల్లుడగు (తిమ్మరాజును) హరిహర నామనిపేర పంచతంత్రముల ను గ్రంధమాంధ్రమున రచియించిన మహాపండితుడగు (వెంకటనాధ రాజును) చంద్రవంశక్షత్రియులలో ననేకులు పండితులుగాను రసజ్ఞు లుగాను పండిత పోషణసేయువారలుగా నుండగా (గొల్లనిసాహిత్య విద్య లేదనుట లెట్లీజాతము సందంగీకరింపబడును. గొల్లయనునా మము గోపాల అను సంస్కృతశబ్దమున కాంధ్రమైనందున పశువుల గాయువానియందు వర్తించెడి వృత్తినామముగా నిదివరకే సిద్ధాంత

ము జేయబడియున్నదిగావున, గొల్లనిసాహిత్యవిద్య లేదనుటకర్థము. పశువులగాయువానికి లేదని చేయవలసియుండును. ఆసు మతిశతకమందే.

క॥ వొల్లనిసతి నొల్లనిపతి । నొల్లని చెలికానివిడువ నొల్లనివాడే గొల్లండుగాక ధరలో గొల్లండును గొల్లడౌనె గుణమునసుమతీ ॥

క॥ వినదగునెవ్వరుసెప్పిన । వినినంతనె వేగపడక వివరింపదగున్ । కనికల్ల నిజముదెలియని । మనుజాధిపు డతనుగొల్ల మహిలోసుమతీ ॥ రెండుపద్యములకు తాత్పర్యము ॥ ఒల్లనిస్త్రీని, ప్రభువును, మిత్రునివిడుచుట కొప్పుకొననివాడు, గొల్లడు, అనగా పశువులగాయువాడనియును, నిజముగా పశువులగాయువాడు గొల్లడుకాడనియును, అనగా పశువులగాయువానికైనను యీవివేకముకలదనియు, నితని కంతమాత్రము వివేకములేదనియు, మరిన్ని యెవ్వరుచెప్పినను విని వినినంత కని సత్యాసత్యములను తెలియనిప్రభువు గొల్లడు. అనగా పశువుల కాయుమాత్రపువాడని తాత్పర్యమైయుండగా కొందరు శబ్దజ్ఞానవిహీనులు గొల్లయను వృత్తినామముగల చంద్రవంశక్షత్రియుల యందారోపించి నిందార్హముగా వాడుదురిట్టి పద్యములు నీతియొక్కలయినను పెరుగవస్తును కలిపిన పదార్థ దధ్యాన్నంబు మాడ్కి సామాన్యులయిన భుజియింపనట్లు నల్పులకైన నంగీకరంబులుకావు.

చంద్రశేఖరశతకమును గురించి.

ఈశతకము యూసపదములుగాను దూష్యోక్తులుగాను చెప్పబడియును గొల్లయను వృత్తినామముగల క్షత్రియులను గురించి చెప్పిన

దికాదు అది మూర్ఖులనిమిత్తము చెప్పబడినదని యీగ్రంథకారుడే చెప్పియున్నాడు.

చ॥ కలుష మనోవికారులకు కష్టులకున్ కుజనాళికిన్ కుత ।ర్కులకును ధర్మసూన్యులకు కూహక మానవకోటికిన్ మధాం । ధులకును సిగ్గుపుట్టమది నూల్కొనసే రచియింతునన్ను సీ । శ్చలమతి జేర్చి యీశతకశాసనమిమ్ముగ చంద్రశేఖరా ॥

తా॥ కలుష మానసులకును, కష్టులకును, దుర్మార్గులకును, కుతర్కులకును, ధర్మవిహీనులకును, మాయామనుజులకును, శిగ్గుపుట్టులాగున జెప్పెదననియున్నది. ప్రపంచమందిట్టిజనులు బ్రాహ్మణాది చండాలపరియంతమును గలరు గావున నాగ్రంథభావమంతయును దుర్జనులందు జెందుచున్నది. చంద్రశేఖరశతకములో

(౩౯) ఉ॥ రెడ్డి డభోల్ డభోల్ హరిహరీ ఔనే నీతమాస చూపుమా । దొడ్డగ ఆనెకూన డరు దొలదె యీన యటంటనాడె మా । మెడ్డుగ దొమ్మరెక్కగని మించినయు గ్రామరేడలేదు నా । తెడ్డుక బాపనిగ్గెలని తిట్టును మూర్ఖుడు చంద్రశేఖరా ॥

తా॥ దొమ్మరి ఆటాడునెడ డోలకొట్టుచూ తననుకొనియాడుచు దొమ్మరిది గడయెక్కుటచూచి ఒకరెడ్డియను మూర్ఖుడు యీయిగ్గెకు మించినయిగ్గె లేదనియు బాపనిగ్గెలు నాతెడ్డుకాయని యు తిట్టుననియును.

చంద్రశేఖరశతకం॥ ॥౯౧॥ ॥ఉ। తిమ్మడివల్లుసూస్తె సలి తాపమలంట యిదేటిరోగమో । తమ్ముడువూరలేదు తనదాసరికూ

దు కులానలేమనీ । కమ్మకులానికిట్లు కడగాండ్లుమరేందో వృదేన్నెవ స్తైనేనమ్మను । యప్పలీయామని యందురుమూర్ఖులాలు చంద్రశేఖరా

తా॥ కమ్మడను వానివల్లు సలితాపము లనియు తమ్ముడు గామమందు లేడనియు అతనిని చూస్తె దాసరి కూడనియును కుల మందే లేడనియును ఛీ కమ్మకులానికి యిటువంటి కడగండ్లు యేమి యనియును వృదయమునవస్తె అప్పలీయ నమ్మననియు పలికినట్లు చెప్పియున్న దిట్లన్ని కులములను గురించి చెప్పియుండినను ఆగ్రంధ మందు మొత్తముమీాద పరాపవగానమును బోధించి నంత దుర్జన అజ్ఞాకరమైన నీతికనుపడదు.

వేణుగోపాల శతకమును గురించి.

౨౮॥ సీ॥ ఏదంబులకు మంగలెంకడే జగునేటు ప్రశ్నచె ప్పెను మాలపాపిగాడు । కవితముల్ జెప్ప బోగముచినంగడేసరి సంగీత యిగ్గెకు చాకలెల్లి । శాస్త్రపురండాలు సాతానసంతమ్మ చిందులుద్రొక్క దాసరి పెద్దక్క । యీానెగొట్టను కోమటీరేశమేసరి । తీరతాలకు మారుమనుములచ్చి । యనుచు మూర్ఖాళి యీారీతి నాడుచుంద్రు భూతలము నంత యినుమంత నీతిలేక । వుదగ భువి పాల మునిజన హృదయలోల । వేణుగోపాల భక్తసంత్రాణశీల॥

౩౨॥ సీ। కోమటి యత్యంత క్షామము గోరును ధారుణీ క్షితిపతి తప్పు గోరు । దండికర్ణము గ్రామదండుగ గోరును । జంబుకంబేవేళ శివముగోరు । కుజనుడో వైద్యుండు ప్రజకురోగము గోరు। సామాన్యవిప్రుండుచావుగోరు। సతిజారులగువారు రతిగోరుచుందురు మెనుబోతు పేదల యశముగోరు। కాపువానికి గ్రామాధికారమైన। దేవభూసుర వృత్తులు దీయగోరు॥ మదరి॥

౩౯॥ సీ॥ తండ్రిమధ్వాచారి తనయుడారాధ్యుండు తల్లిరామానుజ మతస్థురాలు । తానుకాంచిమతంబు తమ్ముడుబౌద్ధుండు సర్వేశ్వరమతంబు షడకనిది । ఆలుకోమటిజాతి యక్కజంగమదాసు బావగారిదిలింగ బలిజకులము । ఆడబిడ్డసుకారి అల్లుడుపింజారి మరదలు కోడలు మారువాడి । కలియుగంబునవర్ణ సంకరులు ప్రబలి । ఉత్తమకులంబులొక మూలనొత్తిగిల్లె॥ మ॥

౪౪॥ సీ॥ నంబికవిత్వంబు తంబళజ్యోతిశ్యంబు వలనొప్పుకోమటి వైష్ణవంబు। వరుసనే యుప్పరవాని సన్యాసంబు తరువాతశూద్రి సంతర్పణంబు । రజకునిగానంబు రండాప్రభుత్వంబు వెలయగానరవల వితరణంబు । సాతాని విద్యాంగశాస్త్రవాదము వేశ్యతనయు డబ్బకుబెట్టుతద్దినంబు । నుభయభ్రష్టత్వములు జూడనుర్విలోన రాజసభలందునెన్నగా రాదుగదుర ॥ మదర॥

౪౯॥ సీ॥ వెల్లులివనములో వెలయంగజోరీగ । పికము పాడూరి పోతురాజు । సాలెజాండ్రలలోన సాతాని పండితుం డంధులలోన నేకాక్షిశ్రేష్టు। డతిలోభిరాజున కర్థంబు లడుగనివాడెపో పండితవర్యుడరయ । కాపుమంత్రిములలో కాట్రేడుదైవంబు కొక్కరాయలలోకి కొంగఘనము । గుడిశవాటులకిల్లాలు గుత్తలంజ । గనుకనీరీతి పెక్కులు గలవుదలప ॥ మదరి॥

సుమతిశతకం ॥ నరపతులు మేరదప్పిన తిరమొప్పగ విధవయింటి తీర్పరియైనన్ । గరణము వైదికుడైనను మరణాంతకమౌను గాని మానదుసుమతీ ॥

క॥ కరణము సాధై యున్నను గరిమదముడిగినను పాముకరువ

కఁదోయున్నఁ దరతేజ మీరాటకున్నను గరమరుదుగ లెక్కఁగొనరు గదరా సుమతీ ॥

క॥ వెలయాలు సేయుబాసలు । వెలయగనగసాల పొందు వెలమచెలిమియున్ । కలలోనఁగన్న కలిమియు । విలసితముగ నమ్మరాదు వినురా సుమతీ ॥

ఇట్లనేకుల ననేకరీతులనిందించి కొందరు కుకవులు లజ్జావిహీనులయి తమకుఁగల కవిత్వరచనంతయు పరదూషణార్థముగా వినియోగపరతురిట్టి స్వస్తుతి, పక్షపాతము, సంప్రదాయభంగము, శాస్త్రబాధ, మత్సరము, నీతిలోపము, నిందాది దుష్ప్రయోగగ్రంథంబులు పండితామోదంబులు గాకపోవుటయెగాక సత్పురుషుల కనాదరణీయంబులుగా నెరుంగవలయును మరియు నిట్టిగ్రంథము లన్యధనాపహరణోపరవంచకాది మాయోపాయోక్తులచే చరించు దుర్మార్గజనసముదయంబునకు సహకారియును మానరక్షణ వ్యాపారములకు విషతుల్యంబునునగు నివి పూజ్యంబులు గావు. పూర్వము పల్లెకూటములలో బాలురకు విద్యనేర్పు పంతుళ్లు శాస్త్రజ్ఞాన విహీనులగుటచేతనో లేక దుష్టభావంబుననో హిందూదేశమందీ నీతి విరహిత గ్రంథంబులనే ముఖ్యపాఠములుగా నేర్పరచి బాలురకు ప్రబోధించుటను బట్టి బాలురకును పంతుళ్లకు వలెనె జ్ఞానహీనత గలిగి ఇంత దుర్మార్గము లోకి రావడము కలిగినది. యీగ్రంథంబులు రచియించి వారికుల నామ గోత్రంబు లెచటను కనుపరచ కుండుటయే కుజనాగ్రేసరులనుటకు ముఖ్యకారణము. వేణుగోపాల శతకంబురచించినవాడు బ్రాహ్మణాది చాతుర్వర్ణంబులలోని వాడు కాడు. సంకర జాతులను కూడా నిందించుటను బట్టి వారలలోని వాడు కానట్టు తోచుచున్నది.

(ఇకను) కన్న నాలంజకొడుకులు కవులుగాక (వేదశాస్త్రంబు లేడను విప్రులేడనుచో) బ్రాహ్మణుం డేమోయని దలచుటకు సర్వధర్మజ్ఞులను భగవత్స్వరూపులనగు బ్రాహ్మణులకిట్టి యసూయాద్యవగుణంబులు గలుగు ననరాదు.

భారతం - ఆది - ప్రథ.

క॥ పరనిందయు నాత్మ గుణో । త్కర పరికీర్తనము జేయగా నుచితమె స । త్పురుషులకైనను నీక । చ్చెరువగ నాకలతెరంగు జెప్పెద బ్రీతిన్॥

క॥ పురుషుండు రెండు తెరగుల । ధరను త్తము డనగ బరగు దానెయ్యెడలన్ । బరుసములు వలుకకునికిన్ దురితంబులు వైరయు పరుల దొరగుటవలనన్॥

భారతసారరత్నావళి.

క॥ అనహంకారమున బ్రా । ధ్ధనమును విషయముల బెద్దగులమియును మే । లనఘా పరునిందించుట దనువర్ణించుకొనుట నుచితము లెయ్యెడలన్॥

యీమూడు పద్యములకు ముఖ్యతాత్పర్యము స్వస్తవము పరనిందయు సత్పురుషులకైన నుచితము కాదనియు. (2) పరుసవాక్యములు పలుకకుండుటయు దుష్కార్యముల నొదలుటయును ఇవి గలుగువాడే నుత్తము డనియును. (3) పరులను నిందించుటయును తనను తావర్ణించుకొనుటయును ఉచితము కాదనియును నిట్లు పరనింద నుత్తమునకు నిషేధంబై యుండగా సర్వోత్తము డగు బ్రాహ్మణుండు యిట్లు రచించెనని చెప్పుటకు వలను పడదిక గుణగ్రహణాం

బున కులనిరూపణంబు చేయవలయు నెట్లనిన.

భారతం॥ అర॥ ౪ ఆ॥

వ॥ ప్రమాదవశంబున వర్ణసంకరంబై నప్పుడు వర్ణపరిశోధనం బుగా బ్రాహ్మణులకు వృత్తంబు వేరువేర స్వాయంభువుండైన మను వుసెప్పె. సత్యాది గుణంబులు శూద్రునందు గలిగెనేని వాడు సచ్ఛూద్రుండగుగాని బ్రాహ్మణుండుగా నేర్చునేయని యు బ్రాహ్మ ణునందు లేనివాడు శూద్రుండ యనంబడు గావున వృత్తంబులు యు త్తమంబులు.

గీ॥ వృత్తవంతుడు వెండియు వివిధగతులు। వృత్తవంతుడుగా నేర్చు। వృత్తహీనుడైన వాడు విహీనుండ యంద్రుగాన। విత్తరక్షకు గడుమేలు వృత్తరక్ష॥

ఇట్లు వర్ణనిరూపణ దెలియని సమయంబున గుణగ్రహణం బంగీకరించి తెలియ వలయునని చెప్పియున్నది.

వేమనశతకం.

గీ॥ ఎంత చదువుచదివి యెన్ని విన్ననుగాని హీనుడవగుణంబు మానలేడు । బొగ్గు పాల గడుగ బోవునా మలినంబు విశ్వదాభిరామ వినర వేమా॥

గీ॥ హీను డెన్నివిద్యల నభ్యసించిన ఘనుడు కాడు హీనజను డెకాని । పరిమళములు గార్దభమునమోసియ ఘనమౌనె॥ విశ్వ॥

భర్తృహరియందు.

గీ॥ విద్యచే భూషితుండై వెలయుచున్న । దొడరి వర్జింప

నగు సుమీా దుర్జనుండు। చారుమాణిక్య భూషిత శ స్తమ స్తకంబైన పన్నగము భయంకరముగాదే।

ఇట్లు గుణహీనుడు హీనుడనియును యెంత చదివినను విన్నను హీనుడు తను అవగుణంబులు మానలేడనియును హీనుడెన్నివిద్యలభ్యసించినను ఘనుడు కాడనియును విద్యచే భూషితుండైనను దుర్జనుని వర్జింపవలె ననియు జెప్పియుండుటను బట్టి ఇతను హీనజాతి వాడని గుణనిర్ణయంబున సిద్ధాంతము జేయుటయం దేసంశయము లేదు. మీారు కోరిన ప్రశ్న ప్రమాణార్హము కాదు,

ప్రశ్న:—— తాడిమళ్ళ రాజగోపాలశతకం.

సీ। పసులగాపరియైన పద్మనాభుని కేను బడలినెట్లుపుతిని బాల్యమునను । నుట్టిబెట్టినవెన్న గుట్టుగామెక్కిన చోరుని కేనేలసుద తినైతి । గడియగడియకునేమ గాడంచుదెలియక వెట్టిగొల్లని కేల వెలదినైతి । నవతారమూర్తియం చాశనొందితిగాని దైత్యసంహారు డంచు దలచనైతి । నలినయీావేళ రుక్మిణీపతినిగాంచి । విసికియున్నదిగమ్మని వేగిరంబ । తరుణినీవేగి యుచటికి తాడిమళ్ళ । రాజగోపాలుదేగదే రాజవదన ॥

వెట్టిగొల్లడని ప్రయోగించుటయును యెంతమంచిగొల్లవానికైనను వేపకాయంత వెట్టియుండుననని కొందరుపలుకుచుందురు యీాయదువంశసంభూతులగు క్షత్రియులయందట్లు నిరూపించుటకు కారణమున్నదా.

ఉ:—— వెట్టియనగా అపస్మారినామము ఆంధ్రనామసంగ్రహము మానవవర్గ.

సీ॥ గిటకపొట్టితురుచ గిట్టగుజ్జనగవామనుఁడొప్పు జతునకపస్మా రిపీళ్ళు । వెకగు వేమరువెట్టి వీరడి వేరడి వెంగిలి వెంబరవిత్తనంగ॥

అపస్మారియను సంస్కృత శబ్దమునకు ఆంధ్రమున వెట్టియని చెప్పబడును. అట్టివెట్టి యాచంద్రవంశక్షత్రియకులము నవలంబించు కవచ్చినట్లు యేవిధమయిన ప్రమాణములు లేవు.

భాగ-నవమ॥

[1] క॥ వినియూ వినవు రణభీరువు । మనుజాధము నికురబో తుమందుని నకటా । నినుజక్రవర్తి జేశిన వనజాసనుకంటె వెట్టివా డుఁగలడే ॥

ఇట్లు బ్రహ్మయును వెట్టివాఁడని జెప్పియున్నందున తదావయవ జనితులగు బ్రహ్మ, క్షత్ర, వైశ్య, శూద్రాదులకును వెట్టి సిర్ణయింపవలసినదేకదా.

భాగ-దశ॥

[2] ఆట॥ గీ॥ ఆప్రకారమెరిగి హరివిశ్వరూపుండు వెట్టితపసిచేయు వేడబంబు జిక్కఁబెట్టుమంచు జక్రింబుబంచిన। వచ్చెనదియు ప్రళయవహ్నిపగిది ॥

ద్వాదశి వ్రతపారణకై వ్రతవిఘ్ననివారకంబుగా యూపోశనంబుచేయించిన ఆజామీళుని శపింపంబూనిన దూర్వాసునిగురించి శ్రీవిష్ణుమూర్తి చక్రంబుబంపుచూ వెట్టితపసియొక్క వేడబంబు కుదుర్చుమని చెప్పినట్లును.

భాగ - నవ.

[3] క॥ గుజ్జము గొనిపో బుద్ధుల । కుజ్జడ మీాతాత రొద్ద

కం॥ విశాలంద్రుల్ వెట్టులు నీశ్వరరత్న యా । మిట్టున గంగాజలంబు మెలగ శుభమగుఁ॥

సగర చక్రవర్తి మనుమడగు యంశుమంతుడను వానింగూర్చి కపిల మహర్షి పలికినట్లును.

భాగ - సప్తమస్కంధము.

[4] క॥ నావంటి వెట్టివానిని । శ్రీవల్లభ నీవు శాస్త్రిజేసితి వేనిఁ। గావరముమాని పెద్దలతోఁ వర్తజరుగుదురు బుద్ధితోఁ డుతనీశా॥

[5] క॥ ఒక్కొకలోకము నేలుచు। నెక్కుడు గర్వముననేమే యీశుల మనుమన్ । జొక్కు నను బోటి వెట్టులు । నిక్కము నీమహిమ దెలియ నేగరవంతా॥ అని యింద్రుడు శ్రీకృష్ణుని గూర్చి పలికినట్లును.

భాగ - సప్త.

[6] క॥ చొక్కపు రక్కసికులమున । పెక్కురు జనియించి రిందు పీతాంబరునిఁ । నిక్కపు మక్కువ గొలిచెడి నెక్కడి సుతు గంటి దానవేశ్వర వెట్టిఁ॥ ఇట్లు హిరణ్యకశిపునితో చండామార్కులాడి నట్లును.

భాగ - నవమ.

[7] ఉ॥ బాలుడు వెట్టిబ్రాహ్మణుడు బ్రాహ్మణకై వడి నుంటమాని భూ । పాలురతోడ భూరిజయ భవ్యులతోడ జయంబు దక్కె కి । య్యాలకు వచ్చినాడు మనయందిక బాపము లేదు లెంకు లెం । డేల సహింప భూసురుని నేయుడు క్రేసరుడు గూల్పు డిమ్మహిఁ॥

భాగ - నవమస్కం.

[8] సీ॥ వసుధలోఁ బుట్టెడువార్త లాకర్ణించు కొరకునై రా
ముండు గూఢవృత్తి । నడురేయి దిరుగుచోఁ నాగరజనులలోఁ నొక్క
డు తన సతి యొప్పకున్న । నొరులింట గాపురంబున జంచలు రాలి ।
బాయంగ లేక చేపట్టెనేమి । తావెఱ్ఱియగు రామధరణీశ్వరుండనే
బేలబొమ్మని మాటబిట్టు వలుక । నాలకించి పురియు నావగాట చా
రుల । వలన జగములోన గలుగ దెలిశి । సీతనిద్రపోవ జెప్పక వాల్మీ
కి పర్ణశాల బెట్టబనిచె రాత్రి॥

భార-సభాప-౨-ఆశ్వా॥

[9] ఉ॥ ఇమ్మడి వెఱ్ఱివీని పరమేశ్వరుగా గొనియాడేధర్మ
తత్వమ్ములు పాండవేయులును దానును గాని యెఱుంగవంచు నా ।
వమ్ముల నెల్లవారి నవమాన్యులజేసిన మాన్యుడంచు రూ । తుంబు
గ భీష్ముజూచి బల గర్వితుడిట్లని బల్కెసల్కతోఁ ॥ ఇట్లు భీ
ష్ముని గూర్చి శిశుపాలుడు పలికినట్లును.

భారతము - అర - ౪ ఆ.

[10] గీ॥ ధరణి మరియును బెక్కు విధంబులందు । బ్రహ్మ
విదులయిన బ్రాహ్మణ ప్రభుల మహిమ । విసమె యెరిగి యెరింగి
సద్విసుతచరిత । కొరవిగొని వెఱ్ఱిన తలగొకి కొనగ॥ ఇట్లు కౌశికు
డను బ్రాహ్మణునితోఁ పతివ్రతా తిలకము పలికి నట్లును.

భార - ఆది ౭ ఆ.

[11] గీ॥ వెడగే యుట్టిపాటు వెరపించుటలును మా । యలు

ను నేమిజేయు నస్త్రవిసుల । బెక్కులయ్యు నీవిభీషికల్ నురువులు విరిపోయినట్లు లింపు విరియు జూచె॥ ఇట్లు అంగారపర్ణుని గూర్చి అర్జునుండు పలికి నట్లును.

భార-సభా-తృతీ॥

[12] చ॥ కడుకొని ధర్మమెరుఁగంగ నశక్యము ధర్మబాహ్యుని । న్నొడబడకష్టుడై కరపియుత్తముఁడంగ వాసుదేవుడట । జమునకు బూజయిన్మని విచారవిదూరుడు భీష్ముడెంతయుణ । వెడగుదనంబునం బనిచె వృద్ధులబుద్ధులు సంచలింపవే ॥ ఇట్లు భీష్ముని గూర్చి శిశుపాలుడు పలికినట్లును,

భార, నలచరిత్రలో 163 పద్యం.

[13] గీ॥ అడవిదన్నుబాసి యరిగిన నలిగికా । కన్నెనిట్లు చేయ నువిదగడగె । నిట్లుయేనికూర్తు రింతులుమాఱు విశ్వసించువారు వెడగులెందు ॥

[14] గీ॥ చచ్చెననుచు జావుకువగచెడు। దీననరుల వెఱ్ఱి దెలుపరాదు । ప్రాణమునకుమృత్యు బంధంబులుండునా । విశ్వదాభిరామ వినురవేమా ॥

[15] గీ॥ బ్రహ్మమేడననుచు పలుమారునాడేరు వెఱ్ఱిమూర్ఖజనుల విధముజూడ । బ్రహ్మమన్నిటందు పరిపూర్ణమైయుండు । విశ్వదాభిరామ వినురవేమా ॥

[16] గీ॥ ఎవ్వడెరుగకుండు నెప్పుడుపోవునో । పోవుజీవమట్లు బొందివిడచి । యంతమాత్రమునకు నపకీర్తియరుగక । విరగబడున రుండు వెఱ్ఱివేమా ॥

[17] గీ॥ బ్రతుకు నిత్యమనుచు పదునెంచువగమీర విట్టపీగు వాసె వెట్టినారు। ప్రాణులెల్లయమునిబారిగొట్టెలు సుమీ। విశ్వ॥

[18] గీ॥ తాముగడనసేయు ధనముతమదియని నమ్మియుం డువెట్టి నరులుభువిని। తాముసొకరికిచ్చు ధనమింతియెగాక కడమది తనకేల గలుగువేమా॥

[19] గీ॥ ఆకులన్నిదిన్న మేకపోతులకెల్ల। గాకపోయేనయ్య గాయసిద్ధి। లోకులెల్ల వెట్టిపోకిళ్లుపోదురు। విశ్వ॥

[20] గీ॥ శివుడుఘనుడటంచు శిలలకుమొక్కెడి। వెట్టిజీవు లార వెతలవిడుడి। జీవులందెగాక శిలలయేమున్నది। విశ్వ॥

[21] గీ॥ కంటికంటిమనుచు కర్మాధికారంబు। వెంటబెట్టి చెసును వెట్టినరుడు బట్టబైటముక్తి బాటించిచూడరో। విశ్వ॥

భాగ— దశ.

[22] గీ॥ భూరివిజ్ఞాన విమలగు నారదాది। నిర్మలాత్ముల కైన వర్ణింపరాని। హరికథామృత పానంబునందువిసివి। యొల్లనను వాడె పోవెట్టి గొల్లడనఘా॥

(1) పద్యములో బ్రహ్మకు వెట్టి వున్నట్లును.

(2) పద్యములో తపసికి వెట్టివున్నట్లును.

(3) పద్యములో సాగరులకు వెట్టివున్నట్లును.

(4-5) పద్యములలో ఇంద్రునకు వెట్టివున్నట్లును.

(6) ప్రహ్లాదునకు వెట్టివున్నట్లును.

(7) బ్రాహ్మణునకు వెట్టివున్నట్లును.

(8) శ్రీరామునకు వెట్టివున్నట్లును.

(9-12) భీష్మాచార్యునకు వెట్టివున్నట్లును.

[11] అంగారపర్ణునకు వెట్టివున్నట్లును.

ఇట్లు అనేకచోట్లుల వెట్టిశబ్ద ప్రయోగములుకలవు.

స్త్రీలనమ్మువారును, చావుకవగచెందువారును, బహ్మమేడన నువారును, అపకీర్తి నెరిగక పిరగబడు నరుడును, బ్రతుకునిత్యమని విజ్ఞవీగువారును, తాము గడనసేయుధనము తమదియని నమ్మియుండు నరులును, శివుడని శిలలకు నమస్కరించువారును, వెట్టులేయని చెప్పియుండుటచే బట్టి పై కారణములు బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రాదిక సర్వవర్ణములయందు కలిగియుండుటచే బట్టి అందరువెట్టులనియే నిర్ణయింపవచ్చును. వెట్టిశబ్దము ఒక కులమునందుగాని ఒకనియందుగాని చిరత్వము కలదికాదు. యెందువల్లననగా. 22 పద్యము.

గీ॥ భూరివిజ్ఞానవిమలగు నారదాది । నిర్మలాత్ముల కైన వర్ణింపరాని । హరికథా మృతపానంబునందు విసివి । యొల్లననువాడె పో వెట్టిగొల్లడనఘా ॥

యీపద్యములో [వాడు] అనుసర్వనామమునకు గొల్లడుఅనునది విశేషణమును వెట్టి అనునది క్రియావిశేషణమును అయివున్నది. గొల్లడుఅనగా గోవుల కాయువాడనియును, వెట్టియనగా జ్ఞానహీనుడనియును అర్థము కాబట్టి బ్రహ్మక్షత్ర వైశ్యశూద్రులలో నెవ్వడయితె హరికథామృతపాన మొల్లననునో వాడు పశువుల కాయువాడును, వెట్టివాడునగును. అనగా కేవల జ్ఞానహీనుడని

తాత్పర్యము. ఇందువలనబట్టిచూడగా ప్రతివర్ణమందును జ్ఞానహీనులును జ్ఞానులునుగలరు. గనుక వెట్టివారలును వెట్టిలేనివారలును బ్రాహ్మణాది సర్వవర్ణములయందును కలరు. గనుక వెట్టిగొల్లయను శబ్దంబు బ్రాహ్మణాది అన్నివర్ణములవారికి చెల్లునని యెరుంగవలయును.

మరిన్ని యెంతమంచి గొల్లవానికైనను వేసకాయంత వెట్టి వుండునని వాడుక కలుగుటకు కారణమేమని మీరడిగితిరి. అందుకు వెట్టికి పరిమాణము నిర్ణయించువాని వెట్టిని గణింపజాలను. ఇట్టి దుర్వాడుకలు కులమాత్సర్యములచే కల్పింపబడినవి. ఇట్టివి ప్రతికులమువారికి ననేకరీతులగలవు. యివి యొకరినొకరు దెగడునప్పుడు కుప్పలు తెప్పలుగా బయలుదేరును. అవి యిప్పుడిక్కడ దెలుపుట లనావశ్యకమగుటచే విరమించితి. ఇదియునుగాక పద్యములయందుకూడా ప్రకటించియున్నారు. కొన్ని యీదిగువను కనుపరచెదను

దాసు శ్రీరాములుగారు రచించు తెలుగునాడను గ్రంథమందు.

మ॥ నిజమో కల్లయొ గానెరుంగను నరుల్ నిందింత్రు నిచ్చల్ నియో । గి జనశ్రేణిని కుక్కగుంపనుచు మాధ్వద్విజప్రజలంగాకు లటంచు వైదికులు రాబందుల్గదాయంచు బేరజమాడ్కి దొరకొందు రీ దీనికొక చేరంగారణంబుండెడిన్ ॥

మనుచరిత్ర.

మ॥ అకలంకౌషధ సత్వముర్దెలియ మాయాద్వారకా వంతికాశి కురుక్షేత్ర గయాప్రయాగములనే సేవింపకుద్దండ గండకవేదండ వరాహవాహారిపు ఖడ్గవ్యాఘ్రమింమ్రించు కొండకు రాజెల్లునె బుద్ధిజాడ్య జనితోన్మాదుల్ కదా శ్రోత్రియుల్ ॥

ఇట్లనేకములుగలవు గావున వెట్టిశబ్దమను జ్ఞానహీనతను దెలుపుటకు బదులుగా వాడుకచేయబడినది అట్టివెట్టి బ్రహ్మాది సర్వజాతులకుఁగలదు. గొల్లలను వృత్తినామముగల చంద్రవంశక్షత్రియులకు మాత్రమెకలదనియు తక్కినవారికి వెట్టి లేదనిచెప్పరాదు. అట్లు చెప్పువాడే వెట్టివాడని స్పష్టముగా యెఱుంగవలయును.

ప్రశ్న:--- ఇప్పుడీ చంద్రవంశక్షత్రియులను గొల్లలనిచెప్పవచ్చునా చెప్పకూడదా.

ఉ:--- అట్లుచెప్పకూడదు ఏలననగా వీరియొక్క వృత్తినామము చెప్పవలసి వచ్చినప్పుడుమాత్రము గొల్లలనియును, కులముచెప్పవలసివచ్చినప్పుడు చంద్రవంశక్షత్రియులనియును, ద్వాపరయుగమందు శ్రీకృష్ణాదులు చెప్పియున్నట్లు స్పష్టముగా మీకుయిదివరకె వివరించితిని ఇప్పుడు కులము చెప్పవలసివచ్చినప్పుడు వృత్తినామమెట్లుచెప్పవచ్చును.

యీకలియుగమం దేయేవర్ణములకు యేర్పడియుండిన వృత్తులాయావర్ణములవారు నడుచుకొనక అన్యోన్యవృత్తు లవలంబించి జీవించుచున్నారు. గనుక వృత్తినామమున కులనామము దెలియఁబడదు.

వడ్లబత్తుడుఅనినయడల వడ్రంగము తురకలును శూద్రులును చేయుచున్నారు వారలవడ్రబత్తుడనిన విశ్వబ్రాహ్మణవర్ణమును సూచించుచున్నది. శూద్రాది యితరజాతులును బ్రాహ్మణులును వర్తకముచేయుచున్నారు వారికివృత్తినామము వర్తకులందురు. అట్టివారల వర్తకులనిన వైశ్యవృత్తినిబట్టి వైశ్యులని అర్థమగునుగావున

వృత్తులు మాటనబట్టి ప్రధానవర్గమునే స్పష్టముగా జెప్పవలయును. యీ చంద్రవంశక్షత్రియులను వృత్తినామమగు గొల్లలని చెప్పినయే తద్వృత్తులు సర్వవర్ణులాచరించుటను బట్టియును వృత్తినామమున అన్నివర్ణములవారిని గొల్లలనబడుదురు. అందునబట్టి వర్ణనిర్ణయము బోధపడదు గనుక క్షత్రియులనియె చెప్పవలయును.

శ్రీకృష్ణ గురుపరబ్రహ్మార్పణమస్తు.

రాజవంశప్రదీపిక

సంపూర్ణము.



